# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 8 సంచిక : 1 హైదరాబాద్ 102 జనవరి 2010 పేజీలు : 60 రు. 10


* ఫోకస్ : చదవవలసిన పుస్తకాలు
* తెలంగాణ - సమైక్యాంధ్ర ఆందోళనలు
* లాల్‌ఘఢ్‌లో ప్రజా ప్రజ్వలనం
* కడపకు వైఎస్ పేరు సమంజసమా ?
* నారాయణ్ పాట్నా పోలీసు కాల్పులు
* మనుషుల ఆవిర్భావం

# వీక్షణం రచయితల సమావేశానికి ఆహ్వానం !

**(డిసెంబర్ 13న జరగవలసిన సమావేశం అనివార్య కారణాల వల్ల ఫిబ్రవరి 7కు వాయిదా పడింది)**

**తేది** : **ఫిబ్రవరి 7, 2010 ఆదివారం**

**సమయం** : **ఉదయం 10 గంటల నుంచి భోజన విరామం దాకా**

**స్థలం** : **ప్రెస్ క్లబ్,** ఈనాడు ఎదురుగా, సోమాజిగూడ, హైదరాబాద్.

పాఠకుల ఆదరాభిమానాలను విశేషంగా చూరగొంటూ ఏడు సంవత్సరాలుగా నిరంతరాయంగా సాగుతున్న వీక్షణం రాజకీయార్థిక, సామాజిక మాసపత్రికకు బలం చేకూరుస్తున్నది మీ వంటి రచయితల రచనలే. ఇప్పటికి వెలువడిన వంద సంచికలలో వీక్షణం 1200 వ్యాసాలు, రచనలు ప్రచురించింది. ఆరువందల మందికి పైగా రచయితలు ఈ కృషిలో పాలుపంచుకున్నారు. అందులో కనీసం రెండు వందలమంది వీక్షణం ద్వారానే మొదటిసారిగా సామాజిక, రాజకీయార్థిక విశ్లేషణ ప్రారంభించారు. వీక్షణం రచయితల జాబితా ఎంత విస్తృతమయినదంటే, ఆ జాబితాలో లేని తెలుగు సామాజిక శాస్త్రవేత్తలు, మేధావులు, వ్యాఖ్యాతలు అతి తక్కువమంది. ఇలా వీక్షణం పురోగతికి, తెలుగు సమాజంలో అత్యవసరమైన భావజాల కృషికి మీరు చేస్తున్న దోహదానికి ధన్యవాదాలు.

ఐనా సాధించవలసింది ఎంతో ఉంది. మరెన్నో రంగాలమీద రచనలు, చర్చలు, విశ్లేషణలు, అనువాదాలు జరగవలసే ఉన్నాయి. తెలుగు సమాజం తెలుసుకోవలసిన, చర్చించవలసిన విషయాలు, ప్రపంచానికి చెప్పవలసిన విషయాలు ఎన్నో ఉన్నాయి. ఆ కృషికంతటికీ వేదిక కల్పించవలసిన బాధ్యత వీక్షణం పైన కూడ ఉంది. ఆ బాధ్యత నెరవేర్చడానికి మరింతమంది రచయితలు కావాలి. అనువాదకులు కావాలి. ఇతోధికమైన సలహాలు, సూచనలు కావాలి.

అందువల్ల రచయితలతోనూ, రచనలు చేయదలచుకున్నవారితోనూ నిరంతర సంభాషణ జరుపుతూ ఉండాలని, రచయితల మధ్య సంభాషణకు వేదిక కల్పించాలనీ వీక్షణం సంపాదకవర్గం భావిస్తోంది. ఆ దిశగా, గతంలో జరిగిన సమావేశాలకు కొనసాగింపుగా, వీక్షణం రచయితల సమావేశాన్ని ఫిబ్రవరి 7న ఆదివారం జరపదలిచాం. వీక్షణంకు రాసినవారూ, రాయదలచుకున్నవారూ అందరూ ఆహ్వానితులే. మీరు తప్పనిసరిగా ఈ సమావేశంలో పాల్గొనాలని, మీ విలువైన అభిప్రాయాలను పంచుకుని, వీక్షణం అభివృద్ధికి తోడ్పడాలని మా కోరిక.

**వివరాలకు** : కార్యాలయం – 040 6684 3495

(ఉదయం 10.00 నుంచి సాయంత్రం 6.00 గంటల వరకు)

**వీక్షణం**

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3 హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495,
ఇమెయిల్ : veekshanam2003@gmail.com, reachcdrc@yahoo.com

**పాఠకులకు, రచయితలకు, ప్రకటనకర్తలకు, శ్రేయోభిలాషులకు**
**2010 నూతన సంవత్సర శుభాకాంక్షలు**


# వీక్షణం 102

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

జనవరి 2010
సంపుటి : 8
సంచిక : 1



గౌరవ సంపాదకులు :
**వి. హనుమంతరావు**

సంపాదకులు :
**ఎన్. వేణుగోపాల్**

సహాయ సంపాదకులు :
**డి.వి.రామకృష్ణారావు**

కరస్పాండెంట్ /
సర్క్యులేషన్ మేనేజర్ :
**వై. రామచంద్రం**
**9949391028**

కరస్పాండెంట్/సబ్ఎడిటర్ :
**సి. రాజశేఖర్**

ఆఫీస్ అసిస్టెంట్ :
**ఎస్. వెంకటేష్**

**వీక్షణం చందా వివరాలు**

| | | |
|---|---|---|
| సంవత్సర చందా | రు. | 120 |
| 3 సంవత్సరాల చందా | రు. | 350 |
| 5 సంవత్సరాల చందా | రు. | 550 |
| 10 సంవత్సరాల చందా | రు. | 1000 |

**'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు,**
**డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం**
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
reachcdrc@yahoo.com
వీక్షణం అకౌంట్ నెంబర్ –
**013911011002175**
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్,
హైదరాబాద్

డిస్ట్రిబ్యూటర్స్
**ఆనంద్ ఏజన్సీస్,** హైదరాబాద్.
ఫోన్ : 98484 28516
98482 49695

ప్రింటర్స్
**చరితా ఇంప్రెషన్స్,**
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411


సంపాదకీయం

## కూడలిలో తెలుగుజాతి భవిష్యత్తు

**మూ**డువేల సంవత్సరాల చరిత్రలో, యాభైమూడు సంవత్సరాల ఆంధ్రప్రదేశ్ అనుభవంలో ఎన్నడూ ఎరగనంత కీలకమైన, సంక్షుభితమైన కూడలిలో తెలుగుజాతి నిలిచిఉంది. పాలకులు విజ్ఞులయి ఉంటే సులభంగానే నివారించగలిగిన అత్యంత విషాదకరమైన ఈ ఘట్టం నవంబర్ చివరిలో ప్రారంభమై అనేక అనూహ్యమైన మలుపులు తిరుగుతూ ఏక్షణానికి ఏం జరుగుతుందో చెప్పలేని స్థితికి చేరింది. ఈ నెలరోజుల చరిత్రలో తెలుగుసీమలోని మూడుప్రాంతాల రాజకీయపక్షాలు, ప్రజలు వ్యవహరించిన తీరు గురించి లోతుగా ఆలోచించవలసిన అవసరం ఉంది. ఐదు దశాబ్దాలుగా గురయిన వివక్షకు వ్యతిరేకంగా తెలంగాణలో మొదటి పది రోజులు ప్రజల ధర్మాగ్రహం వ్యక్తం కాగా, కేంద్రప్రభుత్వం తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ప్రక్రియను ప్రారంభిస్తున్నానని ప్రకటించింది. దానితో ఆంధ్రప్రదేశ్ కొనసాగడం లోనే ప్రయోజనాలు ఉన్న పాలకవర్గాలు, ముఖ్యంగా హైదరాబాద్ లోనూ చుట్టుపట్లా ఆర్థిక ప్రయోజనాలు ఉన్న రాజకీయ, వ్యాపారవేత్తలు కోస్తాంధ్ర, రాయలసీమ ప్రజలను, విద్యార్థులను అబద్ధాలమీద ఆధారపడి రెచ్చగొట్టడం మొదలుపెట్టారు. ఆ ఆందోళనలో భాగమయిన సాధారణ ప్రజల, విద్యార్థుల అనుమానాలు, సమస్యలు ఏమిటో తెలుసుకుని వాటిని నివృత్తి చేసి ఉద్రిక్తతలను తగ్గించడానికి తెలంగాణ వైపు నుంచి కూడ ఏప్రయత్నమూ జరగలేదు. మొత్తానికి మూడు ప్రాంతాలలోనూ ప్రజా ఉద్యమాలు తప్పుడు రూపాలలోకి, వ్యక్తీకరణలలోకి ప్రవేశించాయి. అబద్ధపు నిరాహారదీక్షలు, దిష్టిబొమ్మల దగ్ధం, అవమానకరమైన దుర్భాషలు, శవదహనం, పిండప్రదానం, శిరోముండనం, పాల అభిషేకం వంటి మతసంబంధమైన కర్మకాండతో కూడిన నిరసనలు, స్త్రీలను, అణగారిన వర్గాలను కించపరిచే వ్యక్తీకరణలు వెలువడ్డాయి. రెండు ప్రాంతాల ప్రజల మధ్య అనవసరమైన, అవాంఛనీయమైన విద్వేషాలు, వైమనస్యం పెరిగిపోయాయి. రాష్ట్ర భౌగోళిక విభజన జరగకపోయినా, మానసిక విభజన జరిగిపోయింది. వందల సంవత్సరాలుగా వీరోచితమైన, అభివృద్ధికరమైన ప్రజాపోరాటాలు సాగించిన తెలుగుజాతి ఇంతగా దిగజారిన పోరాట రూపాలను ఎన్నుకుంటున్నదా అనీ, ఎన్నో న్యాయమైన ఉద్యమాలు నడిపిన ప్రజలు ఇన్ని అబద్ధాల మీద ఆధారపడిన అన్యాయమైన ఆందోళనలకు సిద్ధపడతున్నారా అనీ ఆందోళన కలుగుతున్నది. ఒక చోట న్యాయమైన సమస్యలమీద పోరాడుతున్న ప్రజలపట్ల సంఘీభావం ప్రకటించే బదులు, తమ నాయకుల దగాకోరు అబద్ధాలమీద రెచ్చిపోయే స్థితికి తెలుగు ప్రజలు చేరారా అని అనుమానం కలుగుతున్నది. మొత్తం మీద రాజకీయ నాయకులు ఏ ప్రజలకు తాము నాయకత్వం వహిస్తున్నారో ఆ ప్రజలకు నిజాలు చెప్పరని తేలిపోయింది. తమ పోరాటం వల్ల నష్టపోతామని అనుమానిస్తున్న అవతలి వర్గాలకు, ఆ అనుమానాలు ఎంత నిరాధారమైనవో చూపించే ఓపిక పోరాట నాయకులకు లేదని అర్థమవుతున్నది. మొదటి పదిరోజుల తెలంగాణ ప్రజాపోరాటం కేవలం ఆ పదిరోజుల వ్యవహారం కాదు. అసలు ఆంధ్రప్రదేశ్ అనే ఉమ్మడి రాష్ట్రంలోకి తాము రామనీ, అలా విలీనమయితే తాము దోపిడీకి, వివక్షకు గురవుతామనీ తెలంగాణ ప్రజలు ఆంధ్రప్రదేశ్ ఏర్పాటుకు ముందే ప్రకటించారు. పెద్దమనుషుల ఒప్పందం ఆధారంగా తెలంగాణ ప్రజలకు స్పష్టమైన లిఖితపూర్వకమైన హామీలతో ఏర్పడిన ఆంధ్రప్రదేశ్ పాలకులు ఆ హామీలలో ఏ ఒక్కదాన్నీ అమలు చేయలేదు. ఆ రక్షణల అమలు కోసం ప్రారంభమైన ఉద్యమాన్ని నెత్తురుటేర్లలో ముంచారు. ఆ తర్వాత లెక్కలేనన్ని అనుకూల ప్రకటనలు, వాగ్దానాలు కూడ అమలు కానప్పుడు, చివరికి తమ ఆకాంక్షలు ప్రకటించే ఒకానొక రాజకీయపార్టీ, ఒకానొక రాజకీయ నాయకుడి ఆమరణ నిరాహారదీక్షను జరగనివ్వనప్పుడు, నిరసన తెలిపిన విద్యార్థుల రక్తం చిందించినప్పుడు తెలంగాణ ప్రజలు ఆందోళన ఉధృతం చేశారు. రాష్ట్ర ఏర్పాటు ప్రక్రియ ప్రారంభమయిందని కేంద్రం ప్రకటించినాక ఆ ఆందోళన విరమించారు. ఈ నేపథ్యమంతా చూస్తే ఆ ఆందోళననుగాని, కేంద్రప్రభుత్వ ప్రకటనను గాని తప్పు పట్టవలసిందేమీ లేదు. కాని నీటి పంపిణీ గురించి, విద్యావకాశాల గురించి, ఉద్యోగాల గురించి, హైదరాబాద్ గురించి కోస్తాంధ్ర, రాయలసీమ ప్రజలలో, విద్యార్థులలో ఉండగల అనుమానాలను, భయాందోళనలను నివృత్తి చేసే బదులు రాజకీయనాయకులే వాటిని అబద్ధాలతో, వక్రీకరణలతో రెచ్చగొట్టారు. జాతి భావనను యాభైసంవత్సరాలపాటు విచ్ఛిన్నం చేసినవారే జాతిభావన అనే అచారిత్రిక వాదన ఎత్తుకున్నారు. తమ దోపిడీ కొనసాగాలనే అనైతిక పునాది మీద, అన్యాయాలు జరగలేదనే అబద్ధాలమీద ఆందోళనను నిర్మించారు. ప్రజల, విద్యార్థుల అమాయకత్వం వల్ల ఆ తర్వాత పది రోజులు రాష్ట్రంలోని పదమూడు జిల్లాలు అల్లకల్లోలమయ్యాయి. మళ్లీ కేంద్ర ప్రభుత్వ వెనుకడుగుతో తెలంగాణలో ఆందోళన రాజుకుంది. ఈ పరిణామాలను వాస్తవికంగా, చారిత్రకంగా, న్యాయబద్ధంగా, మానవీయంగా ఆలోచించవలసిన బాధ్యత తెలుగువారిలో ప్రతి ఒక్కరిమీదా ఉంది. వీ

## లిబర్హాన్ నివేదిక చెపుతున్నదేమిటి?

దేశంలోని రెండు ప్రధాన మతవర్గాలను విభజించి పాలించాలని బ్రిటిష్ వలసపాలకులు పన్నిన కుటిల వ్యూహం నూట యాభై సంవత్సరాల తర్వాత కూడ ఆరని చిచ్చుగా రగులుతూనే ఉంది. వలసవాదులు దేశం వదిలివెళ్తూ ఎగసనదోసిన కల్లోలాలలో పది లక్షల మంది ప్రాణాలు పోగొట్టుకున్నారు. ఒక కోటీ నలభై లక్షల మంది కొంపాగోడూ వదిలి కాందిశీకులయిపోయారు. ఆ మహామానవ విషాదం నుంచి కూడ గుణపాఠాలు నేర్చుకోని ఈ దేశంలో ఈ అరవై రెండు సంవత్సరాలలో కూడ డజన్ల కొద్దీ కల్లోలాలు జరిగాయి. లక్షలాది మంది ప్రజలు ప్రాణాలు కోల్పోయారు. ఎన్నో కోట్లమంది నిర్వాసితులయ్యారు. మరెన్నో కోట్లమందిలో మత విద్వేషాల విషం పేరుకుపోయింది. ఈ మతవిద్వేషాలను ప్రత్యక్షంగానో, పరోక్షంగానో వినియోగించుకోకుండా ఉన్న రాజకీయ పక్షం ఒక్కటి కూడ లేదు. నిజానికి ఇటువంటి కల్లోలాలు జరిగినప్పుడు సముచితమైన, నిష్పాక్షికమైన న్యాయవిచారణ జరిపి దోషులను శిక్షించి, చట్టం ఎదుట అందరూ సమానులేననీ, ఇకముందు ఇటువంటి దుర్మార్గాలు జరగవనీ భద్రత కల్పించడం పాలకవర్గాల బాధ్యత. కాని మన పాలకపక్షాలన్నీ ప్రతిసారీ మతోన్మాద సంస్థల కొమ్ముకాశాయి. మతోన్మాదాన్ని రెచ్చగొట్టి దానిద్వారా వోటు బ్యాంకులను, ప్రభావక్షేత్రాలను మలచుకోవడానికి అన్ని రాజకీయపక్షాలూ ప్రయత్నిస్తూ వచ్చాయి. అందువల్లనే ఈ ఆరు దశాబ్దాలలో ఒక్క మతకల్లోల నేరం కూడ సరయిన విచారణకు నోచుకోలేదు. ఈ నేపథ్యంలో దేశంలో జరిగిన మతఘర్షణలన్నిటిలోకీ అత్యంత ప్రభావశీలమైన బాబ్రీమసీదు విధ్వంసం మీద విచారణ జరిపిన జస్టిస్ మన్మోహన్ సింగ్ లిబర్హాన్ నివేదికను పరిశీలించవలసి ఉంది. నాలుగువందల సంవత్సరాల చారిత్రక కట్టడం బాబ్రీ మసీదును పథకం ప్రకారం విధ్వంసం చేసిన సంఘ పరివార్ శక్తుల నేరాలు, కుట్రలు గత ఇరవై సంవత్సరాలుగా దేశ ప్రజల ముందు బహిరంగంగానే ఉన్నాయి. ఆ నాటి ముఖ్యమంత్రి కళ్యాణ్ సింగ్ సుప్రీంకోర్టుకు ఇచ్చిన హామీని కూడ తుంగలో తొక్కి నేరస్తులకు సహకరించడం, అంతకు కొన్ని సంవత్సరాలముందునుంచే సంఘపరివార సంస్థలన్నీ దేశవ్యాపిత విషప్రచారం, విధ్వంస ఏర్పాట్లు సాగించడం బహిరంగ రహస్యమే. ఆ కుటిల యత్నాలకు సహకరించడంద్వారాగాని, అడ్డుకోకపోవడం ద్వారా గాని ఇతర రాజకీయ పక్షాలు, ముఖ్యంగా కాంగ్రెస్ కూడ మతోన్మాద రాజకీయాలే నడిపాయి. లిబరాన్ కమిషన్ ఈ తెలియవలసిన నిజాలను బయటపెట్టలేదు. పదిహేడు సంవత్సరాలు విచారణ జరిపి బయటపెట్టిన విషయాలు తెలియనివేమీ కావు. నిజానికి ప్రజలకు, పత్రికలకు తెలిసిన విషయాలన్నిటినీ కూడ కమిషన్ నివేదిక ప్రకటించలేదు. ఎనిమిదికోట్ల రూపాయల ప్రజాధనం వెచ్చించి, వేలాది మంది సాక్షులను విచారించి ఆ కమిషన్ ఇంత నిస్సారమైన నివేదికను ఇచ్చింది. కాంగ్రెస్ ప్రభుత్వాధినేతల నేరభాగస్వామ్యం గురించి చెప్పలేదు. ఆ నివేదిక సిఫారసులమీద కొత్తగా ఏ చర్యలు తీసుకోనక్కరలేదని ప్రభుత్వం ప్రకటించింది. ఇవన్నీ చూస్తే ఈ దేశంలో న్యాయవిచారణ వ్యవస్థ కూడ విశ్వసనీయతను కోల్పోయిందనీ, కొనసాగుతున్న పాలనా విధానాల కింద అన్యాయానికీ, హింసకూ గురయ్యే పీడితులకు (ఈ సందర్భంలో మైనారిటీ మతస్తులకు) రక్షణ లేదని తేటతెల్లమవుతోంది.

## కోపెన్‌హాగెన్ సమావేశ పర్యవసానాలు

*డెన్మార్క్ రాజధాని కోపెన్‌హాగెన్‌లో వాతావరణ సంక్షోభంపై డిసెంబర్ 6 నుంచి 18 వరకు జరిగిన అంతర్జాతీయ శిఖరాగ్ర సమావేశం సామ్రాజ్యవాద దేశాల పాలకులకు, బహుళజాతిసంస్థలకు అనుకూలంగా, ప్రపంచ ప్రజలందరికీ వ్యతిరేకంగా ముగిసింది. వాతావరణమార్పులను, భూగోళ ఉష్ణోగ్రత పెరుగుదలను తగ్గించడానికి 1997లో కుదిరిన క్యోటో ఒప్పందం కాలపరిమితి 2009లో ముగిసిపోబోతున్నది గనుక, ఆ స్థానంలో కొత్త ఒప్పందం కుదర్చడం కొరకు ఈ సమావేశాన్ని ఐక్యరాజ్య సమితి నిర్వహించింది. ప్రపంచవ్యాప్తంగా నూటపది దేశాల అధినేతలు, అనేక బహుళజాతి సంస్థల అధిపతులు, స్వచ్ఛందసంస్థల ప్రతినిధులు, శాస్త్రవేత్తలు, స్వతంత్ర మేధావులు హాజరయ్యారు. కాని ఈ సమావేశం ఎంత ఆర్భాటం చేసినప్పటికీ అవసరమైన చర్చ చేయలేకపోయింది. తగిన చర్యలు చేపట్టడానికి, అంటే వాతావరణ సంక్షోభానికి కారణమవుతున్న వాయు విసర్జనలను తగ్గించడానికి మార్గం సుగమం చేయలేకపోయింది. ఆ వాయువుల విసర్జనవల్ల ఏర్పడుతున్న దుష్పరిణామాల ఫలితంగా సముద్రమట్టం పెరిగిపోవడం, అనూహ్యంగా వరదలు, తుపానులు, కరవులు రావడం వంటి వాతావరణ సమస్యలు తలెత్తుతున్నాయి. ఈ ప్రమాదకర వాయువులను ప్రధానంగా వెలువరిస్తున్నది బహుళజాతి పారిశ్రామిక సంస్థలు, సామ్రాజ్యవాద దేశాల జీవన విధానాలు. ఆ పారిశ్రామిక పద్ధతులను, జీవన శైలులను మార్చుకొమ్మని చెప్పడం ఇవాళ్టి తక్షణ అవసరం కాగా, సమావేశం ఆ జోలికి పోలేదు. అసలు సమావేశ నిర్ణయాలను నిర్దేశించినదే బహుళజాతి సంస్థలు. వాతావరణ సంక్షోభాన్ని నివారించడానికి, వాతావరణ న్యాయాన్ని సాధించడానికి, సామాజిక భద్రతను పరిరక్షించడానికి అవసరమైన చర్యలేవీ ఈ సమావేశంలో రూపొందలేదు. వాతావరణాన్ని ధ్వంసం చేస్తున్న పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానాన్ని కనీస స్థాయిలోనైనా బాధ్యతాయుతం చేయడానికి, జవాబుదారీతనం పెంచడానికి ప్రయత్నాలు జరగలేదు. పెట్టుబడిదారీ సంస్థలు సమావేశానికి ముందు ఎంత దుర్మార్గంగా వాతావరణాన్ని ధ్వంసం చేస్తున్నాయో, సమావేశం తర్వాత అంతకన్న ఎక్కువ దుర్మార్గంగా ప్రవర్తించడానికి వీలు కలిగింది. సామ్రాజ్యవాద దేశాల మధ్య చమురు వంటి ముడిసరుకుల కోసం, లాభాలకోసం పోటీ ఒకవైపు, పేదదేశాలను దోపిడీ చేయడానికి సామ్రాజ్యవాద దేశాలు కలిసికట్టుగా ప్రవర్తించడం మరొకవైపు కలిసి కోపెన్‌హాగెన్ సమావేశాన్ని విఫలం చేశాయి. ప్రపంచ ప్రజలకు వాతావరణ భద్రత గురించి హామీ ఇవ్వవలసిన ఈ సమావేశం ఎటువంటి హామీలేకుండా, విధ్వంసం ఇంకా ఎక్కువ సాగడానికి వీలుగా ముగిసింది. వాతావరణ సంక్షోభాన్ని సృష్టించడంలో తనదే ప్రధాన పాత్ర అని అమెరికా గుర్తించలేదు సరిగదా, భారత, చైనాలు తమ కార్బన్ విసర్జనను తగ్గించుకుంటే తాను కూడ తగ్గించుకుంటానని మడతపేచీపెట్టింది. ఈ కుతర్కాన్ని ఆమోదించి భారత ప్రభుత్వం ఇటు భారత ప్రజలకు మాత్రమే కాదు, అంతర్జాతీయ సమాజానికే ద్రోహం చేసింది. ప్రపంచ ప్రజల ప్రధాన శత్రువు పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానమేననే మాట మరొకసారి కోపెన్‌హాగెన్ లో రుజువయింది.* వీ

## లోపలి పేజీల్లో...

### ఫోకస్ : చదవవలసిన పుస్తకాలు

పుస్తకపఠనం ద్వారా మనిషిలో నిరంతర సంభాషణ రగుల్కొంటుంది. తాము చదివిన పుస్తకం, తమ చుట్టూ జీవితం నిరంతరం సంఘర్షిస్తూ, సరిపోల్చుకుంటూ సాగుతున్నప్పుడు మనుషులు ఆ ఐక్యత - ఘర్షణలలోంచే అవగాహనలను పెంచుకుంటారు. నైసర్గిక, సహజజీవిగా ఉన్న మనిషి సామాజికజీవిగా, ఉదాత్త మానవజీవిగా ఎదగడానికి సహకరించేది పుస్తకపఠనం.



'వీక్షణం'లో అచ్చవుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. 'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

### రచయితలకు సూచన

ఏ పత్రికయినా తాను అచ్చువేసే రచనలు తనకే ప్రత్యేకంగా ఉండాలని కోరుకుంటుంది. 'వీక్షణం' కూడా అలానే భావిస్తోంది. ఇటీవల కొందరు రచయితలు తమ రచనలను ఒకేసారి అనేక పత్రికలకు పరిశీలన కోసం పంపుతున్నారు. 'వీక్షణం' పరిశీలనలో ఉన్న రచనలు, రాబోయే సంచికలలో అచ్చుకోసం ఎంపిక చేసి పెట్టుకున్న రచనలు ఇతర దినపత్రికలలోనో, వార పత్రికలలోనో వెలువడడం మా దృష్టికి వస్తోంది. ఇతర పత్రికలకు పంపిన రచనలను 'వీక్షణం'కు పంపించగూడదని రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాము.

– సంపాదకులు

### చందాదారులకు విజ్ఞప్తి!

ఇటీవల కొంతమంది చందాదారులకు వీక్షణం సక్రమంగా అందడం లేదని ఫిర్యాదులు వస్తున్నాయి. వీక్షణం ప్రతినెల 29వ తేదీన మరుసటి నెల సంచిక పోస్ట్ అవుతుంది. ఏ కారణం చేతనైనా మీకు వీక్షణం మొదటివారంలోపు అందనట్లయితే, వెంటనే ఆ విషయం మాకు తెలపగలరు.

మీ చిరునామా వివరంగా రాయండి. పిన్‌కోడ్ రాయడం మరిచిపోకండి. పత్రిక వచ్చిందా రాలేదా పోస్ట్‌మాన్‌తో నిర్ధారించుకోగలరు.

– సర్క్యులేషన్ మేనేజర్
9949391028







- **ముంగిలి –** తెలంగాణ ప్రాచీన సాహిత్యం – డా. సుంకిరెడ్డి నారాయణ రెడ్డి – తెలంగాణ ప్రచురణ – 766 పేజీలు, 1/8 డెమీ, రు.175, ప్రతులకు : తెలంగాణ ప్రచురణలు, ఇందిరా నివాస్, 3/97, ఓల్డ్ అల్వాల్, సికింద్రాబాద్ – 500 010; సుంకిరెడ్డి నారాయణరెడ్డి, ప్లాట్ నెం. 69, సాయినగర్, డి.వి.కె. రోడ్డు, నల్లగొండ – 508 001; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు
- **కొన్ని కావ్యాలు కొందరు కవులు –** ప్రాచీన, ఆధునిక తెలుగు కవిత్వం మీద వ్యాసాలు – రాచపాళెం చంద్రశేఖరరెడ్డి – 214 పేజీలు, 1/8 డెమీ, రు. 142, ప్రతులకు : శ్రీమతి ఆర్. లక్ష్మి, 28-3-169, తారకనాథ్ కాలనీ, అనంతపురం – 515 001; సెల్ : 9440222117; విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, ప్రజాశక్తి బుక్ హౌస్, హైదరాబాద్
- **సంవిధానం –** కథా సాహిత్య వ్యాసాలు – గుడిపాటి – పాలపిట్ట బుక్స్ – 162 పేజీలు, 1/8 డెమీ, రు. 50
- **రంకె –** స్వామి – పాలపిట్ట బుక్స్ – 32 పేజీలు, 1/8 డెమీ, రు. 10

  పై రెండు ప్రతులకు: పాలపిట్ట బుక్స్, 16-11-20/6/1/1, 403, విజయసాయి రెసిడెన్సీ, సలీంనగర్, మలక్‌పేట్, హైదరాబాద్ – 500 036; ఇమెయిల్:palapittabooks@gmail.com
- **సంక్షోభాలు –** రంగనాయకమ్మ – సి.పి.ఐ. (ఎం.ఎల్.) న్యూ డెమోక్రసీ ప్రచురణ – 48 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు : రామనర్సయ్య విజ్ఞాన కేంద్రం, లెనిన్ నగర్, ఖమ్మం టౌన్, ఖమ్మం; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు
- **ప్రియశత్రువు –** ఆశిస్ నంది – తెలుగు సేత : డి. వెంకట్‌రావు – ఎమెస్కో ప్రచురణలు – 200 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు : ఎమెస్కో బుక్స్, సూర్యారావు పేట, విజయవాడ – 520002, ఫోన్ : 0866-2436643, 98499 92890; దోమలగూడ, హైదరాబాద్ – 500 029, ఫోన్ : 040 – 23264092, ఇమెయిల్:emescobooks@yahoo.com; www.emescobooks.com
- **ఆదివాసులపై యుద్ధం చిదంబర రహస్యం –** కోట్లాది కోపోద్రిక్త ప్రజల్ని అణిచేందుకు ఎన్ని లక్షల సైనికులు కావాలి? – అరుంధతీ రాయ్ – విస్థాపన్ విరోధీ జన వికాస్ ఆందోళన్ – 24 పేజీలు, 1/8 డెమీ, ప్రతులకు : దిశ పుస్తక కేంద్రం, సహచర, నవోదయ బుక్‌హౌస్
- **మానవ సమాజం పరిణామం చెందే తీరు –** లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురణ – 28 పేజీలు, 1/8 డెమీ, రు. 10
- **చరిత్ర తత్వం –** హారోల్డ్ ఎచ్. టిటస్ – తెలుగు సేత : ఆర్వియార్ – లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురణ – 20 పేజీలు, 1/8 డెమీ, రు.10

  పై రెండు ప్రతులకు : లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్, డి. రాధాకృష్ణమూర్తి, ఇ.నెం. 5-85-4/బి, పండరీపురం, 1వ లేను, గుంటూరు – 522 002, సెల్ : 98488 77596; విశాలాంధ్ర బుక్‌హౌస్, ప్రజాశక్తి బుక్‌హౌస్, మైత్రి, దిశ, సహచర, నవయుగ, మణి బుక్‌స్టాల్స్
- **ఓ అక్రమార్జనా! –** (అక్రమార్జన, అక్రమార్జన సంస్కృతిపై చర్చాగోష్టికి మౌలికమైన ఆలోచనలు) – ఉప్పల గోపాలరావు – ప్రజా ఆలోచనా వేదిక ప్రచురణ – 36 పేజీలు, 1/8 డెమీ, ప్రతులకు: ఫ్లాట్ నెం. 5, స్వగృహ అపార్ట్‌మెంట్, బ్లాక్ – సి, భాగ్యనగర్ కాలనీ, కూకట్‌పల్లి, హైదరాబాద్ – 500 072, ఫోన్ : 23067399, సెల్ : 94400 53099







**డి**సెంబర్ వీక్షణంలో 'మార్క్సిజం – పరిశోధనా పద్ధతి' చాలా బావుంది. థాంక్స్. కానీ నాలాంటి సామాన్యుడికి అర్థం అయ్యేట్లు ఉంటే మరీ బావుంటుంది.

**– ఎన్. నారాయణరావు**
విజయనగరం

**డి**సెంబర్ సంచికలో భోపాల్ దురంతాన్ని విశ్లేషిస్తూ వై. రామచంద్రం రాసిన 'ఎం.ఎన్.సి.ల సేవే ప్రభుత్వాల లక్ష్యం' వ్యాసం సూటిగా, సరళంగా, సవివరంగా ఉంది. రచయితకు అభినందనలు. ఆయన మరిన్ని అంశాలపై వారి విశ్లేషణలు అందివ్వాలని మనసారా కోరుకుంటున్నాం. ఈ నెల ఫోకస్ వ్యాసాలన్నీ భోపాల్ దురంతాన్ని విశ్లేషిస్తూ సమగ్ర సమాచారాన్ని ఇచ్చి, ప్రజాలక్ష్యాలను నిర్దేశించిన వైనం వ్యక్తమైంది.

**– కె.బి. స్పందన**
హైదరాబాద్

**డి**సెంబర్ వీక్షణం సంచికలోని 'ఇరవై అయిదేళ్ల భోపాల్ దురంతం' వ్యాసంలో ప్రజలు ఏ విధంగా పాలకుల చేతిలో వంచనకు గురైంది తెలిసింది. 1984లో జరిగిన ఈ దుర్ఘటనలో వేలమంది సామాన్య ప్రజలకు విషవాయువు వల్ల తీరని ఆరోగ్యపరమైన నష్టం జరిగింది. ఇటు ప్రభుత్వానికి గాని, అటు యూనియన్ కార్బైడ్‌కు గాని చిత్తశుద్ధితో ఈ సమస్యను నేటికి కూడా పరిష్కరించలేదు. 84లోనే ఇందిరాగాంధీ హత్యానంతరం జరిగిన సిక్కుల హత్యకు పరిష్కారంగా రు. 12 లక్షల పరిహారం చెల్లిస్తే, భోపాల్ బాధితులకు రు. 12 వేలు మాత్రమే చెల్లించడం సిగ్గు చేటైన విషయం. పాలకుల నిసిగ్గుతనాన్ని, బాధ్యతారాహిత్యాన్ని ఇది సూచిస్తుంది. నిజంగా ఇప్పుడు వెయ్యి భోపాల్‌లు, లక్ష కార్బైడ్‌లు జరుగుతున్నా పాలకుల్లో చలనం లేకపోవడం శోచనీయం.

**– పి. నారాయణరెడ్డి**
నాగార్జునసాగర్, గుంటూరు

**డి**సెంబర్ 2009 సంచికలో 'అంతర్గత భద్రతకు ఎవరు ముప్పు?', 'ఈ యుద్ధం ఎవరి కోసం?' వ్యాసాలు ప్రభుత్వం లోని నాగరీకులుగా చెలామణి అవుతున్న మన్మోహన్‌సింగ్, చిదంబరం గార్లు సభ్యతగా ఉచ్ఛరించే సరళీకరణ–సంస్కరణలు, ఆర్థికాభివృద్ధి, పారిశ్రామికీకరణ పేరుతో భారతీయ సంపదను విదేశీయులకు, కార్పొరేట్ సంస్థలకు ఎలా దోచిపెడుతున్నారో రుజువులతో సహా సూటిగా ఉన్నాయి. పై వ్యక్తుల నీచనికృష్ట నిజస్వరూపాల పూర్వాపరాలతో ఇప్పటి వారి మనోగతం వివరణ ఆశ్చర్యకరంగా ఉన్నా ఎంతో జుగుప్సాకరంగా ఉంది. ఇట్టి వారి గురించి చిన్న చిన్న వ్యాసాలు సరిపోవు. గతంలో మీరు వెలువరించిన 'ఒక దళారీ పశ్చాత్తాపం' పుస్తకం వలె వారి నిజస్వరూపాలు అంశాల వారిగా రుజువులతో పుస్తకరూపంలో తీసుకొచ్చి ప్రజలకు అందించాలి. భాష మాత్రం సంకెళ్లు, దోపిడీ, పీడన, విప్లవం, రాజ్య తిరుగుబాట్లు, ఫాసిస్ట్, బూర్జువా మొదలైన పడిగట్టు పదాలు లేకుండా రచన సాగితే అట్టి రచన ఒక వర్గాన్నే కాకుండా ప్రజలు తమ ఇష్టంగా చదివేదిలా ఉండాలి. అప్పుడు గాని పైకి సభ్యతగా కనిపించే పై వ్యక్తుల నీచమైన నిజస్వరూపం అందరికీ తెలుస్తుంది.

**– వి.ఎస్. రావు**
హైదరాబాద్

**వీ**క్షణం డిసెంబర్ సంచికలో జి. లచ్చయ్యగారి 'ఉరితాళ్లను ప్రశ్నించిన వ్యక్తి' వ్యాసం చదివి ఇది రాస్తున్నాను. ముప్పై సంవత్సరాలుగా ముసుగులో గుద్దులాట సాగిన తరువాత లచ్చయ్య గారు కొన్ని విషయాలు బహిరంగంగా మాట్లాడడం సంతోషించదగిన విషయం. అదే సమయంలో ఆత్మస్తుతి, పరనింద, ఒక ప్రయోజనం కోసం ఎన్ని అబద్ధాలైనా చెప్పొచ్చు అనే కుటిల నీతి, దానిపై దురహంకారంతో నిండి ఉన్న ఆ వ్యాసాన్ని ప్రశ్నించకుండా ఉండలేం. అపరిచిత వ్యక్తిపై ఇంత కటువైన విమర్శ చేసినప్పుడు అందుకు తగిన వివరణ ఇవ్వవలసిన బాధ్యత నాపై ఉంది. బాలగోపాల్‌తో ఎపిసిఎల్‌సి, ఎచ్ఆర్ఎఫ్ ఇతర సంస్థలతో నాకు పాతిక సంవత్సరాలకు పైగా ఉన్న పరిచయంలో, నాకు తెలిసిన, చూసిన విషయాలను ఇక్కడ ప్రస్తావిస్తాను. బాలగోపాల్ చేసిన కృషికి నివాళి అర్పించడం అంటే ఆయన తప్ప ఎవ్వరూ ప్రజల పక్షాన నిలబడలేదు అనే అతిశయోక్తి అవసరం లేదు. ఇటీవలే మరణించిన నరేంద్రనాథ్ లాంటి వారు కూడా జీవితాంతం ప్రజల పక్షాన నిలిచారు. ప్రైవేట్ హింసను ప్రశ్నించిన మొదటి వ్యక్తి బాలగోపాల్ కాదు. ఒపిడిఆర్ వంటి సంస్థలు అంతకు ముందే ఆ పని చేశాయి. 'ఎన్నికలలో పాల్గొన్న వారి వేలు నరుకుతాం' అన్న ప్రకటనను ఒపిడిఆర్ బాలగోపాల్ కంటే ముందే ఖండించింది. బాలగోపాల్ నక్సలైట్ ఉద్యమాన్ని మొత్తం 'చీకటి కోణం'గా అభివర్ణించి వ్యాసం రాశారు అనేది అభూతకల్పన. లచ్చయ్యగారు దాదాపు 80 పేజీలుగా ఉన్న ఆ వ్యాసాన్ని చదివారా అనే అనుమానం వస్తుంది. ఆ వ్యాసం ప్రారంభంలోనే బాలగోపాల్ తన ఉద్దేశాన్ని వివరించారు. ఉద్యమంలో ఉన్న చీకటి కోణాల ప్రస్తావనే గాని ఉద్యమం మొత్తాన్ని 'చీకటి కోణం'గా ఆయన ఎక్కడ వ్యాఖ్యానించారో తెలియజేస్తే తెలుసుకుంటాం. చత్తీస్‌ఘడ్‌లో జరుగుతున్న హింసకు మావోయిస్ట్‌లను కూడా బాధ్యులను చేసాడు – అయ్యా, ఖమ్మం జిల్లాలో తల దాచుకుంటున్న బస్తర్ కోయల గ్రామాలకు వెళ్లి ఎవరిని అడిగినా అదే చెపుతారు. చత్తీస్‌ఘడ్‌లో సాల్వాజుడుం అవతరణకు దోహదం చేసిన కారణాలలో అది కూడా ఒకటి అని బాలగోపాల్ ఒక్కరే కాదు, అక్కడకి వెళ్లిన ఏ పరిశీలకులైనా చెపుతారు. కోయల పునరావాసం కోసం పని చేస్తున్న సంస్థలనడిగినా ఈ విషయం ధృవీకరిస్తారు. బుద్ధదేవ్‌పై జరిగిన హత్యాప్రయత్నం మాటకొస్తే – బాలగోపాల్ ఆత్మరక్షణ. ఏ రాజకీయ సిద్ధాంతాన్ని బాలగోపాల్ అందించలేదు ఒప్పుకుందాం. సంవత్సరాలుగా జరిపిన హత్యలతో మల్హర్ రావు నుండి ప్రజాపంథా రాష్ట్ర నాయకుల నుండి హోం మంత్రి దాకా – ఏ ఆత్మరక్షణ సాధించారో సిద్ధాంతం ఉన్న ఏ రచయితా వివరించలేదు. తుపాకిని తుపాకితో ఎదుర్కోవడంలో పరిమితులున్నాయనడం సమంజసమైన వాదనకాదు. ఎందుకు కాదో లచ్చయ్యగారు వివరించ లేదు. అధికారం తుపాకి గొట్టం గుండా ప్రవహిస్తుంది అన్న మావో కూడా తుపాకి ప్రయోగానికి పరిమితులు ఉన్నాయని చెప్పినట్లు జ్ఞాపకం. సమంజసంగా లేని ఏ వాదనా బలంగా ఎలా ఉండగలదో, ఏ అసమంజసమైన, బలమైన వాదన వల్ల చర్చలు ఎలా విఫలమయ్యాయో మరి?

ఇక పౌరహక్కుల సంఘం మాటకొస్తే అది ప్రైవేట్ హింసపై 1984 ప్రాంతంలోనే పనిచేసింది. కృష్ణా జిల్లా మానికొండ గ్రామంలో రజకులను పనిలో నుండి తొలగించిన సమస్య గాని, కారంచేడు దళితుల హత్యలు గాని, అటు పిమ్మట వరకట్న హత్యలు గాని 1984–90ల మధ్య స్వేచ్ఛలో చూడవచ్చు. కాబట్టి ప్రైవేట్ హింస అనే చర్చ పీపుల్స్ వార్ హింస నేపథ్యంలో ఉదయించింది కాదు. అప్పటి చర్చ సాయుధ సంస్థల హింసకు సంబంధించింది. ఆ చర్చలలో, ఆ

(మిగతా 57వ పేజీలో...)

వీక్షణం నవంబర్ 09 సంచికలో 'వాతావరణం – క్యోటో ఒప్పంద రాజకీయాలు' కె. నరేంద్రమోహన్ గారి వ్యాసంలో పేజీ 35లోని కుడివైపు కాలమ్ కింది నుంచి మూడో వాక్యం 'సగటు పెరుగుదల కనీసం $2^0$ సెంటిగ్రేడ్ కంటే తక్కువగా ఉండాలంటే ' గా సరిచూసుకోగలరు.

వీక్షణం డిసెంబర్ 09 సంచికలో 'ముంచుకొస్తున్న మహామాంద్యం' అరవింద్ గారి వ్యాసం (సి. పటేల్ స్వేచ్ఛానువాదం) లో పేజీ 43లోని కుడివైపు కాలమ్ ఐదో వాక్యం 'ఈ వైరుధ్యమే అధికోత్పత్తి, క్రమబద్ధ సంక్షోభానికి దారితీస్తుంది.' గా సరిచూసుకోగలరు.

అచ్చు తప్పులకు చింతిస్తున్నాం. **– సం.**

## బాలల చలన చిత్రోత్సవం

నవంబర్ 14 నుండి హైదరాబాద్‌లో వారం రోజులపాటు జరిగిన చలన చిత్రోత్సవం 20న ముగిసింది. బాలల చిత్రోత్సవాలలో సినిమా ప్రదర్శనలతో పాటు వివిధ రంగాలకు సంబంధించిన వర్క్‌షాప్‌లు, చర్చాగోష్ఠులు జరిగాయి. ఇరవై దేశాలకు చెందిన 70 సినిమాలు ప్రదర్శించారు. అంతర్జాతీయ విభాగంలో జర్మనీకి చెందిన 'ది క్రొకోడైల్స్' ఉత్తమ చిత్రంగా బంగారు ఏనుగును గెలుచుకుంది. ఆసియన్ పనోరమా విభాగంలో ఉత్తమ చిత్రంగా చైనాకు చెందిన 'టూ మెన్స్ క్లాస్ రూం' చిత్రం ఎంపికైంది. ఎన్నడూ లేనివిధంగా ఒక లక్షా ఇరవై వేల మంది బాలలు ఈ వేడుకకు హాజరయ్యారు.

## ధరల పోటు

ఆహార పదార్థాల ద్రవ్యోల్బణం నవంబర్ 21 నాటి ప్రకారం గత ఏడాదితో పోలిస్తే 10.75 శాతం నుంచి 17.47 శాతానికి పెరిగింది. కిలో చక్కెర రు.36, బియ్యం రు.40, కందిపప్పు రు.100, పెసరపప్పు రు.90, ఉల్లిగడ్డ రు.32, చింతపండు రు.45, వేరుశెనగ నూనె రు.75, ఎండుమిర్చి రు.74లకు చేరి బడుగు జీవులకు బతుకు భారమైపోయింది. గత నాలుగేళ్లలో ఎన్నడూ లేనంతగా ధరలు పెరిగిపోయాయి. మొత్తం ఆహార పదార్థాల ధరలు 46 శాతం, గోధుమ ధర 62 శాతం, ఉప్పుధర 42 శాతం పెరిగాయి.

## వనరుల దోపిడీ కోసమే గ్రీన్‌హంట్

ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం నేత పురుషోత్తం సంస్మరణార్థం నవంబర్ 23న హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో జరిగిన బహిరంగ సభలో అరుంధతీ రాయ్ పాల్గొన్నారు. ఈ సందర్భంగా మాట్లాడుతూ సహజ వనరుల దోపిడీ కోసమే కేంద్రం ఆపరేషన్ గ్రీన్‌హంట్‌ను తలపెట్టిందనీ, మార్కెట్ ద్వారాలు తెరిచాక 2005లో బహుళజాతి సంస్థలతో చేసుకున్న అవగాహన ఒప్పందాల అమలు కోసం కేంద్రం చేస్తున్న కుయుక్తే గ్రీన్‌హంట్ అనీ అన్నారు. ఈ సభలో పి.యు.సి.ఎల్ జాతీయాధ్యక్షులు కె.జి. కన్నబిరాన్, ఎ.పి.సి.ఎల్.సి. అధ్యక్షులు ఎస్. శేషయ్య, ప్రధాన కార్యదర్శి క్రాంతి చైతన్య, ప్రొఫెసర్ జి. హరగోపాల్, ఎం.ఎల్.సి. చుక్కా రామయ్య తదితరులు పాల్గొన్నారు.

## జిఎచ్ఎంసి ఎన్నికల ఫలితాలు

గ్రేటర్ హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్ (జిఎచ్ఎంసి) ఎన్నికల ఫలితాలు 26 నవంబర్ 2009న వెలువడ్డాయి. ఫలితాల్లో ఏ పార్టీకి స్పష్టమైన మెజారిటీ రాలేదు. కార్పొరేషన్‌లోని 150 డివిజన్లకు జరిగిన ఎన్నికల్లో కాంగ్రెస్-52, టి.డి.పి.-45, ఎం.ఐ.ఎం.-43, బి.జె.పి.-5, పి.ఆర్.పి.-1, లోక్‌సత్తా-1, ఇతరులు-3 స్థానాలను గెలుచుకున్నాయి. మేయర్ పదవిని మొదటి రెండు సంవత్సరాలు కాంగ్రెస్, తరువాత రెండు సంవత్సరాలు ఎం.ఐ.ఎం. చివరి సంవత్సరం కాంగ్రెస్ చేపట్టేలా ఆ పార్టీలు నిర్ణయించాయి. మేయర్‌గా తార్నాక డివిజన్ కార్పొరేటర్ బి. కార్తిక రెడ్డి (కాంగ్రెస్) ఎంపికయ్యారు. డిప్యూటి మేయర్‌గా మెహ్‌రాజ్ హుస్సేన్ (ఎం.ఐ.ఎం.) ఎంపికయ్యారు.

## ఓపెన్‌కాస్ట్‌లు, గ్రీన్‌హంట్‌కు వ్యతిరేకంగా...

ఆదిలాబాద్ జిల్లా తిర్యాణి మండలం డోర్లి ఓపెన్‌కాస్ట్ బొగ్గు బావిపై నవంబర్ 25 రాత్రి వంద మంది సాయుధ మావోయిస్టులు దాడి చేశారు. వెంట తెచ్చిన బ్యానర్‌లు, పోస్టర్‌లు అతకబెట్టారు. అక్కడ కార్మికులనుద్దేశించి ప్రసంగించారు. ఓపెన్ కాస్ట్ గనులు, గ్రీన్‌హంట్‌లకు వ్యతిరేకంగా పోరాడాలని మావోయిస్టులు పిలుపునిచ్చారు. ప్రజా ఉద్యమాన్ని అణచివేసి, ఖనిజ సంపదను దోచుకునేందుకే గ్రీన్‌హంట్‌ను తెరపైకి తెచ్చారని అక్కడ విడిచిన లేఖలో పేర్కొన్నారు. సింగరేణి కార్మికుల సంఖ్య 1.17 లక్షల నుండి 67 వేలకు ప్రభుత్వం కుదించి వేసిందన్నారు. యువకులు ప్రజా సైన్యంలో, గెరిల్లా సైన్యంలో చేరాలని పిలుపునిచ్చారు.

## మైనింగ్ నిలిపివేత - మళ్లీ అనుమతి

అనంతపురం జిల్లాలోని గాలి జనార్దనరెడ్డికి చెందిన ఓబుళాపురం మైనింగ్ కంపెనీ (ఓఎంసి) మైనింగ్ కార్యకలాపాలను అధికారికంగా నిలిపివేయడమైనది. ఓఎంసికి చెందిన మూడు లీజులతో కలుపుకొని మొత్తం 6 గనుల్లో కార్యకలాపాలను నిలిపివేస్తూ పరిశ్రమల శాఖ కార్యదర్శి ఎం. వీరభద్రయ్య నవంబర్ 25న జిఒ 723ను జారీచేశారు. ఈ గనుల్లో తవ్వకాలను నిలపడంతో పాటు, ఇప్పటికే తవ్విన ఖనిజరవాణాను కూడా నిలుపుదల చేయాలని ప్రభుత్వం తన ఉత్తర్వుల్లో పేర్కొంది. తరువాత ఈ నిర్ణయాన్ని హైకోర్టు నిలిపివేసింది.

## తెలంగాణ - దీక్షలు - పరిణామాలు

కరీంనగర్ ఉత్తర తెలంగాణ భవన్ నుంచి సిద్దిపేటకు నవంబర్ 29న ఉదయం 9 గంటలకు ఆమరణ నిరాహార దీక్షకు బయలుదేరిన తెలంగాణ రాష్ట్ర సమితి (టి.ఆర్.ఎస్.) అధ్యక్షులు కె. చంద్రశేఖరరావు (కె.సి.ఆర్.) ను అల్గునూర్ చౌరస్తా వద్ద పోలీసులు అరెస్ట్ చేశారు. ఈ పరిణామాల నేపథ్యంలో తెలంగాణ అంతటా నిరసనలు వెలువెత్తాయి. తెలంగాణ అంతటా ప్రజలు, విద్యార్థులు, ప్రజాసంఘాలు, కవులు, కళాకారులు, మేధావులు, ప్రజాస్వామిక వాదులంతా తెలంగాణ ఉద్యమాన్ని తీవ్రతరం చేశారు. డిసెంబర్ 9 రాత్రి తెలంగాణ ప్రక్రియ ప్రారంభమైందన్న కేంద్ర హోంశాఖ మంత్రి పి. చిదంబరం ప్రకటనతో కె.సి.ఆర్. తన పదకొండు రోజుల ఆమరణ దీక్షను విరమించారు. తెలంగాణ ప్రజల్లో సర్వత్రా హర్షం వ్యక్తమయ్యింది.

## ఆంధ్ర - రాయలసీమల బంద్

డిసెంబర్ 9న హోంమంత్రి పి. చిదంబరం తెలంగాణ ఏర్పాటు ప్రక్రియ ప్రారంభమైందని ప్రకటించిన దరిమిలా ఆంధ్ర, రాయలసీమ ప్రాంతాలలో నిరసనలు మిన్నంటాయి. డిసెంబర్ 7న ముఖ్యమంత్రి ఆధ్వర్యంలో జరిగిన అఖిలపక్ష సమావేశంలో అన్ని పార్టీలు తీర్మానాన్ని సమర్థిస్తామని చెప్పి తర్వాత మాట తప్పాయి. కాంగ్రెస్, తెలుగుదేశం, ప్రజారాజ్యం పార్టీలకు చెందిన 150 మంది ఎం.ఎల్.ఎ.లు, ఇతర ప్రజాప్రతినిధులు రాజీనామాలు చేశారు. బంద్‌లు, రాస్తారోకోలతో జనజీవనం స్తంభించింది. వీ

*గత నెల రోజులలో జరిగిన తెలంగాణ, సమైక్యాంధ్ర ఉద్యమాలను విశ్లేషిస్తూ, ఆందోళనకారులు గ్రహించవలసిన వాస్తవాలను వివరిస్తున్నారు* **ఎన్. వేణుగోపాల్**

# ఈ విద్వేషాలు అవాంఛనీయం

నెలరోజులుగా తెలుగుసీమ అట్టుడికిపోతున్నది. తెలంగాణ రాష్ట్ర సమితి నాయకుడు కె చంద్రశేఖరరావు నవంబర్ 29 నుంచి తలపెట్టిన ఆమరణ నిరాహారదీక్షను పోలీసులు భగ్నం చేయడంతో ప్రారంభించి ఇవాళ్టి వరకూ రాష్ట్రంలోని మూడు ప్రాంతాల ప్రజలలోనూ ఆందోళనలు చెలరేగుతున్నాయి. అవసరమైన పోరాటాలతోపాటు అనవసరమైన ఉద్రేకాలు వ్యాపిస్తున్నాయి. న్యాయమైన ఆకాంక్షల వ్యక్తీకరణతోపాటు, అన్యాయమైన ప్రతివాదనలు, అవమానకరమైన నిరసనరూపాలు కూడ వెల్లువెత్తుతున్నాయి. ఈ వాతావరణంలో భావోద్వేగాల ఉరవడిలో కనీసం వందమంది ఆత్మహత్యలు చేసుకుని గాని, గుండెపోటుతో గాని మరణించారు. ప్రజాజీవనం అతలాకుతలమయింది. చాలచోట్ల ప్రభుత్వ ఆస్తులు, కొన్ని చోట్ల ప్రైవేటు ఆస్తులు కూడ ధ్వంసమయ్యాయి. మొత్తంమీద తెలుగు ప్రజల చరిత్రలోకెల్లా అత్యంత విషాదకరమైన, అవాంఛనీయమైన పరిస్థితులు నెలకొన్నాయి. రాష్ట్రాన్ని భౌగోళికంగా విభజించడం మాట ఎలా ఉన్నా, ప్రజల మధ్య మానసిక విభజన పెరిగిపోతున్నది.

ఈ ఆందోళననంతటినీ ఒకే ముద్దగా చూడడం సాధ్యం కాదు. ఇందులో రెండు ప్రాంతాలలో విడివిడిగా జరిగిన మూడు దశల ఆందోళనలున్నాయి. మొదటి దశ తెలంగాణలో నవంబర్ 29 నుంచి డిసెంబర్ 9 దాకా, రెండో దశ కోస్తాంధ్ర, రాయలసీమలలో డిసెంబర్ 10 నుంచి డిసెంబర్ 23 దాకా జరగగా, మూడో దశ మళ్లీ తెలంగాణలో డిసెంబర్ 23 నుంచి ఇవాళ్టిదాకా జరుగుతోంది.

మొదటి దశ తెలంగాణ ఉద్యమం ప్రధానంగా ఫ్రీ జోన్ ప్రకటనకు, తెలంగాణలో భూముల కబ్జాకు వ్యతిరేకంగా మొదలయి, క్రమంగా ప్రత్యేక రాష్ట్ర వాగ్దానాన్ని నెరవేర్చమని కేంద్రప్రభుత్వంపై ఒత్తిడి చేసే దిశగా సాగింది. చంద్రశేఖరరావు ఆమరణ నిరాహారదీక్ష ద్వారా శాంతియుతంగా తలపెట్టిన ఈ ఉద్యమం మీద ప్రభుత్వం దమననీతిని అవలంబించింది. తనకు తెలిసిన ఏకైక పద్ధతిలో, పోలీసులను ఉపయోగించి బలప్రయోగం చేయడంద్వారా విరుచుకుపడింది. చంద్రశేఖరరావును మార్గమధ్యంలో నిర్బంధించి, రాజద్రోహంతో సహ అనేక నేరాలు ఆరోపించి ఖమ్మం జైలుకు తరలించారు. నిరసన తెల్పిన ఉస్మానియా విద్యార్థులపై దారుణంగా లాఠీచార్జి జరిపి నెత్తురు కళ్లజూశారు. దానితో తెలంగాణ జిల్లాలన్నిటా నిరసనజ్వాలలు చెలరేగాయి. చంద్రశేఖరరావు దీక్ష విరమించారని అబద్ధప్రచారం ద్వారా మోసం చేయడానికి ప్రభుత్వం విఫల ప్రయత్నం చేసింది. దీక్ష పదిరోజులు సాగింది. ఆ పదిరోజులూ తెలంగాణ ప్రజల ఆగ్రహ వ్యక్తీకరణ విస్తృతంగా సాగి చివరికి కేంద్ర ప్రభుత్వం దిగిరాక తప్పలేదు. డిసెంబర్ 9 రాత్రి పత్రికాసమావేశంలో, ఆ మర్నాడు లోక్‌సభలో కేంద్ర హోంమంత్రి పి చిదంబరం 'తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి' అని ప్రకటించారు.

దానితో కోస్తాంధ్ర, రాయలసీమలలో రెండో దశ ఆందోళన మొదలయింది. డిసెంబర్ 10న విజయవాడ పార్లమెంట్ సభ్యుడు లగడపాటి రాజగోపాల్ తన లోక్‌సభ సభ్యత్వానికి రాజీనామా చేయడంతో కోస్తాంధ్ర, రాయలసీమ జిల్లాలలో విద్యార్థులు, ప్రజలు నిరసన కార్యక్రమాలు చేపట్టారు. నిరాహారదీక్షలు, రాస్తారోకోలు, బంద్ లు, ప్రత్యర్థుల దిష్టిబొమ్మల దగ్ధాలు, ప్రభుత్వ ఆస్తుల విధ్వంసం, దహనం వంటి అనేక రూపాలలో తమ నిరసన వ్యక్తం చేశారు. కనీసం పది రోజులపాటు శ్రీకాకుళం నుంచి చిత్తూరు వరకూ అన్ని జిల్లాలలోనూ అస్తవ్యస్త పరిస్థితులు నెలకొన్నాయి. రాజకీయపార్టీల పరిధులను దాటి శాసనసభ్యులు రాజీనామాలు చేశారు. 2004, 2009 ఎన్నికల ప్రణాళికలలోనూ, డిసెంబర్ 7 న జరిగిన అఖిలపక్ష సమావేశంలోనూ తెలంగాణ రాష్ట్ర ఏర్పాటును ఆమోదించిన పార్టీల నాయకులు కూడ రాజీనామాలు చేసి సమైక్యాంధ్రప్రదేశ్ కు అనుకూలంగా ఆందోళన మొదలుపెట్టారు. ప్రజాభిప్రాయం మేరకే తాము సమైక్యాంధ్ర కోరుతున్నామని అన్నారు. కొందరు నాయకులు ఆమరణ నిరాహారదీక్షకు కూడ పూనుకున్నారు. ఈ ఆందోళనను, రాజకీయ పార్టీల మధ్య ఏకాభిప్రాయం లేకపోవడాన్ని సాకుగా చూపి కేంద్రప్రభుత్వం 'విస్తృత చర్చ జరపవలసి ఉంద'నే పేరుతో రాష్ట్ర ఏర్పాటు ప్రక్రియను పక్కనపెట్టింది.

డిసెంబర్ 23 రాత్రి ఆ ప్రకటన వెలువడినవెంటనే తెలంగాణ వ్యాప్తంగా మళ్లీ విద్యార్థులు, ప్రజలు ఆందోళన పునరుద్ధరించారు. తెలంగాణ శాసనసభ్యులు రాజీనామాలు ప్రారంభించారు. బంద్ విజయవంతమయింది. అనేక చోట్ల ప్రభుత్వ ఆస్తుల విధ్వంసం మొదలయింది. ఈ వ్యాసం రాసేనాటికి ఆ ఆందోళన నాలుగోరోజుకు చేరి ఇంకా ఉధృతమవుతోంది.

ఈ ఆందోళనలలో వ్యక్తమయిన పోరాటరూపాలు, నిరసనరూపాలు ఒకే రకమైనవైనప్పటికీ, రెండుచోట్లా ఆగ్రహప్రకటన ఒకేవిధంగా వ్యక్తమైనప్పటికీ రెండుచోట్ల ఆందోళనలనూ ఒకేగాటన కట్టడం సాధ్యం కాదు. రెండుచోట్ల ఆందోళనలకూ విభిన్నమైన చారిత్రక,

సామాజిక, రాజకీయార్థిక కారణాలు, కోణాలు ఉన్నాయి. తెలంగాణలో జరిగిన ఆందోళన అంతకు ముందు ఆరు దశాబ్దాలుగా సాగుతున్న ఆందోళనకు కొనసాగింపు కాగా, కోస్తాంధ్ర, రాయలసీమలలో సమైక్యరాష్ట్రం కోసం సాగిన ఆందోళన కేంద్రప్రభుత్వ ప్రకటనకు ప్రతిస్పందనగా అప్పటికప్పుడు తలెత్తినది. తెలంగాణలో జరిగిన ఆందోళన ఒక విశిష్టమైన సామాజిక అస్తిత్వాన్ని నిలబెట్టుకోవాలనే కోరికతో జరిగినది కాగా, కోస్తాంధ్ర, రాయలసీమలలో జరిగిన ఆందోళన ఒక ప్రశ్నార్థకమైన అస్తిత్వాన్ని స్థిరపరచాలనే ఉద్దేశంతో జరిగినది. అన్నిటికన్న ముఖ్యంగా తెలంగాణలో జరిగిన ఆందోళన ఆరు దశాబ్దాల రాజకీయార్థిక వివక్షకూ, అన్యాయానికీ వ్యతిరేకంగా జరిగినది కాగా, సమైక్యాంధ్ర ఆందోళన ఆ సుదీర్ఘకాలపు ఆకాంక్షలను పట్టించుకోకుండా, నిరాధారమైన ప్రాతిపదికలమీద, స్వార్థపరశక్తులు ప్రచారం చేసిన అబద్ధాల మీద ఆధారపడి జరిగినది.

ఈ నేపథ్యంలో సమైక్యాంధ్ర ఆందోళనకు పునాదిగా ఉండిన నినాదాల, వాదనల నిజానిజాలను పరిశీలించడం అవసరం. ఆ నినాదాలలో, వాదనలలో ఒకే జాతి భావన, ఉన్నత విద్యావకాశాలు, ఉద్యోగావకాశాలు కోల్పోతామనే అనుమానం, నదీజలాలలో తమ వాటా తమకు దక్కదేమోననే భయం, అభివృద్ధి ఆగిపోతుందనే ఆలోచన, హైదరాబాద్ పరాయిదయిపోతుందనే సందేహం ముఖ్యమైనవి. విద్యార్థులలో, రైతులలో, సాధారణ ప్రజలలో విషయాలు లోతుగా ఆలోచించలేని అమాయకత్వం కూడ పెద్ద ఎత్తునే పనిచేసింది. ఈ అనుమానాలు, భయాలు, సందేహాలు అతి సులభంగా నివృత్తి చేయగలిగినవే. కాని వాటిని ప్రచారం చేసి, ఎగసనదోసి, తమ స్వార్థప్రయోజనాలు నెరవేర్చుకోజూసిన రాజకీయార్థిక శక్తుల పాత్ర చాల ఉంది.

తెలుగుజాతి ఒకటే కనుక ఒకే రాష్ట్రంగా ఉండాలనే అమాయక వాదన ఈ ఆందోళనలో ప్రచారమయింది. నిజానికి జాతిభావన ఆధారంగా ప్రజలు ఏకమై దేశాలు ఏర్పరచుకున్న జాతిరాజ్యాల చరిత్ర యూరప్ లో పద్దెనిమిది, పందొమ్మిదో శతాబ్దాలలో జరిగింది గాని, భారతదేశం వంటి బహు జాతుల సమాఖ్య రాజ్యంలో జాతి ప్రాతిపదికగా రాష్ట్రాలు ఏర్పడాలనే భావనకు అంత ప్రాధాన్యత లేదు. జాతికి ఒక పునాది అయిన భాష ప్రాతిపదికగా రాష్ట్రాలు ఏర్పడాలని జాతీయోద్యమం భావించినప్పటికీ, 1956లో కొన్ని భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడినప్పటికీ ఆ ప్రాతిపదిక కూడ సవ్యంగా అమలు కాలేదనడానికి ఎన్నో ఉదాహరణలున్నాయి. మొత్తం మీద ఒకే జాతి, ఒకే భాష మాట్లాడేవారు ఒకే రాష్ట్రంలో ఉంటే బాగుంటుందనే ఆదర్శం ఉంది గాని, ఒక జాతికి, ఒకే భాష మాట్లాడేవారికి ఒకటికన్న ఎక్కువ రాష్ట్రాలు ఉండగూడదనే ప్రమాణం ఏమీలేదు. దేశంలో ఒకే భాషకు ఒకటికన్న ఎక్కువ రాష్ట్రాలు ఉన్న ఉదాహరణలు, ఒకే రాష్ట్రంలో అనేక భాషల ప్రజలు ఉన్న ఉదాహరణలు ఉన్నాయి. తెలుగు భాషా ప్రజలకు ఒకేరాష్ట్రం ఉండాలనే వాదనకు 1953-56 మధ్యన ఏ కొంతయినా అర్థం, సంబద్ధత ఉన్నాయేమో గాని, 1956 తర్వాత తెలంగాణకు జరిగిన అన్యాయాల నేపథ్యంలో ఆ ఏకజాతిభావన రద్దయిపోయింది. ఇవాళ తెలుగు జాతికి ఒకే రాష్ట్రం ఉండాలని వాదించడంలో సంబద్ధత ఏమీలేదు.

అంతకు ముందు వందల సంవత్సరాలు భిన్నపాలనలలో జీవించిన తెలుగుజాతి ఆంధ్రప్రదేశ్ తో ఏకమయిందనీ, కనుక ఈ ఐక్యతను కాపాడుకోవాలనీ ఎవరయినా కోరుకోవచ్చు. కాని 1956లో జరిగిన ఐక్యత షరతులతో కూడిన ఐక్యత. ఆ ఐక్యతను కాపాడదలచుకున్న వారు ఆ షరతులను కచ్చితంగా పాటించి ఉండవలసింది. తెలంగాణకు ఇచ్చిన షరతులను కోస్తాంధ్ర, రాయలసీమ పాలకులు మొదటినుంచీ ఉల్లంఘిస్తూ వచ్చారు. కనీసం అరడజనుసార్లు జాతి ఐక్యతకోసం కుదిరిన ఒప్పందాలను ఉల్లంఘించినవారు కోస్తాంధ్ర, రాయలసీమ పాలకులే. కనుక జాతి ఐక్యత కోసం ఇవాళ అడిగే హక్కు ఆ ప్రాంత రాజకీయనాయకులకు లేదు. విద్యార్థులకు, రైతులకు, సాధారణ ప్రజానీకానికి ఈ జాతిభావనతో, జాతిపేరిట ఐక్యతతో ఒరగబోయేది ఏమీలేదు. అందువల్ల వారి ఆందోళనకు పైకి జాతిభావన అనే ఆచ్ఛాదన ఉన్నప్పటికీ అట్టడుగున ఉన్నవి రాజకీయార్థిక, జీవన భద్రతా కారణాలే.

ఆ కారణాలలో ప్రధానమైనవి, విద్యార్థులను ఆందోళన పరచినవి రాష్ట్రవిభజనతో ఉన్నత విద్యావకాశాలు కోల్పోతామనే భయాలు. నిజానికి ఇప్పటికే నెలకొని ఉన్న విశ్వవిద్యాలయాల ప్రవేశ అర్హతల ప్రకారం ఒక ప్రాంత విద్యార్థులకు, మరొక ప్రాంతంలో స్థానికేతరులుగా పదిహేనుశాతం సీట్లకు మాత్రమే అవకాశం ఉంది. విశ్వవిద్యాలయ విద్యకయితే రాష్ట్రవిభజన జరిగినా ఇదే కొనసాగుతుంది. కనుక విద్యార్థులు నష్టపోయేది పెద్దగా ఉండదు. ఇక విశ్వవిద్యాలయ విద్య కాక, ఇంకా ఉన్నతవిద్యా సంస్థలు, ఎన్ ఐ టి, ట్రిపుల్ ఐటి, వంటి చోట్ల ఇప్పటికే రాష్ట్రాల మధ్యనే పోటీ ఉంది. కొత్తగా రాష్ట్రాలు ఏర్పడితే, నిజానికి రెండు రాష్ట్రాల తెలుగు విద్యార్థులకు ఎక్కువ సీట్లు వచ్చే అవకాశమే ఉంటుంది. ఐ ఎస్ బి లాంటి ఉన్నత విద్యాసంస్థలలో స్థానికులకు రిజర్వేషన్ లేనేలేదు. రాష్ట్రవిభజనవల్ల హైదరాబాదులోని ఉన్నత విద్యాసంస్థలలో తమ వాటాకు గండిపడుతుందనే భయాన్ని వ్యక్తం చేస్తున్న విద్యార్థులు నిజానికి అడగవలసింది సమైక్య రాష్ట్రం కాదు. రాష్ట్రవిభజన తర్వాత, హైదరాబాదులో ఉన్న ఉన్నత విద్యాసంస్థలన్నిటికీ, సమానమైన సంస్థలను ఆంధ్ర-రాయలసీమలలో కూడ నెలకొల్పాలని డిమాండ్ చేయడం న్యాయబద్ధంగా ఉంటుంది.

ఉన్నత విద్యావకాశాలు కోల్పోతామనే అనుమానంతో పాటు ఉద్యోగాలు కోల్పోతామనే అనుమానం కూడ తెలంగాణేతర ప్రాంతాలలో ఆందోళనకు కారణమయింది. నిజానికి ఇది కూడ నిరాధారమైన అనుమానమే. ఉమ్మడి రాష్ట్రంలో విస్తీర్ణం, జనాభా దామాషాలను బట్టి కచ్చితంగా ఉద్యోగ కల్పన జరిగిఉంటే ఏ మార్పులు జరిగినా ఎవరూ భయపడనక్కరలేదు. గతంలో జరిగిన రాష్ట్ర విభజనలలో అప్పటికి ఉన్న ప్రభుత్వోద్యోగాలలో ప్రాంతాల వాటాను బట్టి, ఉద్యోగుల ఎంపికనుబట్టి, ఆయా రాష్ట్రాలకు వారిని పంపించడం అనే ప్రక్రియ జరిగింది. కనుక ఇప్పటికే ఉద్యోగస్తులయిన వారు తమ ప్రమేయం లేకుండా, ఇష్టానికి వ్యతిరేకంగా ఎక్కడికో తరలిస్తారని భయపడనవసరం లేదు. ఇక రానున్న ఉద్యోగాలలో తమవాటా దొరకదనే నిరుద్యోగుల భయానికి కూడ అర్థం లేదు. రాష్ట్ర విభజన జరిగిన తర్వాత తెలంగాణ రాష్ట్రంలో కొత్త ఉద్యోగ కల్పన ఎంత జరుగుతుందో, మిగిలిన రాష్ట్రంలో

కూడ అంతగానూ జరగవచ్చు, అంతకన్న ఎక్కువయినా జరగవచ్చు. అసలు ప్రపంచీకరణ క్రమం మొదలయిన తర్వాత ప్రభుత్వ రంగంలో ఉద్యోగ కల్పనే పెద్ద ఎత్తున జరగడం లేదు. ప్రభుత్వోద్యోగాలు మాత్రం ఏరాష్ట్ర ప్రజలకు ఆ రాష్ట్రంలోనే వస్తాయి. కాని పెద్దఎత్తున ఉద్యోగకల్పన జరుగుతున్న ప్రైవేటు రంగంలో ఒక రాష్ట్రం వారు మరొక రాష్ట్రంలో ఉద్యోగం సంపాదించుకోగూడదని ఏమీ లేదు.

అలా ఒకే జాతిభావన అనే శుష్కమైన సెంటిమెంటు, విద్యా, ఉద్యోగావకాశాల కొరత అనే నిరాధారమైన భయాలు విద్యావంతులను ఆందోళన పరచగా, రైతులను, సాధారణ ప్రజానీకాన్ని నదీజలాలలో తమ వాటా తమకు దక్కదేమోననే అనుమానాలు ఆందోళన పరచాయి. తెలంగాణ రాష్ట్రం ఏర్పడితే కృష్ణకు, గోదావరికి అడ్డంగా గోడలు కట్టి కిందికి ఒక్కచుక్క నీరు కూడ వదలరనే మాటను రాజకీయనాయకులు ప్రచారం చేశారు. ఇది పచ్చి అబద్ధం. ఎగువరాష్ట్రమైన తెలంగాణ దిగువ రాష్ట్రమైన కోస్తాంధ్రకు నదీజలాలను వదలకతప్పదు. వరదలు వచ్చి, పైన జలాశయాలు పూర్తి స్థాయి నీటి మట్టం నిండినాకనయినా వదలక తప్పదు. జాతీయ జలవనరుల పంపిణీ ట్రిబ్యునల్ నిర్ణయించే ప్రకారమయినా తప్పదు. జాతీయస్థాయిలో వివిధ నదీ పరీవాహక రాష్ట్రాల మధ్య జలవనరుల పంపిణీకి ఇప్పటికే ఆమోదించిన సూత్రాలు, ప్రమాణాలు ఉన్నాయి. ఆ ప్రమాణాల ప్రకారం ఏ ఎగువరాష్ట్రమైనా శత్రుత్వం వహించినా, తలచుకున్నా దిగువ రాష్ట్రానికి అన్యాయం చేసే అవకాశం పెద్దగా లేదు.

ఆంధ్రప్రదేశ్ సమైక్యంగా ఉంటే ఏదో అభివృద్ధి జరిగిపోతోందని, అది రెండు ముక్కలో మూడు ముక్కలో అయితే ఆ అభివృద్ధి ఆగిపోతుందని మరొక వాదన కూడ ఈ ఆందోళనకు ఒక పునాది. నిజానికి అభివృద్ధి అంటే ఏమిటి, ఎవరి అభివృద్ధి వంటి తాత్విక ప్రశ్నలు కూడ వేయవచ్చును గాని, అవి పక్కనపెట్టినా, పెద్ద రాష్ట్రాలయితే అభివృద్ధి చెందుతాయని, చిన్న రాష్ట్రాలయితే అభివృద్ధి చెందవని చెప్పడానికి ఎటువంటి ఆధారమూ లేదు. ప్రభుత్వ గణాంకాల ప్రకారమే ఎన్నో పెద్ద రాష్ట్రాలు అభివృద్ధి సూచికలలో అట్టడుగున ఉన్నాయి. ఎన్నో చిన్న రాష్ట్రాలు అభివృద్ధి సూచికలలో అగ్రభాగాన ఉన్నాయి. కనుక ఒక రాష్ట్ర అభివృద్ధికి ఆ రాష్ట్రం చిన్నదా, పెద్దదా అనేది ప్రమాణం కాదు. ఆ రాష్ట్రంలో వనరులు సరిగా ఉన్నాయా లేవా, ఆ వనరుల వినియోగం సక్రమంగా ఉన్నదా లేదా అనేవే ప్రమాణాలవుతాయి. సమైక్య ఆంధ్రప్రదేశ్ అనుభవం నుంచి గుణపాఠాలు తీసుకుని విభజానంతర రాష్ట్రాలు తమ వనరులను సరిగా వినియోగించుకుని రెండిటికి రెండూ అభివృద్ధి సాధించవచ్చు.

కోస్తాంధ్ర, రాయలసీమలలో ఆందోళనకు హైదరాబాదు తమకు దూరమయిపోతుందేమోననే అనుమానం మరొక కారణం. విభజన తర్వాత హైదరాబాదు ఆ ప్రాంతప్రజలకు రాజధానిగా ఉండకపోవచ్చుగాని, దేశంలోని అన్ని నగరాలలో వారికి ఎంత అవకాశం ఉన్నదో అంత అవకాశం ఉంటుంది. నిజానికి 1953లో రాజధాని మద్రాసును వదులుకున్నప్పటికీ తెలుగు సినిమారంగం ఆ తర్వాత ముప్పై సంవత్సరాలు అక్కడే ఉంది. లక్షలాది కోస్తాంధ్ర, రాయలసీమ ప్రజలు అక్కడే ఉన్నారు. బొంబాయి విషయంలో మహారాష్ట్రులకు, గుజరాతీలకు ఘర్షణలు జరిగినప్పటికీ, ఇవాళ్టికీ ఆ నగర జనాభాలో 20 శాతం గుజరాతీలే. హైదరాబాదులో వేలాది ఎకరాల భూములు, కోట్లాది రూపాయల ఆస్తులు సంపాదించినవారికే ఎటువంటి ప్రమాదమూ లేనప్పుడు, సాధారణ మధ్యతరగతి, పేద ప్రజానీకం ఆ విషయంలో ఆందోళన చెందవలసిన అవసరమే లేదు.

ఇలా ప్రస్తుత ఆందోళనకు పునాదిగా ఉన్న అన్ని కారణాలూ నిరాధారమైనవని తేలినతర్వాత అంత పెద్ద ఎత్తున విద్యార్థులు, ప్రజలు ఆ ఆందోళనలో ఎందుకు పాల్గొన్నారనే ప్రశ్న తలెత్తుతుంది. మన సమాజంలో ఏదయినా ఒక కార్యక్రమంలో పాల్గొనే వారిలో అత్యధిక సంఖ్యాకులు ఆ కార్యక్రమపు లోతుపాతులు తెలుసుకుని పాల్గొనడంలేదు. అమాయకత్వం కొద్దీనో, ఎవరో ఒకరిని నమ్మి వారి వెనుక నడుస్తూనో పాల్గొంటారు. ఈ విషాదవాస్తవాన్ని అర్థం చేసుకుంటే ఆ ఆందోళనలలో విశాల భాగస్వామ్యానికి కారణం తెలుస్తుంది. నిజానికి అటువంటి సమయంలో ఆందోళనలకు నాయకత్వం వహించేవారు తమ వెనుక నడుస్తున్నవారికి ప్రతి సందర్భంలోనూ, ప్రతి విషయంమీదా విజ్ఞతతో వాస్తవాలు చెప్పవలసి ఉంటుంది. కాని కోస్తాంధ్ర, రాయలసీమ నాయకులు సంపూర్ణంగా అసత్యాలమీద, అర్థసత్యాలమీద, అతిశయోక్తులమీద, చరిత్ర వక్రీకరణలమీద ఆధారపడి ప్రజలను, విద్యార్థులను సమీకరించడానికి ప్రయత్నించారు. కేంద్ర హోంమంత్రి ప్రకటన తర్వాత, రాజ్యాంగం అధికరణం 3 ప్రకారం రాష్ట్రం ఏర్పాటు కేంద్రప్రభుత్వం చేతిలోనే ఉన్నదని తెలిసికూడ, శాసనసభ తీర్మానం అనే అబద్ధపు ప్రాతిపదికమీద, ఆందోళన జరిపితే కేంద్రం వెనక్కి తగ్గుతుందనే కుహనా వాదనతో కొందరు రాజకీయ నాయకులు ప్రజలను రెచ్చగొట్టారు. అంటే స్పష్టమైన రాజ్యాంగ వక్రీకరణతో ప్రజలను మోసంచేసి సమీకరించడానికి ప్రయత్నించారు. నిజానికి వారు సమైక్యాంధ్రప్రదేశ్ వల్ల ప్రయోజనాలు పొందుతున్న, హైదరాబాద్ నగరంలో స్వార్థ ప్రయోజనాలు ఉన్న పిడికెడు మంది వ్యాపారవేత్తలు, రాజకీయవేత్తలు మాత్రమే.

ఆ నాయకులు తెలుగుజాతి చరిత్ర గురించీ, ఆంధ్రప్రదేశ్ గురించీ, రాష్ట్ర విభజన ప్రక్రియ గురించీ, తెలంగాణ రాష్ట్ర ఆకాంక్షల గురించీ అబద్ధాలు ప్రచారం చేయడం మాత్రమే కాదు, ప్రజలమధ్య అనవసరమన వైషమ్యం రెచ్చగొట్టారు. ప్రాంతీయ విద్వేషాలు రెచ్చగొట్టారు. అందువల్ల ఏ శత్రుత్వమూ ఉండనవసరంలేని, తరతరాలుగా ఒకేభాష మాట్లాడుతున్న సాధారణ ప్రజానీకం మధ్య అవాంఛనీయమైన ఉద్రేకాలు, శత్రుత్వం తలెత్తాయి. ప్రజలు చీలిపోయి ఉండడమే పాలకుల ప్రయోజనాలకు హామీ గనుక ఆ చీలికను పెంచి పోషించడానికి నాయకులు, ముఖ్యంగా వ్యాపారప్రయోజనాలుఉన్న రాజకీయవేత్తలు ప్రయత్నించారు.

అటువంటి స్థితిలో అవతలిపక్షం లేవనెత్తుతున్న అబద్ధాలను, సందేహాలను, భయాలను నివృత్తి చేయవలసిన బాధ్యత న్యాయమైన పోరాటం చేసున్న ఉద్యమానికి ఉంటుంది. తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్షల నాయకత్వం గత యాభై సంవత్సరాలుగా, మరీముఖ్యంగా పది సంవత్సరాలకు పైగా తన డిమాండ్లు ఏమిటో ఎంతో సాహిత్యం, ఎన్నో గణాంకాలు, ఎన్నో వాదనలు తయారుచేసినప్పటికీ అవేవీ అవతలి

పక్షానికి చేరవలసినంతగా చేరలేదు. అవతలివారికి తమ న్యాయమైన వాదనలు వినిపించడంలో తెలంగాణ నాయకుల వైఫల్యం, అనేకమంది అమాయకులు అవతలి పక్షంలో చేరడానికి దారితీసింది. భూగోళం మీద ఎక్కడ ఒక న్యాయమైన ప్రజాందోళన జరిగినా సవ్యంగా స్పందించి సంఘీభావం తెలిపిన ఘన చరిత్ర ఉన్న కోస్తాంధ్ర, రాయలసీమ ప్రజలు తమ పొరుగున ఉన్న సోదరుల న్యాయమైన ఆకాంక్షలను అర్థం చేసుకోలేకపోయారు, సమర్థించలేకపోయారు, సంఘీభావం ప్రకటించ లేకపోయారు. ఈ దుస్థితినుంచి బయటపడి అన్ని ప్రాంతాలలోని ప్రజాస్వామికవాదులు, ప్రజలు, విద్యార్థులు రాష్ట్ర విభజన ప్రక్రియను స్వాగతించాలి. తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ప్రక్రియ ప్రారంభిస్తున్నామని కేంద్రం చేసిన ప్రకటనను తార్కికంగా కొనసాగించమని డిమాండ్ చేయాలి. వారి స్వార్థప్రయోజనాల కొరకు తమను అబద్ధాలతో మోసపుచ్చి బలి చేస్తున్న రాజకీయవ్యాపారుల కుటిల పన్నాగాలను తిప్పికొట్టాలి. ఇప్పటికైనా కోస్తాంధ్ర, రాయలసీమ ప్రజలు, విద్యా వంతులు, తమ భావోద్వేగాలను పక్కనపెట్టి, లగడపాటి రాజగోపాల్, టి.జి. వెంకటేష్, జె.సి. దివాకరరెడ్డి, ఉండవల్లి అరుణ్ కుమార్, భూమన కరుణాకరరెడ్డి, ఎన్ తులసిరెడ్డి, అంబటి రాంబాబు వంటి వారి మోసపూరిత నినాదాల నుంచి బయటపడాలి. చరిత్రను, వాస్తవాలను అర్థం చేసుకుని తెలంగాణ ఏర్పాటును ఎందుకు సమర్థించాలో తెలుసుకోవాలి. అసలు సమస్యల మీద అర్థవంతమైన చర్చకు, పరిష్కారానికి దారితీయాలి. తెలంగాణలో అరవై సంవత్సరాల ఆకాంక్షలు, నలభై సంవత్సరాలుగా పోరాట వ్యక్తీకరణలు, పదమూడు సంవత్సరాలుగా ఆరకుండా రగులుతున్న ఉద్యమం ఏమిటో అర్థం చేసుకోవాలి.

ప్రత్యేక రాష్ట్రమే ఏకైక పరిష్కారమని ఆలోచించే దిశగా తెలంగాణ ప్రజల ఆకాంక్షలు వ్యక్తం కావడానికి మూలకారణాలలో వనరుల దోపిడీ ముఖ్యమైనది. సమైక్య రాష్ట్రంలో విలీనమవుతున్నప్పుడు, ఆతర్వాత యాభై సంవత్సరాలపాటు తెలంగాణకు కోస్తాంధ్ర పాలకులు, రాష్ట్రాన్ని పాలించిన నాయకులు, కేంద్ర ప్రభుత్వం ఇచ్చిన ప్రతి ఒక్క వాగ్దానాన్నీ ఉల్లంఘించడం మరొక కారణం. ఈ సమస్యలకు పరిష్కారాలు సామాజిక, రాజకీయ, సాంస్కృతిక స్థాయిలో ఉంటాయి. చరిత్రలో జరిగిన అన్యాయాలకు సవరణలు మళ్లీ చరిత్ర క్రమంలోనే, దీర్ఘకాలికంగానే చేయవలసి ఉంటుంది. కాని ఒక సమస్యను సవ్యంగా, దానికి అవసరమయినంత సమయంలోనే పరిష్కరించకపోతే అది తప్పనిసరిగా హింసా మార్గాలను, ఇతర మార్గాలను ఎంచుకుంటుంది. ఇవాళ తెలంగాణ ఉద్యమకారుల భాష గురించి, సంస్కారం గురించి, హింస గురించి, దుందుడుకుతనం గురించి, కిరోసిన్, పెట్రోల్ పట్టుకుని భావోద్వేగాలను రెచ్చగొట్టడం గురించి కొందరు హితవచనాలు పలుకుతున్నారు. వాళ్లందరూ గుర్తించవలసినదేమంటే ఆ పరిణామాలన్నీ యాభై సంవత్సరాల చర్యల పర్యవసానాలు మాత్రమే. ఈ ప్రతిచర్యలను ప్రశ్నించేవాళ్లు మొదట ఆ చర్యలను ప్రశ్నించవలసి ఉంటుంది.

తెలంగాణ వనరుల దోపిడీ ఎలా జరిగిందో గణాంకాల ద్వారా వివరించిన అధ్యయనాలు ఎన్నో ఉన్నాయి. అది భూమి కావచ్చు, జలవనరులు కావచ్చు, ఖనిజవనరులు కావచ్చు, విద్యావకాశాలు కావచ్చు, ఉద్యోగావకాశాలు కావచ్చు, ప్రజాధనం కేటాయింపులు కావచ్చు - ఏ ఒక్క రంగంలోనూ తెలంగాణ వాటా తెలంగాణకు దక్కలేదు. తెలంగాణ నుంచి తీసుకున్న దానిలో సగమో పావో కూడ తెలంగాణకు తిరిగి ఇవ్వలేదు. ఆ వనరుల దోపిడీని సవ్యంగా సాగించాలంటే దోపిడీకి గురవుతున్న వాళ్ల అస్తిత్వాన్ని చిన్నబుచ్చడం, వారి భాషా సంస్కృతులను, చరిత్రను అవమానించడం బ్రిటిష్ వలసవాదులు అవలంబించిన పాత వ్యూహమే. అదేవిధంగా రెండువందల ఏళ్లుగా స్వతంత్ర రాజ్యంగా ఉంటూ తెలంగాణ అభివృద్ధి చేసుకున్న ప్రత్యేక అస్తిత్వాన్ని కోస్తాంధ్ర, రాయలసీమ పాలకులు అవమానిస్తూ వచ్చారు. ఆ ప్రత్యేక అస్తిత్వంలో నిర్మాణమైన సంపదనంతా ఉమ్మడి రాష్ట్రం పేరిట 'రెండున్నర జిల్లాల రెండున్నర కులాల' నాయకులు హక్కుభుక్తం చేసుకున్నారు. కాళోజీ ఆ మాట అన్న 1969కీ, ఇవాల్టికీ తేడా ఏమంటే ఇప్పుడు రాయలసీమ నుంచి మరొక రెండు జిల్లాల మరొక కులం కూడ ఆ దోపిడీలో భాగం పంచుకుంటున్నది.

ఇటువంటి వనరులదోపిడీ, అవమానం, వివక్ష, అన్యాయం అమలవుతున్నాయనీ, అవుతాయనీ గుర్తించినందువల్లనే, షరతుల మీద మాత్రమే సమైక్యరాష్ట్రం ఏర్పడాలనే ఆలోచన కలిగింది. అలా ఆంధ్రప్రదేశ్ ఏర్పాటే పెద్దమనుషుల ఒప్పందం పేరిట షరతులతో కూడిన ఐక్యత. ఆ షరతులలో ఏ ఒక్కదాన్నీ పాలకులు పాటించలేదు. ఆ తర్వాత 1969 అఖిలపక్ష ఒప్పందం, 1969 ఎనిమిది సూత్రాల పథకం, 1971 ఎన్నికల విజయం, 1972 సుప్రీంకోర్టు తీర్పు, 1973 ఆరుసూత్రాల పథకం, 1973 జి వో నం. 36, 1975 రాష్ట్రపతి ఉత్తర్వులు, 1975 రాజ్యాంగ సవరణ, 1986 జి వో నం. 610, 1998 బిజెపి కాకినాడ తీర్మానం, 2004 కాంగ్రెస్ ఎన్నికల ప్రణాళిక, 2004 కామన్ మినిమమ్ ప్రోగ్రామ్, 2004 రాష్ట్రపతి ప్రసంగం, 2004 ప్రణబ్ ముఖర్జీ కమిటీ, 2005 గిర్ గ్లాని నివేదిక, 2008 రోశయ్య కమిటీ, 2009 తెలుగుదేశం ఎన్నికల ప్రణాళిక - ఇలా తెలంగాణ ప్రజలపట్ల ఎన్ని ద్రోహాలు జరిగాయో, ఎన్ని వాగ్దానాలు ఉల్లంఘనకు గురయ్యాయో లెక్కలేదు.

తత్ఫలితంగా సాగుతున్న ఉద్యమం తెలంగాణ ప్రజలకూ పాలకులకూ మధ్య, 53 సంవత్సరాలుగా సాగుతున్న పాలక విధానాలతో ఘర్షణే గాని తెలంగాణ ప్రజలకూ ఆంధ్ర, రాయలసీమ ప్రజలకూ మధ్య ఘర్షణ కాదు. నిజానికి తెలంగాణకు ద్రోహం చేసిన పాలకులు ఉత్తరాంధ్రకూ, పల్నాడుకూ, రాయలసీమలో అనేక ప్రాంతాలకూ కూడ ద్రోహం చేస్తున్నారు. ఆ ద్రోహాన్ని గుర్తించిన నాలుగుకోట్ల తెలంగాణ ప్రజలు ఇవాళ ఎలుగెత్తుతున్నారు. దానికి రాజకీయ పరిష్కారాన్ని తక్షణం చూపవలసి ఉంది. తెలంగాణ ప్రజల న్యాయమైన ఆకాంక్షలను మొత్తం తెలుగుజాతి మాత్రమే కాదు, అణచివేతకూ దోపిడీకీ పీడనకూ గురవుతున్న ప్రజలందరూ సమర్థించవలసి ఉంది. ఇది కోస్తాంధ్ర, ఉత్తరాంధ్ర, రాయలసీమలలో కూడ ప్రజానీకం సమర్థించవలసిన, సంఘీభావం ప్రకటించవలసిన, పాల్గొనవలసిన సమస్య. ఇది ప్రాంతీయ విద్వేషాల సమస్య కాదు, అన్ని ప్రాంతాల ప్రజలు సంఘీభావం ప్రకటించవలసిన న్యాయమైన ఆకాంక్షల సమస్య. వీ

*రాజకీయ పార్టీలు తమ అవకాశవాదాన్ని, చరిత్ర వక్రీకరణలను, ప్రజలను పక్కదారి పట్టించడాన్ని మానుకుని తెలంగాణ ఏర్పాటుకు సిద్ధం కావాలంటున్నారు* **కె. ప్రభాకర్**

# సమైక్యాంధ్ర ఆందోళన ఎందుకోసం?

'తెలంగాణ ఏర్పాటు ప్రక్రియ ప్రారంభమైంది' అంటూ కేంద్ర ప్రభుత్వం ప్రకటించడంతో తెలంగాణ ప్రజల హర్షాతిరేకాలు ఆకాశాన్నంటాయి. ఆరు దశాబ్దాల దీర్ఘకాలిక ప్రజాస్వామిక ఆకాంక్షకు ఓ పరిష్కారం 'భౌగోళికంగా' దొరికినట్లైంది. ఆ ప్రకటన వెలువడి ఆరుగంటలు గడవక ముందే కొంతమంది 'సీమాంధ్ర' నాయకులు, తెలంగాణ వ్యతిరేకులు, ఆంధ్రవలసవాద, పెట్టుబడిదారీ వర్గ రాజకీయ నాయకులు సహజంగానే ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం ఏర్పడితే, తమ వ్యాపార, రియల్ ఎస్టేట్, ఉద్యోగ, రాజకీయ, సాంస్కృతిక ఆధిపత్యానికి అవకాశం లేకుండా పోతుందనుకున్న వాళ్లంతా రాజీనామాలతో పార్టీలకతీతంగా, ఆయా పార్టీల నిర్ణయాలను, తెలంగాణ పట్ల ఎన్నికల నుండి చూపించిన సానుకూలతను బూటకమని రుజువు చేశారు.

అధిష్ఠానం 'నిర్ణయానికి కట్టుబడి ఉంటాం' అని ప్రకటించి ఆ మేరకు కోస్తాంధ్ర నాయకులు, రాయలసీమ కాంగ్రెస్ నేతలు గీత దాటే వరకు నోరుతెరవని తెలంగాణ కాంగ్రెస్ నాయకులు, ఓయు విద్యార్థులు నినదించినా స్పందించని వాళ్లు, సీమాంధ్ర నేతల వైఖరి చూసి అనివార్యంగా తమ ప్రాంత ప్రయోజనాల కోసం అధిష్ఠానం నిర్ణయానికి కట్టుబడి ఉండాలని, ఆ మేరకు తెలంగాణ ఏర్పాటు ప్రక్రియ ప్రారంభించాలని కోరడం సహజ పరిణామమే.

సామాజిక తెలంగాణకు మేం అనుకూలమే అని ప్రకటించిన ప్రజారాజ్యం నేతలు వివిధ రాజకీయ పక్షాలన్నీ తమ ప్రాంత స్వార్థపూరిత, అవకాశవాద, పెట్టుబడిదారీ విధానాలకు మద్దతు పలికే విధంగా, వివిధ విద్యార్థి, అధ్యాపక వర్గాలను హైదరాబాద్ బూచీ చూపుతున్నారు. ఫ్రీజోన్ రద్దైతే ఆంధ్ర ప్రాంత నిరుద్యోగులకు అన్యాయం జరుగుతుందనీ, హైదరాబాద్ తెలంగాణది కాదనీ, హైదరాబాద్ అందరికీ తల్లి వంటిదనీ, హైదరాబాద్‌లో ఓ భాగం తెలంగాణ అనీ, హైదరాబాద్ అవసరాల కోసమే 'ఆంధ్ర'లో విలీనమైనట్టు చెబుతున్నారు. కర్నూల్‌ను ఆంధ్రప్రదేశ్ కోసం త్యాగం చేసినట్లు, పొట్టి శ్రీరాములు త్యాగం వల్లే సమైకాంధ్ర ఏర్పడ్డట్లు 'సీమాంధ్ర' రాజకీయ నాయకులు, ఆంధ్రా మేధావులు చేస్తున్న దుష్ప్రచారాన్ని చారిత్రకంగా అర్థం చేసుకోవాలి. లేకపోతే ప్రత్యేక తెలంగాణ ఉద్యమాన్నైనా, కోస్తాంధ్ర, గ్రేటర్ రాయలసీమ 'ప్రత్యేక' ఉద్యమాల పట్ల సానుకూల దృక్పథాన్ని ప్రజల నుండి పొందలేరు. అంతేకాకుండా తెలంగాణ ప్రజల్ని, ఆంధ్రా ప్రజల పట్ల ఉసిగొల్పే రాజకీయ 'విద్రోహం'తో పాటు ఆంధ్రా వలస పాలకులకు, తెలంగాణ ప్రజలకు మధ్య జరిగే పోరాటాన్ని ఆంధ్రా, తెలంగాణ ప్రజల మధ్య పోరాటంగా చిత్రికరించిన నాయకుల స్వార్థ ప్రయోజనాల్ని ఈడేర్చుకునే కుట్రల్ని 'సీమాంధ్ర' ప్రజలు అర్థం చేసుకోవాలి. తెలంగాణ ప్రజల ఆకాంక్ష ఆంధ్రా వలస పాలనతో మిలాఖతైన సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటమే కాని, ఆంధ్రా, రాయలసీమ సామాన్య ప్రజానీకానికి వ్యతిరేకమైనది కాదని, తెలంగాణ ప్రజల ఆకాంక్షలను ప్రజాస్వామికంగా అర్థం చేసుకుంటే తప్ప అసలు నేపథ్యం అర్థం కాదు.

'బాట ఏదైనా ప్రయోజనాలే ప్రధానం' అని ఆంధ్రజ్యోతిలో డిసెంబర్ 13న హరిరామ జోగయ్య రాసిన వ్యాసం చదివిన వాళ్లకు సీమాంధ్ర ఉద్యమం ఏ ప్రయోజనాల కోసమో అర్థమౌతుంది.

'సమైక్యాంధ్ర' కోసం ఉద్యమాలకు పాల్పడుతున్న సీమాంధ్ర మేధావులు, విద్యార్థులు, వివిధ రాజకీయ పక్షాలు వాస్తవాలు వక్రీకరించి అబద్ధాల పునాదుల మీద ఉద్యమాలను కొనసాగించలేరని త్వరగా గుర్తించాల్సి ఉంది. అమరుడు పొట్టి శ్రీరాములు విగ్రహానికి పూలమాలలు వేసి, పాలాభిషేకం చేసి ఆందోళనలు ప్రారంభించిన కోస్తాంధ్ర నాయకులు అసలు పొట్టి శ్రీరాములు ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో తెలుగువారికి అన్యాయం జరుగుతున్నదని 1952 అక్టోబర్ 19 నుండి డిసెంబర్ 15 వరకు ఆమరణ దీక్షలో పాల్గొని అమరుడయ్యాడు. 1 అక్టోబర్ 1953 న 'ఆంధ్ర' రాష్ట్రం ఏర్పడింది. 1 నవంబర్ 1956 దాకా ప్రత్యేక రాష్ట్రంగా కొనసాగిన తెలంగాణ (హైదరాబాద్) పెద్ద మనుషుల ఒప్పందం (జెంటిల్‌మెన్ అగ్రిమెంట్) పేర 'ఆంధ్రప్రదేశ్' లో విలీనం చేసుకోవడం జరిగింది. అందుకే నవంబర్ 1ని తెలంగాణ ప్రాంతంలో 'తెలంగాణ విద్రోహ దినం'గా పాటిస్తున్నారు.

నైజాం నిరంకుశత్వానికి వ్యతిరేకంగా, తెలంగాణ రైతాంగ సాయుధ పోరులో సాహసంతో పోరాడిన చాకలి ఐలమ్మ, దొడ్డి కొమురయ్యల వారసత్వం, బండి యాదగిరిల సాహసత్వాన్ని ప్రపంచానికి చాటిచెప్పిన పోరాట ప్రాంతం తెలంగాణ. అట్లాంటి స్వయం ప్రతిపత్తిని ప్రకటించుకున్న 'తెలంగాణ'ను పోలీస్ ఆక్షన్ పేర 1948 సెప్టెంబర్ 13 నుండి 17 దాకా నెత్తుటేరుల్లో ముంచి సైనిక చర్య ద్వారా ఆక్రమించుకున్నది కేంద్రం.

ఈ ప్రాంతం వారికి ఆంగ్లం రాదని, ఆంధ్రాంగ్ల వారసుల్ని 'ముల్కీ రూల్స్'ను ఉల్లంఘించి వేలాది మందిని ఉద్యోగాల్లో నియమించడాన్ని వ్యతిరేకించిన తెలంగాణ ప్రాంతవాసులు, ఆనాడు 1955లోనే 'నాన్ ముల్కీ గో బ్యాక్' అంటూ ఆందోళనకు పూనుకొని ఆరుగురు విద్యార్థులు

ఆత్మార్పణ చేశారు. అట్లాంటి భయానక వాతావరణంలోనే ఆంధ్రా ప్రాంతంవారు తెలంగాణలో కలిస్తే మరింత అన్యాయం, అక్రమాలు కొనసాగుతాయని ఫజల్ అలీ కమిషన్ ముందు తెలంగాణ ప్రజలు 'ఆంధ్ర'లో కలపడాన్ని వ్యతిరేకించారు.

ఇది 'ఉద్దేశ్యపూరిత సామ్రాజ్యవాద దురాక్రమణే' అని ఆనాడే జవహర్‌లాల్ నెహ్రూ ప్రకటించినా, తెలంగాణ ప్రాంత ప్రజానీకపు ఆకాంక్షలకు వ్యతిరేకంగా 'తెలంగాణ'ను 'ఆంధ్రా'లో విలీనం చేయడం ద్వారా 'ఆంధ్రప్రదేశ్' అనే రాష్ట్రం ఏర్పడిందని, దీనికి పొట్టి శ్రీరాములుకు సంబంధం లేదని గుర్తించాలి. పెద్ద మనుషుల ఒప్పందాల్లోని అంశాలు ఉల్లంఘించబడ్డాయని, మా ఉద్యోగాలు మాకు కావాలని నినదించినందుకు 1969లో మూడొందల అరవై తొమ్మిది మంది తెలంగాణ విద్యార్థులను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పొట్టనపెట్టుకుంది. ఆ ఆందోళన ఫలితంగానే 21 జనవరి 1969న ఆనాటి ముఖ్యమంత్రి కాసు బ్రహ్మానందరెడ్డి 'జిఒ 36' ను విడుదల చేస్తూ 22,568 ఉద్యోగాల్లో నాన్‌ముల్కీలు తెలంగాణ ప్రాంత ఉద్యోగాలను కొల్లగొట్టారని, వీరిని తిరిగి వాళ్ల ప్రాంతాలకు పంపిస్తామని హామీ ఇచ్చారు.

ఈ నిర్ణయాన్ని జీర్ణించుకోలేని 'నాన్ ముల్కీస్' అసలు 'ముల్కీ రూల్స్'ను రద్దు చేయడానికి ప్రయత్నాలు చేయడం, సుప్రీం కోర్టు 'ముల్కీ రూల్స్' రాజ్యాంగబద్ధమేనని ప్రకటించినా ఖాతరు చేయకుండా 'జై-ఆంధ్ర' ఉద్యమాన్ని లేవదీయడం 1972లో చూశాం.

దీని ఫలితంగా రాజ్యాంగ సవరణతో 'ముల్కీరూల్స్'ను రద్దు చేయడంతోపాటు మళ్లీ హామీల పేరిట రాష్ట్రపతి ఉత్తర్వులు ఇచ్చారు. ఆరు సూత్రాల పథకం (ఎస్‌పిఎఫ్) లో భాగంగా రాష్ట్రాన్ని ఆరు జోన్లుగా విభజించి హైదరాబాద్‌ను ఆరవ జోన్‌లో భాగంగా సూచించడం జరిగింది. ఇట్టి ఉత్తర్వులను అనేక మార్లు అతిక్రమించి 120 కి పైగా డిపార్ట్‌మెంట్లలో తెలంగాణ ప్రాంత ఉద్యోగాలను కొల్లగొట్టారని మళ్లీ ఆందోళనలు చెలరేగాయి. 1985లో ఎన్.టి. రామారావు ప్రభుత్వం వేసిన జైభారత్ రెడ్డి కమిషన్ 58,966 ఉద్యోగాలు తెలంగాణేతరులు తెలంగాణ ప్రాంత ఉద్యోగాలను కొల్లగొట్టారనే విషయం తెలియజేయడంతో జి.ఒ. 610 ని 30 డిసెంబర్ 1985న విడుదల చేశారు. మార్చ్ 86 చివరికి వీళ్లందరినీ వెనుకకు పంపి తెలంగాణ వారిచే ఆ ఖాళీలను భర్తీ చేస్తామని హామీ ఇచ్చారు. అదే కోవలో రాయలసీమ ప్రాంతంలో పనిచేస్తున్న తెలంగాణ ప్రాంత ఉద్యోగులను జిఒ 564 మేరకు వెనకకు పంపించడం జరిగింది. కానీ, ఈనాటికి జిఒ 610 అమలు కాకపోగా రాష్ట్రపతి ఉత్తర్వుల్లో పేర్కొన్న 'ఫేర్‌షేర్' మేరకు ప్రభుత్వ ఆధీనంలోని 12 లక్షల ఉద్యోగాల్లో రెండున్నర లక్షల ఉద్యోగాలు మాత్రమే తెలంగాణ ప్రాంతం వారికి అందులో అత్యధిక భాగం కంటింజెన్సీ, పార్ట్‌టైమ్ కాంట్రాక్ట్ ఉద్యోగులుగా కొనసాగడం చూస్తున్నాం.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడక ముందు 1939లో నైజాం ప్రభుత్వంలో అమలులో ఉన్న 1348 ఫస్లి అనే నిబంధన మేరకు ఎంపికైన పోలీసులకు 'సిటీ పోలీస్ ఆక్ట్' నిబంధనలు వర్తిస్తాయన్నారు. ఈ అంశాన్ని వక్రీకరించి ఇప్పుడు ఉద్యోగాల్లో లేని వాళ్ల కోసం హైదరాబాద్, 14 (ఎఫ్) రాష్ట్రపతి ఉత్తర్వులోని అంశాన్ని చూపిస్తూ 'ఫ్రీ జోన్' అంటూ అనేక ఉద్యోగాలు కొల్లగొట్టింది చాలక ఇప్పుడు హైదరాబాద్ మొత్తంగానే అన్ని శాఖలకు 'ఫ్రీ జోన్'గా ఉండాలన్న వాదనను తీసుకువచ్చారు. అంటే, ఇది ఉద్యోగాల్లో సాగుతున్న అక్రమాలను కొనసాగించడం ద్వారా హైదరాబాద్‌ను హస్తగతం చేసుకునే పన్నాగమేనని అర్థమవుతున్నది.

ఇట్లా ఉద్యోగాల్లో, నీళ్లలో, నిధులల్లో, భూముల్ని ఆక్రమించడం, ఓపెన్ కాస్ట్‌లో బొగ్గు నిలవలను తరలించడం, సెజ్‌ల పేర పోలేపల్లి ప్రజల జీవితాల్ని విధ్వంసం చేస్తున్నారు. పోలవరం, పులిచింతల నిర్మాణాల వల్ల నిర్వాసితులౌతున్న ప్రజానీకంతోపాటు, ప్రైవేట్‌రంగంలో కొనసాగు తున్న ఫ్యాక్టరీలు, పరిశ్రమలు వివిధ రంగాలకు చెందినసంస్థల్లో తమ వాటాకు రావాల్సిన ఉద్యోగాలు రాలేదు. తెలంగాణ ముఖద్వారం గుంటూరు దాచేపల్లి, వాడపల్లి దగ్గర ఉన్న 'ఇండియా సిమెంట్స్' (రాశి) కాలుష్యం, వనరులు భూములు తెలంగాణవి విధ్వంసమవుతుంటే అందులో పని చేస్తున్న ఉద్యోగులు 500 మందిలో కనీసం 'పదిమంది' కూడా తెలంగాణ బిడ్డలు లేరు. హైదరాబాద్ సెక్రటేరియట్, ఇన్ఫోసిస్, సత్యం హైటెక్ సిటీల్లో కోల్పోయిన కొలువులతో పాటు, తమ ఆత్మగౌరవం కోసం అరవై ఏళ్లుగా సాగుతున్న పోరాటాన్ని రాజకీయ నిరుద్యోగులు చేస్తున్న పోరాటంగా అభివర్ణించడం ఆంధ్రా వలసవాద దురహంకారానికి నిదర్శనం.

కాళోజీ అన్నట్లు పొట్టకూటి కోసం వచ్చే వాళ్లతో మాకే విభేదం లేదు. మా పొట్ట కొట్టడానికొచ్చిన తెలంగాణ ద్రోహుల్ని ప్రాంతం దాకా తరిమి కొట్టి, ప్రాంతం వాళ్లే దోపిడీ చేస్తే ప్రాంతంలోనే పాతర పెట్టే ఓ సామాజిక ఉద్యమం తెలంగాణ. ఇది సీమాంధ్ర ప్రజలకు వ్యతిరేకం కాదు. అయితే అరవై ఏళ్లుగా తెలంగాణ ప్రజల ప్రజాస్వామిక ఆకాంక్షగా సాగుతున్న ఉద్యమాన్ని తమ 'ఎస్టేట్'లు, వ్యాపారం, రాజకీయ ఆధిపత్యం అంతమౌతుందేమోనని కొంతమంది కోస్తాంధ్ర, రాయలసీమ పెట్టుబడిదారులు చేయిస్తున్న 'సమైక్యాంధ్ర' ఉద్యమం అప్రజాస్వామికమైనది. మా ప్రాంతం మాకు కావాలని, మా చదువులు, మా కొలువులు, మా పరిపాలన మేం సాగించుకుంటామంటే హైదరాబాద్‌లో భాగం తెలంగాణ అంటూ తెలంగాణ పదిజిల్లాల ప్రజల 'గుండె' కాయను గ్రేటర్ హైదరాబాద్ పేరిట, కేంద్ర పాలిత ప్రాంతంగానో, ఉమ్మడి రాజధానిగానో ఉంచాలన్న 'కుటిల' నీతితో తెలంగాణను వేరు చేయ చూడడాన్ని తెలంగాణ బిడ్డలు అంగీకరించలేరు.

అందుకని కేవలం హైదరాబాద్ మీద పెట్టుబడిదారులు, సెజ్ ఆక్రమణదారులు, బహుళజాతి కంపెనీల దోపిడిదారులకు అవకాశం ఉండకూడదంటున్నది తెలంగాణ ఉద్యమం. అక్కడ నివసించే ఏ ప్రాంత ప్రజలకు వ్యతిరేకం కాదన్నది గుర్తించాల్సిన అవసరం ఉంది.

కేవలం 'హైదరాబాద్' బూచిని చూపుతూ తమ కోస్తాంధ్ర, సీమ, ఉత్తరాంధ్ర ప్రాంతాల అభివృద్ధిని నిర్లక్ష్యం చేసిన పాలకులకు వ్యతిరేకంగా ఆ ప్రాంతాల అభివృద్ధి కోసం 'సమైక్యాంధ్ర' అన్న శుష్క నినాదం కోసం కాకుండా ప్రత్యేకాంధ్ర, గ్రేటర్ రాయలసీమ కోసం ఉద్యమాలను ఉధృతం చేయడం ద్వారా తమ వనరులు వసతులతో తమ ప్రాంతాలను, ప్రజలను అభివృద్ధి చేసుకునే పోరాటాలకు సిద్ధపడితే ఇటు తెలంగాణ అటు రాయలసీమ, కోస్తాంధ్ర ప్రాంతాలు అభివృద్ధి చెందుతాయన్న అంశాన్ని 'సమైక్యాంధ్ర' కోసం ఉసిగొల్పుతున్న నాయకులు, 'ఆందోళనకారులు' ఆలోచిస్తే అందుకు తెలంగాణ ప్రజల మద్దతు ఉంటుందని గుర్తించాలి. వీ

*సమైక్యాంధ్రలో తగిన ప్రయోజనాలు పొందని రాయలసీమ ప్రజలను ప్రస్తుతం 'సమైక్యాంధ్ర' ఉద్యమంలోకి లాగడం వెనుక సీమ నాయకుల పాత్రను విశ్లేషిస్తున్నారు* **పాణి**

# సీమ నాయకుల 'సమైక్య' పాత్ర

**వా**స్తవాలతో, హేతుబద్ధ వాదనతో సంబంధం లేకపోతే భావజాలం ఎంత ప్రబల శక్తిగా ఆవరించగలదో తాజాగా రుజువవుతున్నది. విశ్వాసాలు, భావోద్వేగాలు సెంటిమెంట్లుగా మారాక వాటికవే సాటి. కలిసి ఉండి కలహించుకుంటూ, బలవంతుల దగాకు బలహీనులు బలైపోతూ కూడా 'కలిసి ఉంటే కలదు సుఖం' అనే తీయని మాటలు వల్లించడం అసాధ్యమేమీ కాదు. గాలి బుడగ వంటి ఈ ఆదర్శం ఎంత వికృతత్వాన్ని బైట పెట్టుకోగలదో పదేపదే రుజువవుతుంటుంది. తెలంగాణకు కేంద్రం సానుకూల సంకేతం ఇవ్వగానే 'ఐక్యతావాదం' జడలువిప్పడం దీనికి తాజా ఉదాహరణ.

కోస్తా సంపన్నవర్గాలకు – రాజకీయ నేతలకు ఐక్యత చాలా అవసరమే. వాళ్ల ప్రభావంలో ఓటర్లుగా, లబ్ధిదారులుగా, అనుచరులుగా ఉండే ఆ ప్రాంత ప్రజలూ ఐక్యతా రాగం తీయడం విషాదమేగాని, పెద్ద విశేషమేమీ కాదు. సమైక్యాంధ్ర భావజాలానికి పురిటిగడ్డ కాబట్టి ఆ ప్రజలను తప్పుబట్టలేం. కానీ రాయలసీమ నేతలను ఇంతగా ఐక్యతా స్ఫూర్తి ఆవహించడమే ఒకింత ఆశ్చర్యం. టిజి వెంకటేశ్ దగ్గరి నుండి రాజీనామా చేయని శిల్పా మోహనరెడ్డి దాకా కర్నూలు జిల్లాలో సంపన్న వర్గాల, రాజకీయ నేతలందరి స్వప్రయోజనాలకు ఐక్యత ఆవశ్యకమే కావచ్చు గాని ప్రజా ప్రతినిధులుగా ఐక్యత కోసం రాజీనామాలు చేసి, బందులకు పిలుపునిచ్చి ఇంత నిస్సిగ్గు ప్రదర్శించుకోవడం నిజంగా ఆశ్చర్యమే. తరచి చూస్తే సీమ పాలకులకు ఇది వెన్నతో పెట్టిన విద్యే గదా అనిపిస్తుంది.

రాజకీయాలు నెరిపేవారికి కనీసంగా చరిత్ర తెలిసి ఉండాలని, మాటవరసకైనా ప్రజాస్వామ్యానికి కట్టుబడి ఉండాలని, సామాజిక ప్రయోజనాన్ని తాకట్టు పెడితే ఎట్లా అనే వెరుపు, ఇంగితం ఉండాలని అనుకొనే రోజులు గతించి పోయాయి. ప్రత్యేక తెలంగాణ ప్రక్రియ ప్రారంభిస్తామని అర్ధరాత్రి ప్రకటించగానే తెల్లారే సరికల్లా ఐక్యత ఇంతగా పూనడం ఏ మాత్రం యాదృచ్ఛికం కాదు. కేవలం సెంటిమెంటు కాదు. తెలంగాణ ముమ్మరమైన ప్రతిసారీ రాయలసీమ నుండి విచిత్రవాదన వినిపిస్తూనే వచ్చింది. తెలంగాణ ఇస్తే రాయలసీమ కూడా ఇవ్వాలనీ, లేదా వేలవేల కోట్ల రూపాయలివ్వాలనీ (ఈ అంకె ఏనాడూ నికరంగా వినిపించలేదు. ఏ తర్కం లేని అంకెలివి), గ్రేటర్ రాయలసీమ కావాలనీ పోటీ వాదనలు చాలా మంది తెచ్చారు. కానీ ఇంతవరకు రాయలసీమ ఎందుకు కావాలో, ఏ ప్రాతిపదికపై కావాలో ఎవ్వరూ సొంత విశ్లేషణలు ఇచ్చిన పాపాన పోలేదు. అంటే వీరి మనసులో రాయలసీమ ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్ష లేదు. తెలంగాణకు అడ్డం పడడమే గాని సీమ ప్రాంతీయ ప్రయోజనాలకు కట్టుబడాలనే నిజాయితీ లేదు. కోస్తా నుండి సమైక్యాంధ్ర నినాదం రావడం గురించి ఏ వివరణా ఇచ్చుకోనక్కర్లేదు. కానీ విచిత్రంగా తెలంగాణకు సానుకూల సంకేతాలు రాగానే అప్పటిదాకా గ్రేటర్ రాయలసీమ అన్నవాళ్లు కూడా సమైక్యాంధ్ర నినాదాన్ని ఎత్తుకున్నారు. తెలంగాణ వేరైపోతోందంటే కోస్తా, రాయలసీమ అగ్రకుల సంపన్న రాజకీయ నాయకులందరికీ ఒకే భయం పట్టుకున్నది. అంటే ఇద్దరి ప్రయోజనాలు ఒకటే. తెలంగాణ వేరైపోతే ఇద్దరికి కలిగే నష్టం ఒక్కటే. దానికోసం సీమ నేతలు అప్పటిదాకా ఉన్న గ్రేటర్ రాయలసీమ నినాదాన్ని కూడా వెనక్కి (అసలు గ్రేటర్ రాయలసీమ నినాదమే అప్రజాస్వామిక మనేదే వేరే విషయం) తోసేసి సమైక్యాంధ్రను కోస్తా వాళ్ల కంటే బలంగా వినిపిస్తున్నారు. సమైక్యాంధ్ర భావనను వ్యాపింపచేయడానికి శాయశక్తులా కృషి చేస్తున్నారు.

అయితే సీమ సమైక్యవాదులు ఒక ప్రశ్నకు సమాధానం చెప్పాల్సి ఉంటుంది. యాభై ఏళ్లుగా సమైక్యాంధ్రలో ఉండి సీమ ఏ ప్రయోజనాలు పొందింది? చరిత్ర తవ్వే కొద్దీ రాయలసీమ విద్రోహాల పరంపరే తప్ప సమైక్యాంధ్రలో ఏమున్నది? శ్రీబాగ్ ఒడంబడిక దగ్గరి నుండి రెండు ప్రాంతాల మధ్య జరిగిన ఏ ఒప్పందాలు అమలయ్యాయి? సీమకు మేలు జరిగే ఏ పథకాన్ని కోస్తా నేతలు సజావుగా సాగనిచ్చారు? ఇట్లాంటి దాచేస్తే దాగని సత్యాలను సమైక్యాంధ్ర సెంటిమెంటు కింద దాచేస్తే చరిత్ర క్షమించదు.

జాతీయోద్యమంలో అనేక ఇతర సమస్యలు వాయిదా పడ్డాయని మనం చరిత్రలో చదువుకుంటాం. కాని ఆంధ్రోద్యమంలో మద్రాసు ఉమ్మడి రాష్ట్రం నుండి భాషా రాష్ట్రంగా వేరైపోవాలని 1913లో డిమాండ్ వచ్చినప్పుడు రాయలసీమ సమస్యలు ప్రత్యేకంగా చర్చనీయాంశమయ్యాయి. భవిష్యత్తులో ప్రాంతీయ అసమానతల రూపంలో, వివక్ష రూపంలో ఒక ప్రబల సమస్య ముందుకు రాబోతోందని అప్పటి సీమ నాయకులు ఊహించారు. అందుకే మద్రాసు రాష్ట్రం నుండి బైటికి రావాలనేగాక ప్రత్యేక రాయలసీమ నినాదాన్ని కూడా ముందుకు తీసుకొని వచ్చారు. మద్రాసు నుండి బైటికి వచ్చినా కోస్తా వాళ్లతో రాయలసీమ వాళ్లకు కష్టమే అని సీమ నాయకులు చాలా ముందుచూపుతో ఆందోళనపడ్డారు. సరిగ్గా సమైక్యాంధ్ర అర్ధశతాబ్ది చరిత్ర వారి అనుమానాన్ని అక్షర సత్యం చేసింది. ఇదంతా ఒక ఎత్తయితే ఇప్పటి సీమ నాయకుల దగుల్బాజితనం అవమానకరంగా తయారైంది. కడప

కోటిరెడ్డి, కల్లూరి సుబ్బారావు, పప్పూరి రామాచార్యుల్లాంటి వారి వ్యక్తిత్వాన్ని ఇప్పటి నాయకుల్లో ఆశించలేం గాని కనీస లోకజ్ఞానం కూడా లేకపోతే ఎలా? ఆరోతరగతి విద్యార్థికి తెలిసిన చరిత్ర కూడా సీమ రాజకీయ నాయకులకు తెలుసునని నమ్మలేం. వీటన్నిటికంటే చాలా ఆశ్చర్యకరమైన విషయమేమంటే – ఫ్యాక్షన్ హింస, అక్రమ సంపాదనలు, పంచాయితీలు, సారా, గనులు వంటి వ్యాపారాలు, తప్పుడు వాగ్దానాలతో ప్రజలను మోసం చేయడం, ఒకరి మీద ఒకరు దుమ్మెత్తి పోసుకుంటూ గౌరవనీయు లెవరూ ఉచ్చరించడానికి కించపడే తిట్లు తిట్టుకొనే సీమ నేతలు (ఆమాటకొస్తే అన్ని ప్రాంతాల నాయకులూ ఇంతే లెండి) ఈ నడమ భాష, సంస్కృతి, తెలుగుదనం గొప్పదనం, తెలుగు ప్రజల మానవ సంబంధాలు వంటి మాటలు అనడం వింటుంటే ఆశ్చర్యం కలుగుతోంది. ఈ భాష వీళ్లకెలా పట్టుబడింది? ఇంత సున్నితమైన భావనల అర్థం ఏమిటో వీరికి తెలుసా? అవి మాట్లాడే నైతిక అర్హత వీరికున్నదా? వారికి ఇట్లాంటి సందేహాలు కూడా కలగకపోవడమే ఈ కాలం వైపరీత్యం.

కోస్తాంధ్ర పెట్టుబడిదారులకు లొంగిపోయిన కేంద్ర ప్రభుత్వం ఈ నెల 23న చర్చల ద్వారా ఏకాభిప్రాయం సాధించాక తెలంగాణ గురించి ఆలోచిస్తామని చెప్పి అటు కోస్తా నేతలను, సీమ నేతలను సంతృప్తిపరిచింది. తెలంగాణకు మరోసారి మొండిచెయ్యి చూపడమే దీని ఉద్దేశ్యం. చిదంబరం తాజా ప్రకటనలో సీమ ప్రజలకు కూడా ఒక సంకేతం ఉన్నది. సీమ నేతలు ఈ కుట్రలో ఎంత పెద్ద ఎత్తున మిలాఖత్ అయిందీ ఈ రెండు ప్రాంతాల పాలకవర్గాల ప్రయోజనాల కోసం ఆయా ప్రాంతాల న్యాయమైన ఆకాంక్షలను బలిపెట్టడానికి తాము సదా సిద్ధమని చెప్పకనే చెప్పినట్టయింది. అందువల్ల సీమ ప్రజల సమస్యల పరిష్కారానికైనా, ప్రత్యేక రాయలసీమ రాష్ట్ర సాధనకైనా కోస్తా పాలకులు ఎంత అవరోధమో సీమ ముఠా నాయకులు కూడా అంతే అవరోధమని తేలిపోయింది.

దీన్ని అర్థం చేసుకోవాలంటే సీమ ఫ్యాక్షనిజంలో వచ్చిన మౌలిక మార్పు గుర్తించి తీరాలి. 1990ల చివరి వరకూ సీమ నేతలు పాతకాలపు భూస్వామ్య సాయుధ ముఠాలుగా వ్యవహరించేవారు. బాంబులు, వేటకొడవళ్లు సీమలో నిత్యావసర వస్తువులుగా మార్చేశారు. ప్రతి చిన్న తగాదాలను కుత్తుకలు తెగిపోయేదాకా, వంశ నిర్మూలనదాకా తీసికెళ్లారు. బాంబుల పరిశ్రమలు తప్ప మరో పరిశ్రమలను సీమ నేతలు అభివృద్ధి చేయలేదనే మాట కేవలం ఆలంకారికంగా అనుకోవడం కాదు. పంట పొలాలకు చారెడు నీళ్లు లేకపోయినా రక్తపుటేరులు మాత్రమే పారాయనే క్రైం ఆడిట్ చరిత్రలో నిక్షిప్తమై ఉన్నది. ఈ నేపథ్యంలో ముఠా నాయకుల తుపాకుల లైసెన్స్‌ల రద్దు కోసం ప్రజలు పెద్ద ఎత్తున పోరాటం చేయవలసి వచ్చింది. ఈ ఉద్యమానికి ఇటీవలి సీమ సామాజిక చరిత్రలో చాలా ప్రాధాన్యత ఉన్నది. నిజానికి ఆ కాలానికి సీమ ముఠా నాయకులు ఇప్పటి వలె పూర్తి స్థాయి రాజకీయ నాయకులు కాలేదనే చెప్పాలి. వాళ్ల హింసాకాండ నిలువరించడానికి తుపాకుల లైసెన్స్ రద్దు చేయాలనే డిమాండ్‌తో జరిగిన ఉద్యమంలో అంతర్గతంగా ఒక సందేహం కూడా ఉండేది. అసలు ముఠా నాయకుల కార్యక్రమాలు లైసెన్స్‌డ్ తుపాకులతోనే జరుగుతున్నాయా? అక్రమ తుపాకులు, ఏ లైసెన్స్ అక్కర్లేని బాంబులు, వేటకొడవళ్ల వినియోగం సృష్టించే విధ్వంసం మాటేమిటి? అనే సందేహం ఉన్నా ఆ ఉద్యమం సీమ ఫ్యాక్షనిజం గురించి బహిరంగ చర్చను రంగం మీదికి తీసుకొని వచ్చింది. ముఠా నాయకులను బహిరంగంగా విమర్శించే ప్రజాస్వామిక ఆచరణను ఏర్పరిచింది. నేరుగా ఈ ఉద్యమం వల్లనే కావచ్చు, ప్రపంచీకరణ లాంటి అభివృద్ధి కార్యక్రమం వల్ల కావచ్చు, బూర్జువా రాజకీయాల్లోనే వచ్చిన మార్పుల వల్ల కావచ్చు. ఫ్యాక్షనిజంలో మార్పులు జరిగాయి. ఈ మార్పులకు మేలిమి ఉదాహరణ వై.ఎస్. రాజశేఖరరెడ్డి. అప్పటికున్న పాత ఫ్యాక్షన్ వ్యవహారం నుండి బైటపడి ఆధునిక ఫ్యాక్షనిస్టుగా సంపూర్ణ రూపాన్ని ధరించాడాయన. తన తండ్రి రాజారెడ్డి తరహా ఫ్యాక్షన్ పద్ధతులకు స్వస్తి చెప్పి 'జనరంజక రాజకీయ' పంథాలోకి అడుగిడుతున్న కాలమది. ఎందుకంటే ఆయనకు ముఖ్యమంత్రి కావాలనే కోరిక అప్పటికే బలంగా కలిగింది. ఆ తర్వాత్తర్వాత ఆయన కాంగ్రెస్ ఫ్యాక్షనిస్టులకు ఆదర్శప్రాయుడైన ఆధునిక పాలెగాడిగా నమూనా అయ్యాడు. ఇవ్వాళ తెలంగాణకు వ్యతిరేకంగా, కోస్తా పాలకులకు సరిదోడుగా సీమ నాయకులు నిలబడడానికి ఈ రాజకీయార్థిక విశ్లేషణ చాలా అవసరం. నిన్న మొన్నటిదాకా జరిగిన సమైక్య ఆందోళన ఉధృతికి, సీమ అంతటా తెలంగాణ వ్యతిరేక సమైక్య నినాదం హోరెత్తడానికి కోస్తా పెట్టుబడి పాత్ర అందరికీ తెలిసిందే. సీమపెట్టుబడి పాత్రను, ఆ ప్రాంత ముఠానాయకుల్లో వచ్చిన కీలక మార్పులను తెలుసుకోకుంటే తెలంగాణకు ఎందుకిన్ని అవరోధాలు వస్తున్నాయో తెలియదు. అవి కేవలం రాష్ట్ర రాజకీయ సమీకరణాల్లోనే గాక, ఏకంగా కేంద్ర ప్రభుత్వ నిర్ణయాలను సైతం ప్రభావితం చేయడం వెనుక ఉన్న సూక్ష్మ కారణాలు మరుగున పడిపోతాయి.

మొట్టమొదటి కారణం సీమ అగ్రకుల సంపన్నవర్గాల ఆర్థిక పునాది మారింది. జాతీయోద్యమం తర్వాత సీమ గ్రామీణ ప్రాంతాల్లోని తగాదాలకు పూర్తిగా ఫ్యూడల్ ఆదాయవర్గాలు, వాటి మీద పెత్తనం, వాటిని హస్తగతం చేసుకోవడంలో పోటీ, గ్రామ పంచాయితీలపై రాజకీయాధికారం మొదలైనవి ఆనాటి గ్రామ జీవిత సంఘర్షణను నిర్ణయించాయి. 1980ల చివరి నాటికే వారి ఆదాయ మార్గాలు మారాయి. అది సారా వ్యాపారంతో మొదలైంది. సారా సామ్రాజ్యాలు లక్షలకు పడగలెత్తడమే గాక కొత్త అధికార దొంతరలు రూపొందాయి. సారా పోటీలు, ఘర్షణలు తీవ్రమైన రక్తపాతానికి దారితీసాయి. ఈ అధికార, ఆర్థిక చట్రంలోకి కింది స్థాయి నుండి నూతన శక్తులు, వ్యక్తులు ఎదిగి వచ్చారు. ఫ్యాక్షనిజం వ్యవస్థీకృతం కావడానికి ఇక్కడ బీజం పడిందని చెప్పుకోవచ్చు.

దీని తర్వాత ఇంతకంటే ముఖ్యమైనది, గనుల వ్యాపారం. సీమలోని అపారమైన ఖనిజ సంపదను గుప్పెడు మంది తమ బొక్కసాలకు తరలించుకోవడం మొదలయ్యాక సీమ ఆర్థిక వ్యవస్థ అనూహ్యంగా మారిపోయింది. అక్రమ మైనింగ్ వంటి కొత్త ఆదాయ మార్గాలు తెరచుకోవడం, ఫ్యాక్షనిజంలో కొత్త పోకడలు రావడం మధ్య చాలా దగ్గరి సంబంధాలున్నాయి. ఈ రెండింటి కలయికను వైఎస్‌లో చూడవచ్చు. ఇంకోరకంగా చూస్తే అనంతపురం జిల్లాలో పరిటాల రవి అటు రామగిరి గనుల మీది నుండేగాక అనేక అక్రమ ఆదాయ మార్గాలను ఆవిష్కరించడమే గాక రియల్ ఎస్టేట్‌లోకి ఫ్యాక్షనిజాన్ని తీసికెళ్లాడు. నగరాల చుట్టూ భూముల అక్రమ ఆక్రమణ అంతకుముందు

కొందరు ఫ్యాక్షనిస్టులు కూడా చేసి ఉండొచ్చుగాని దాన్ని ఒక ప్రధాన వనరుగా మార్చిన ఘనత రవిదే. సీమాంతర ఫ్యాక్షనిజానికి ఆద్యుడాయన. రియల్ ఎస్టేట్ సహజంగా భూముల అక్రమ వ్యాపారంగా, దురాక్రమణగా, వీటి కోసం హత్యల దాకా వెళ్లిపోయింది. హత్యా రాజకీయాలు, హత్యా ఆదాయ మార్గాలు సీమలో అంతకు ముందటి ఫ్యాక్షనిజం స్థానే ఆధునిక ఫ్యాక్షనిజాన్ని తీసుకొని వచ్చాయి. ఒకరకంగా వ్యవసాయరంగంలో మిగులు దోపిడీ, సంప్రదాయ పద్ధతిలో శ్రమ శక్తిని కొల్లగొట్టడం అప్రధానమైపోయింది. అసలు మూడు జిల్లాల్లో పేర్లు తీసి లెక్కలు వేశామంటే భూమిని వ్యవసాయ వనరుగా, ఉత్పత్తి వనరుగా భావించే ఫ్యాక్షనిస్టుల సంఖ్య బాగా తగ్గిపోయింది. పెద్ద మొత్తంలో భూములు ఉండొచ్చు. వ్యవసాయం కూడా చేయిస్తుండొచ్చు, గాని వ్యవసాయం ప్రధాన ఆదాయ వనరుగా భావించే పరిస్థితి పోయింది. నాలుగు జిల్లాలు సగటున వర్షాభావ ప్రాంతం కావడం వ్యవసాయానికి ప్రకృతి విధించిన పరిమితి ఉన్నది. దీనికి తోడు కృష్ణా పెన్నార్ ప్రాజెక్టు దగ్గరి నుండి సాగునీటి ప్రాజెక్టులు ఏవీ అమలు కాలేదు. సంప్రదాయ నీటి పారుదల వ్యవస్థ సర్వ నాశనమైపోయింది. వీటన్నిటి వల్ల సీమలో వ్యవసాయం అడుగంటిపోయింది. సంపన్న వర్గాలకు వాళ్ల ముందు తరాల వారి వలె వ్యవసాయం మీద, గట్ల పంచాయితీల మీద, దౌర్జన్యం చేసుకొని పేదవాళ్ల భూములు ఆక్రమించుకోవలసిన అవసరం లేకుండా పోయింది.

ఇప్పుడున్న రాయలసీమ రాజకీయ నాయకులు లేదా ఫ్యాక్షనిస్టులు అందరికందరూ పెట్టుబడులు పెట్టి భారీ వ్యాపారాలు ప్రధాన ఆదాయ మార్గంగా ఉన్నవారే. వ్యవసాయ ప్రక్రియ ద్వారా గ్రామ సంబంధాలను అదుపులో ఉంచుకోవడంలో కూడా మార్పులు మొదలయ్యాయి. కొత్త ఆదాయ మార్గాలు, కొత్త అధికార రూపాలు, కొత్త అణచివేత రూపాలు, కొత్త దోపిడీ రూపాలు సీమ ఫ్యాక్షనిజంలో ప్రవేశించాయి.

వీటికి తోడు ప్రపంచబ్యాంక్ నిధులు, కరువు నిధులు, 'అభివృద్ధి' నిధులు ఫ్యాక్షన్ ఎకానమీకి పూర్తి ఆధారభూతమయ్యాయి. అనంతపురం జిల్లాలో కరువు సహాయక నిధులు చాలా పెద్ద ఎత్తున ఫ్యాక్షన్ వనరులుగా మారిపోయాయి. చాలా విచిత్రంగా ఇలాంటి సంపద సైతం పెట్టుబడిగా మారింది. అనంతపురంలో గంజి కేంద్రాలతో జీవితాన్ని నిలబెట్టు కోవలసిన దుస్థితి ఒక పక్క ఉంటే మరోపక్క దేశంలోని సరికొత్త కార్లు అనంతపురం రోడ్ల మీద తిరుగాడతాయని సాయినాథ్ అన్నారు. అంతవరకే అయితే ఈ రకరకాల రూపాల్లో ఆర్జించిందంతా సంపదగానే ఉండిపోయిందని సరిపెట్టుకోవచ్చు. నిజానికి గత ఇరవై ఏళ్లలో ఫ్యాక్షనిజంలో అంతర్గతంగా వచ్చిన మార్పులు రాయలసీమ సమాజ గర్భంలోనే వచ్చిన మార్పులుగా చూస్తే కొత్త విషయాలు తెలియవచ్చు. అప్పుడది కేవలం అక్రమ మార్గాల్లో పోగయిన సంపద నిర్వహించే పాత్రే దీనికున్నదని సరిపెట్టుకోలేం. చాలా పెద్ద ఎత్తున పునరుత్పత్తి అవుతున్నది. దాంతోనే ఈ ఆధునిక ఫ్యాక్షనిస్టుల వ్యాపార సామ్రాజ్యాలు రాయలసీమను దాటి హైదరాబాద్‌కు, బెంగుళూర్‌కు విస్తరించాయి. అంటే ఎక్కడ లాభం వస్తే అక్కడికి వెళ్లిపోయే స్వభావమున్న పెట్టుబడిగా మారిపోయింది. ఒక్కమాటలో చెప్పాలంటే ఫ్యాక్షనిజం తన ఫ్యూడల్ అవశేషాలను బలంగా నిలబెట్టుకుంటూనే ఆధునిక పరివర్తనకు గురైంది. అంటే ఆధునిక పూర్వ అవశేషాలను నిలిపి ఉంచే ప్రక్రియగా అది ఆధునికతలోకి వెళ్లిపోవడం అనే అంతర్గత సర్దుబాటుకు లోనైంది. దీన్ని విస్మరించి ఫ్యాక్షనిజాన్ని ఇప్పటికీ తెలుగు సినిమాల్లో వలె అర్థం చేసుకోవడం ప్రయోజనం లేదు. ఈ మార్పు వల్ల సీమ ఆర్థిక వ్యవస్థలో మార్పు వచ్చిందని అన్నామంటే యావత్తు ఆర్థికరంగం మాపోయిందని అర్థం కాదు. ఈ ప్రక్రియ వల్ల సీమ నిజమైన ఆర్థిక వ్యవస్థలో అంతరాలు అంతకు ముందటి కంటే పెద్దఎత్తున పెరిగిపోయాయి. సామాజికంగానూ, సాంస్కృతికంగానూ. ఫ్యూడల్ ఆధిపత్యం ధృడంగా నిలిచి ఉంటూనే ఆర్థిక వ్యవస్థలో వచ్చిన మార్పిది. ఒకమాటలో చెప్పాలంటే పాత పాలెగాళ్లు కనుమరుగైపోయి ఆధునిక వ్యవస్థా రూపాలతో, ఆధునిక సంప్రదాయాలతో వ్యవహరించవలసిన కొత్త సన్నివేశంలోకి ఈతరం పాలెగాళ్లు చేరుకున్నారు.

ఇప్పటి సమైక్యాంధ్ర ఉద్యమంలో సీమ నాయకుల పాత్ర అర్థం చేసుకోవడానికి ఈ వివరాలు కొంచెం తెలిసి ఉండడం అవసరం. 1985 సీమాందోళన తర్వాత మళ్లీ ప్రాంతీయ స్థాయిలో నాటి సమస్య మీద ఉద్యమం జరగలేదు. కాకపోతే పాలమూరు రాజోలి బండ మీదికి రైతులను వెంటేసుకొని వెళ్లి పగలగొట్టి రావడం లాంటి వీరోచిత కార్యక్రమాలు చేసి రెండు పేద ప్రాంతాల ప్రజలు తలలు పగలుగొట్టుకొనే స్థితి కల్పించారు. ఇది ఎన్నికల స్టంటే అని అందరికీ తెలిసిందే. సీమకు రావలసిన న్యాయమైన నీటి వాటా కోసం పోరాటమనిపించుకోదు. ఇది తప్ప కనీసం ఇరవై పాతికేళ్లుగా రాజకీయ నాయకులు ప్రాంతీయ నీటి పారుదల సమస్యల మీద గాని, సమైక్యాంధ్రలో నీటి పంపిణీలో జరిగిన అన్యాయం గురించి గాని ఒక్క మాట మాట్లాడలేదు. చిన్న ఉద్యమం కూడా చేయలేదు. దీనికి మంచి ఉదాహరణ కూడా చెప్పుకోవచ్చు. బచావత్ ట్రిబ్యునల్ కాలపరిమితి పూర్తవుతున్న తరుణంలో ఇప్పటికే కృష్ణాజలాల్లో రాయలసీమకు అన్యాయం జరిగిందని, పునఃపంపిణీ సమయంలోనైనా సీమ తరఫున సాధికారికమైన వాదన పెట్టాలని బాలగోపాల్ చాలా ప్రయత్నం చేశారు. కృష్ణా జలాల పునఃపంపిణీ ఉద్యమం పేరుతో సీమ, పాలమూరు, నల్లగొండ జిల్లాలన్నిట్లో కదలిక తెచ్చారు. అన్ని జిల్లాల్లో పత్రికా సమావేశాలు పెట్టి ప్రజాప్రతినిధులు స్పందించాలని డిమాండ్ చేశారు. సీమ ప్రజా ప్రతినిధుల్లో ఒక్కరు కూడా స్పందించలేదు. ప్రజా సంఘాలే బాలగోపాల్ నేతృత్వంలో అంతో ఇంతో ఆ పని చేశాయి.

సీమ పాలకవర్గాలు బచావత్ గురించి పట్టించుకోకపోవడానికి అప్పటికే వాళ్ల వ్యాపకం వ్యవసాయం మీది నుండి గనులు, సారా మొదలైన వాటి మీదికి వెళ్లింది. నీటి పారుదల గురించి ఇంత చెప్పడం దేనికంటే, రాయలసీమ హక్కుల కోసం నడుం బిగించిన వీరులకు ఎప్పుడూ రాయలసీమ వ్యవసాయరంగం గుర్తుకు రాలేదని చెప్పడానికే. కాకపోతే తెలంగాణలో ప్రత్యేక రాష్ట్రమని ఆందోళన మొదలైన ప్రతిసారీ పోటీగా రాయలసీమ సమస్యను ముందుకు తేవడం ఒక వ్యసనంగా మారిపోయింది. నిజానికి ఈ సంస్కృతికి ఆద్యుడు వై.ఎస్. రాజశేఖరరెడ్డి. టి.ఆర్.ఎస్. ఏర్పడ్డాక ప్రతిపక్ష నేతగా సీమ సమస్యలపై కడపలో సామూహిక నిరసన దీక్షకు దిగడం నుండి నలభై మందితో కలిసి ఢిల్లీ వెళ్లేదాకా అన్నీ చేశాడు. వై.ఎస్. ముఖ్యమంత్రి అయ్యాక సీమ భూతల స్వర్గం అయిందని ప్రచారం జరుగుతున్నది గాని అదనంగా

ఒక్క ఎకరాకు సాగునీరందిందేమో లెక్కలు తీయాల్సిందే. పోతిరెడ్డి పాడు సమస్యను తీసుకొని వచ్చింది కూడా సీమలో వ్యవసాయాన్ని ఉద్ధరించడానికి కాదని, పులివెందుల, కడప చుట్టూ ఆయన తలపెట్టిన సొంత పరిశ్రమలకు నీరు అందించుకోవడానికే అనే వాదన ఏమాత్రం తప్పుకాదు. ఈ విషయంలో తెలంగాణ వాళ్లు పెడుతున్న విమర్శ కాదనడానికి లేదు. నిజంగానే సీమ వ్యవసాయం మీద, నీటిపారుదల మీద ప్రేమ ఉంటే మిగతా అన్ని ప్రాంతాలకంటే సీమలోనే రైతుల ఆత్మహత్యలు ఎక్కువ ఎందుకు జరిగాయి? రాష్ట్రం మొత్తం మీద కర్నూలు జిల్లా రైతు ఆత్మహత్యల్లో ప్రథమ స్థానం ఎట్లా సంపాదించుకున్నది?

సీమ నాయకులు తాము వ్యవసాయం నుండి షిఫ్టు కావడం, గనులు తదితర అక్రమ వ్యాపారాల మీదికి జోరెత్తడం వల్ల వ్యవసాయాన్ని సహజంగానే నిర్లక్ష్యం చేశారు. అపారమైన సహజ వనరుల మీద గుత్తపెత్తనం సంపాదించి, గనులు తవ్వి విదేశాలకు ముడిసరుకులు తరలించి కమిషన్ వ్యాపారాలకు మరిగిన తర్వాత ప్రాంతీయ అభివృద్ధి గురించి, వ్యవసాయం గురించి ఎందుకు పడుతుంది. ఇట్లా సంపాదించిన దాన్ని హైదరాబాద్ చుట్టూ పెట్టుబడులు పెట్టారు. అందువల్ల చిదంబరం తెలంగాణకు అనుకూలంగా తొలి ప్రకటన చేయగానే రాత్రికి రాత్రి సమైక్యాంధ్ర నెత్తికెక్కింది. సీమ జలవనరులు, విద్యావకాశాలు కోస్తా వాళ్లు, నెల్లూరు జిల్లా వాళ్లు కాజేశారని ఇప్పటి హేమాహేమీ నాయకులందరూ 1980ల ఉద్యమంలో అరిచినవాళ్లే. అవన్నీ చాలా సౌకర్యంగా మర్చిపోయి గ్రేటర్ రాయలసీమ నినాదాన్ని కొంతకాలం సాగించి చివరికి తమ పెట్టుబడులకు ఇబ్బందులు తలెత్తుతాయనే అభద్రతతో సమైక్యాంధ్ర ఉద్యమంలో కోస్తా సంపన్న అగ్రకుల పాలకులతో గొంతు కలిపి ఎలాగైనా తెలంగాణను అడ్డుకోవాలని, హైదరాబాద్‌ను గుప్పిట్లో ఉంచుకోవాలనే కుట్రకు సిద్ధమయ్యారు. సమైక్యాంధ్ర అనేది సీమను ఎన్నేళ్లుగా వేరు పురుగులాగా తొలిచి వేసిందనే సత్యాన్ని మరుగుపరచాలనుకుంటున్నారు. ఇది రాయలసీమకు, తెలంగాణకు కూడా తీవ్ర నష్టం చేస్తుంది. అందువల్ల తెలంగాణకు వ్యతిరేకంగా కోస్తాంధ్ర వలస పాలకుల గురించి ఎంత మాట్లాడుకోవాలో, తెలంగాణతో పాటు సీమ ప్రజలకు తీరని అన్యాయం చేసిన, చేస్తున్న సీమ అగ్రకుల ఆధునిక పారిశ్రామిక వ్యాపార పాలెగాళ్ల గురించి అంతే మాట్లాడుకోవాలి.

విస్పష్టంగా తెలంగాణ రాష్ట్రానికి వ్యతిరేంగా కోస్తా అగ్రకుల సంపన్న వర్గాలతో కలిసి సీమ అగ్రకుల నాయకులు కలిసి లేవదీసిన పోటీ ఉద్యమమే సమైక్యాంధ్ర. ఇక్కడి ప్రజల శ్రమశక్తిని కొల్లగొట్టి హైదరాబాద్‌లో పెట్టిన పెట్టుబడులను కాపాడుకోవడానికి సమైక్యాంధ్ర పూనకాన్ని జనానికి ఎక్కించే ప్రయత్నమిది. కాంగ్రెస్ పార్టీలలోని అంతర్గత కలహాలు కూడా ఈ సమైక్యాంధ్ర ఉద్యమానికి తక్షణ కారణం. అసెంబ్లీలో తెలంగాణ బిల్లు ప్రవేశపెట్టేలా చూస్తామని అధిష్టానం అంటే జగన్ ఈ రాజీనామా పర్వంతో రోశయ్య మీద అవిశ్వాస తీర్మానం ప్రవేశ పెట్టడానికి రంగం సిద్ధం చేశాడు.

కోస్తా పెట్టుబడిదారుల ఒత్తిడికి తలొగ్గి చర్చల ద్వారా, ఏకాభిప్రాయ సాధన ద్వారా తెలంగాణ సమస్యలను పరిష్కరిస్తామని చిదంబరం అనడంలో తెలంగాణను మోసం చేయడమే గాక రాయలసీమ ప్రజల న్యాయమైన ఆకాంక్షల పట్ల కూడా రాజ్యం తన దుర్మార్గమైన సంకేతాలను పంపించినట్టే. కోస్తా పాలకులు ఏకాభిప్రాయానికి వస్తారని ఎలా ఆశించగలం?

అయితే రాష్ట్ర డిమాండ్ అనేది ఇప్పటికి రాయలసీమకు తక్షణ ప్రేరణగా, అత్యవసరంగా ముందుకు వచ్చినా చరిత్రలో ప్రత్యేక రాష్ట్ర డిమాండ్ ఉన్నదని మర్చిపోరాదు. ప్రత్యేక సీమ అనగానే నాలుగు జిల్లాలు ప్రత్యేక రాష్ట్రంగా మనగలవా అనే సందేహాలు ముందుకు వస్తున్నాయి. ఇవి కేవలం సీమ దోపిడీ వర్గాల నుంచి వస్తే పట్టించుకోనవసరం లేదుగాని సాధారణ ప్రజల నుంచి, విద్యావంతుల నుంచి కూడా వస్తున్నాయి. చిన్న రాష్ట్రాలు అభివృద్ధి సాధించలేదనే వాదనను ఓడించడానికి ఎన్ని ఉదాహరణలయినా చూపవచ్చు. ముఖ్యంగా సీమ రాష్ట్ర డిమాండ్ అభివృద్ధి నమూనాకు సంబంధించిన చర్చగా మారాలి. వలసపాలన కాలంలో కోస్తాలో రూపొందిన అభివృద్ధి నమూనా వలె, ప్రపంచీకరణ తర్వాత హైదరాబాద్ కేంద్రంగా సాగిన అభివృద్ధి నమూనా కూడా రాయలసీమకు సరిపోదు. వర్షాభావ ప్రాంతం కావడం, సంప్రదాయ నీటివనరుల వ్యవస్థ సమూలంగా నాశనమై పోవడం, కృష్ణా జలాల్లో నేటికీ సీమకు రావలసిన న్యాయమైన వాటా రాకపోవడం అనే సమస్యలు చాలా ముఖ్యం. అయితే కృష్ణా జలాల్లో న్యాయం జరిగినా సీమ అంతా సస్యశ్యామలం అవుతుందని చెప్పలేం. భూగర్భ జలాలు తక్కువగా ఉండడం, వర్షాభావం వల్ల ఇక్కడి వ్యవసాయం చాలా భిన్నంగా ఉంటుంది. కాబట్టి కోస్తా తరహా నమూనా ఇక్కడ కష్టమే. ఇక హైదరాబాద్ తరహా నమూనా చాలా మందిని భ్రాంతిలో ముంచేసింది. మౌలిక కల్పనలు అన్ని ప్రాంతాల్లో అవసరమే గాని స్థానిక నైసర్గిక పరిస్థితుల మీద ఆధారపడకుండా, వాటిని దృష్టిలో పెట్టుకోకుండా అభివృద్ధిని కోరుకోవడం అశాస్త్రీయం. సీమలోని అపార ఖనిజ సంపద మీద ముఠానాయకుల వ్యక్తిగత యాజమాన్యం రద్దుచేసి, కేవలం ముడి సరుకు అమ్ముకొని కోట్లకు కోట్లు సంపాదించే పద్ధతి రద్దు చేసి పారిశ్రామికంగా అభివృద్ధి చేసిన నాడు తప్పక వ్యవసాయానికి తోడు ప్రధాన రంగంగా పారిశ్రామిక రంగం సీమను అభివృద్ధి పథంలోకి తీసుకెళుతుంది. వ్యవసాయంలోనైనా, పారిశ్రామిక రంగంలోనైనా స్థానిక పరిస్థితులకు అనుగుణంగా అభివృద్ధి నమూనాను ఎంతగా చెప్పి ఒప్పించగలమో అంతగా సీమ ప్రత్యేక రాష్ట్ర సాధనకు దారి సుగమమవుతుంది. అది కోస్తాంధ్ర దోపిడీని, స్థానిక అగ్రకుల రాజకీయ సంపన్న వర్గాలను వ్యతిరేకించే ఉద్యమం కావాలి. అది తప్పక ఇతర వెనుకబడిన ప్రాంతాల ప్రజాస్వామిక హక్కును గుర్తించే చైతన్యానికి దారి చూపుతుంది.

ప్రత్యేక రాయలసీమ తనదైన అభివృద్ధి నమూనాను రూపొందించుకోవడానికి చాలా మంది కలిసి పెద్ద కృషి చేయవలసి ఉంటుంది. సీమ పల్లెల్లో భయానకమైన అంటరానితనం, వెనుకబాటు తనం, ముఠా సంస్కృతి తాండవిస్తున్న వర్తమాన పరిస్థితుల్లో ఆధునిక రాయలసీమను సాధించడం లక్ష్యం కావాలి. ఈ ఆధునికత ఇప్పటికే మన ముందున్న అభివృద్ధి నమూనాల నుండి బైట పడకుండా సాధ్యం కాదు. ఈ నమూనాల భావజాలం మనలను వెంటాడుతున్నది. దీని నుండి విముక్తి పొందినప్పుడే కోస్తాంధ్రలో ఇంతకాలంగా జరిగిన అన్యాయాలను నిలువరించి స్థానిక అభివృద్ధి నమూనా వల్ల సీమ ఆధునిక సమాజంగా రూపొందుతుంది. వీ

*ఒక పక్క తెలంగాణ ప్రజల ఆరాట పోరాటాలు, మరోపక్క వాటిని తీవ్రంగా అణచివేస్తూ సమాంతరంగా సాగిన కాంగ్రెస్ పాలకుల కుటిల చరిత్రను వివరిస్తున్నారు* **ఎం. రాఘవాచారి**

# కాంగ్రెస్‌దంతా మోసాల చరిత్రే

బ్రిటిష్ ఇండియాలో 1947కు ముందు పరిస్థితులు వేరు. హైదరాబాద్‌లో వేరు. 1947-56 మధ్యకాలంలో హైదరాబాద్ పరిస్థితులు వేరు. దేశమంతా ఎందుకు, హైదరాబాద్ (తెలంగాణ)కు ఆంధ్రకే ఎంతో తేడా ఉంది. నిజాం రాజుతో బ్రిటిష్ వాడి స్నేహం వలన 1766 నుంచి ఆంధ్రా, 1800 నుంచి రాయలసీమ మద్రాసు ప్రెసిడెన్సీలోకి, బ్రిటిష్ వాడి ఏలుబడిలోకి పోయాయి. హైదరాబాద్ రాజ్యంలో జరిగిన పోరాటం తెలుగు భాష కోసం, భూమి కోసం, భుక్తి కోసం, విముక్తి కోసం. ఆంధ్రలో జరిగింది జాతీయోద్యమంలో భాగమైన పోరాటం. ఉమ్మడి మద్రాసు నుండి ఆంధ్రను వేరు చేయడానికి జరిగిన పోరాటం. స్వామి సీతారాం, పొట్టి శ్రీరాములు నిరాహార దీక్షలు చేసింది ఆంధ్ర రాష్ట్ర సాధన కోసమే. ఈ నాటికీ వక్రీకరిస్తున్నారు కానీ, పొట్టి శ్రీరాములు బలిదానం ఆంధ్ర రాష్ట్రం కోసమే.

ఆంధ్ర కాంగ్రెస్ నాయకులు చాల ఎత్తుజిత్తులతో కేంద్ర కాంగ్రెస్ నాయకత్వాన్ని తమ ఆలోచనలకనుగుణంగా నడిపించారు. ఈనాటికీ నడిపిస్తున్నారు. ఒప్పందాలు రాసుకుని బలవంతంగానే ఉద్యమంలో భాగం చేసుకున్నారు. కేంద్ర కాంగ్రెస్‌తో సంధానం, సమరం జమిలిగా సాగించారు. ఒకచేత నిరాహార దీక్షలు, మరోచేత ప్రతిఘటనా నడిపి ఆంధ్ర రాష్ట్రం సాధించుకున్నారు. 1953లో కర్నూలు రాజధానిగా ఆంధ్ర రాష్ట్రం ఏర్పడింది. గుడారాల కింద పాలన సాగింది.

తెలంగాణ పరిస్థితి దీనికి పూర్తిగా భిన్నమైంది. తెలుగు భాషకు జరిగిన అన్యాయాన్ని ఎదుర్కోవడానికి ఆంధ్ర జనకేంద్ర సంఘం ఏర్పడింది. ఆంధ్ర మహాసభగా విస్తరించింది. తరువాత తెలంగాణ సాయుధ పోరాటంగా ఆ ఉద్యమం వికసించింది. భూమి, భుక్తి, విముక్తి లక్ష్యంగా సాగిన ఆ పోరాటంలో లక్షలాది ప్రజలు భాగమైనారు. తమ దోపిడీ దౌర్జన్యాలు చెల్లవని భూస్వాములు పల్లెలు వదిలి పట్టణాల బాట పట్టారు. హైదరాబాద్ రాజ్యాన్ని భారత యూనియన్‌లో విలీనం చేయడానికి పోలీసు చర్య పేరిట సైనిక చర్య జరిపిన కాంగ్రెస్ కేంద్ర ప్రభుత్వం మూడు రోజుల్లో నవాబు లొంగిన తరువాత అతడిని రాజ ప్రముఖ్‌గా ప్రకటించింది. సైన్యాన్ని ఉపసంహరించకుండా తెలంగాణ గ్రామాల మీదికి నడిపింది. ప్రజలు స్వాధీనం చేసుకున్న భూములను దొరలకు ఇప్పించడానికి, దొరలను గ్రామాలలో తిరిగి ప్రతిష్ఠించడానికి పనిచేయించింది. వేలాదిగా తెలంగాణ రైతాంగ పోరాట యోధులను బలితీసుకుంది. కాంగ్రెస్ టోపీలతో దొరలు పట్టణాలనించి పల్లెలు చేరారు. దీనికి ఆగ్రహించిన ప్రజలు అప్పటి ఎన్నికల్లో తెలంగాణ కాంగ్రెస్‌ను ఓడించారు. హైదరాబాద్ రాజ్యంలోని ఇతర భాషా ప్రాంత సభ్యుల బలంతో కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పడింది. బూర్గుల రామకృష్ణారావు ముఖ్యమంత్రి అయ్యారు. మహబూబ్‌నగర్ జిల్లా నుంచి ఎదిగిన నాయకుడు, విశాలాంధ్ర (నినాదానికి) లాబీకి లోబడినాడు. తెలంగాణను ఆంధ్రతో కలిపేయడంతో మహబూబ్‌నగర్ జిల్లా రాష్ట్రం మీద నాయకత్వ స్థానాన్ని కోల్పోయింది.

అయ్యదేవర కాళేశ్వరరావు వంటి ఆంధ్రప్రాంత నాయకులు, పుచ్చలపల్లి సుందరయ్య, రావి నారాయణరెడ్డి వంటి తెలంగాణ సాయుధ పోరాటంలో పనిచేసిన ఆంధ్ర, తెలంగాణ నాయకులు విశాలాంధ్ర కోసం పైరవీలు చేశారు. 1952 నుంచి స్వతంత్రంగా అన్ని హంగులతో, మిగులు నిధులతో, మిక్కిలి వనరులతో ఉన్న తెలంగాణను 1953లో ఏర్పడి, గుడారాల కింద నడుస్తున్న ఆంధ్రను కలిపి ఒక రాష్ట్రంగా ఏర్పరచాలనుకున్నారు.

ఆ నాటికే తెలంగాణ - ఆంధ్ర ప్రాంతాల సామాజిక రాజకీయ ఆర్థిక పరిస్థితులలో, విద్య తదితర విషయాలలో ఉండిన తీవ్రమైన తేడాల వల్ల తెలంగాణ నష్టపోతుందని గుర్తించి వాదించిన వారున్నారు. విశాలాంధ్ర నినాదంలో సామ్రాజ్యవాద భావన, రాజ్య విస్తరణ కాంక్ష ఇమిడి ఉన్నాయని ప్రకటించినవారున్నారు. పునాది విషయాలు పక్కనబెట్టి, భాషే సర్వస్వమని భావించి తెలుగులమంతా ఒక తల్లి పిల్లలమని, ఒకటి కావడం గొప్పేనని ఆదర్శాలు పాడినవారున్నారు. ఉద్వేగాలు రెచ్చగొట్టినవారున్నారు. ఈ చర్చంతా చర్చలో ఉండగానే ఢిల్లీ కాంగ్రెస్ సర్కార్ తెలంగాణను, ఆంధ్రను కలపకూడదని మాట్లాడుతూనే అందుకు భిన్నమైన చర్యలు చేపట్టింది. రాష్ట్రాల పునర్ వ్యవస్థీకరణకై స్వతంత్ర దేశంలో ఏర్పరచిన ఫజుల్ అలీ కమిషన్ సూచనలను, తెలంగాణ ప్రజల భయాందోళనలను తొక్కిపెట్టింది. పుచ్చలపల్లి సుందరయ్య, రావినారాయణ రెడ్డి, బెజవాడ గోపాల రెడ్డి, నీలంసంజీవరెడ్డి, అయ్యదేవర కాళేశ్వరరావు వంటి కమ్యూనిస్టు, కాంగ్రెస్ నాయకుల లాబీకి లొంగిపోయింది. ఆంధ్రతో తెలంగాణను కలప కూడదని వాదిస్తూ ఉండిన తెలంగాణ నాయకులను ఢిల్లీకి పిలిపించి లొంగదీసుకుంది. కె.వి.రంగారెడ్డి, మర్రి చెన్నారెడ్డి, బూర్గుల రామకృష్ణా రావు అలా లొంగిపోయిన వారే. కాంగ్రెస్ పెద్ద మనుషులు చేసుకున్న ఒప్పందం తెలంగాణ విషయంలో ఎందుకూ పనికిరాకుండా పోయింది.

ఒక ప్రాంతంలోని ప్రాబల్య శక్తులకు లొంగిపోవడం, బలహీన నాయకత్వాలను లొంగదీసుకోవడం మొదటి నుండే కాంగ్రెస్ విధానం. విశాలాంధ్ర నినాదంలో సామ్రాజ్యవాద లక్షణాలున్నాయని, ఇది తుంటరి వాడితో అమాయకపు పిల్లకు జరుపుతున్న పెండ్లి అని ప్రకటించిన నెహ్రూ, పొసగకపోతే విడిపొమ్మని చెబుతూ ఆంధ్రపాలకులకు లొంగిపోయి తెలంగాణను ఆంధ్రను కలిపేసే పనిచేపట్టాడు. రెండు

ప్రాంతాల అసెంబ్లీలలో తీర్మానాలు పెట్టి కలిపేశారు. తెలంగాణ సభలో తీర్మానం ప్రవేశపెట్టిన ఘనత తనదేనని అప్పటి మహబూబ్‌నగర్ జిల్లా ఎం.ఎల్.ఎ. పాగపుల్లారెడ్డి తన జీవిత కథనంలో రాసుకున్నాడు. ఈయనను అయ్యదేవర కాళేశ్వరరావే అలా నడిపించిండని చెప్పుకున్నాడు. బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ఒక మేరకైనా పోరాడిన అనుభవమున్న కాంగ్రెస్, కమ్యూనిస్టు నాయకులు పరస్పర వైరుధ్యాలు పక్కనబెట్టి, సామ్రాజ్యవాద స్వభావంతో, ఆచరణతో వచ్చిన ఆంధ్ర పెత్తనానికి తెలంగాణను బందీని చేసింర్రు. బ్రిటిష్‌వాడు వనరులు కొల్లగొట్టడానికే భారతదేశాన్ని దురాక్రమించినట్లుగా, ఆంధ్రవాడు వనరులు కొల్లగొట్టడానికే తెలంగాణను దురాక్రమించాడు.

ఆ కాలపు భారతదేశపు ప్రముఖ మేధావులందరు హైదరాబాద్ విలక్షణమైన ప్రాంతమని, స్వతంత్రంగా ఉండాలని అభిప్రాయపడ్డారు. డా. బి.ఆర్. అంబేద్కర్ హైదరాబాద్ స్వతంత్ర రాష్ట్రంగా ఉండాలనడమే కాకుండా, ఒకే భాష, ఒకే రాష్ట్రం సిద్ధాంతాన్నే తప్పుపట్టాడు. హైదరాబాద్‌ను దేశానికి రెండో రాజధానిగా దేశ పాలన నిర్వహించాలన్నాడు. తెలంగాణ ప్రజలు, స్థానిక నాయకులు తెలంగాణను ఆంధ్రతో కలిపితే తెలంగాణ వనరులను, అధికారాన్ని ఆంధ్ర పాలకులు కొల్లగొడతారని భయ సందేహాలు వ్యక్తపరిచారు. ఫజుల్ అలీ కమిషన్ ఈ వాస్తవాలను విశ్లేషించి ప్రజల అనుమానాలు నిజమవుతాయన్నాడు. (హైదరాబాద్) తెలంగాణను స్వతంత్ర రాష్ట్రంగానే కొనసాగించాలన్నాడు. ఉత్తరాది నాయకులు ఢిల్లీ పెద్దలు ఈ వాస్తవాలన్నీ వదిలేసి కేవలం ఆంధ్ర లాబీ కోరినట్టు నడిచి, ఏడ్చేవాడి కళ్లు తుడిచినట్టుగా ఒక పెద్ద మనుషుల ఒప్పందం పత్రం చేతిలో పెట్టి తెలంగాణను ఆంధ్రతో కలిపేసింర్రు. ప్రజల ప్రమేయం లేకుండానే ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది. తెలంగాణ ప్రజలు నవాబు పాలన అనే భూస్వామ్య పాలన నుండి ఆంధ్ర పాలన అనే సామ్రాజ్యవాద పాలన కిందికొచ్చారు. తెలంగాణ పెనం మీద నుండి పొయ్యిలోకి పడింది.

నవాబుల పాలనలోనైనా, తరతరాల తెలంగాణ రాజవంశాల పాలనలోనైనా తెలంగాణ సంపద తెలంగాణలోనే ఉండింది. బ్రిటిష్ వలస పాలకులతో నవాబుల మిత్రత్వం వల్ల తప్ప తెలంగాణ వనరులు తెలంగాణ వాడకానికే పరిమితమై ఉండినాయి. ఇతర ప్రాంతాల నుంచి హైదరాబాద్‌కు వచ్చినవారు అనుభవించడానికి వచ్చినవారే కానీ వనరులు తరలించడానికి కాదు. ఆంధ్ర ప్రాంతం వారు దీనికి మినహాయింపు. 1956కు ముందు పొరుగు దేశానికి, పొరుగు రాష్ట్రానికి వచ్చినట్టుగా రావలసి వచ్చేది. ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు నుంచి దోపిడీ చేయడానికి, వనరులు తరలించడానికి, అధికారం చలాయించడానికి వచ్చారు. తెలంగాణ తాళం చేతులు ఆంధ్ర పాలకవర్గం చేతులలోకి వెళ్లాయి. ఆ 1 నవంబర్ 1956 తెలంగాణకు 'దుర్దినం'. 'విద్రోహ దినం'. ప్రజల మధ్యకు విషయాన్ని తెచ్చి పోరాడకుండా ఉన్న అందరికందరూ – పదవుల కాంక్షతో ఆంధ్ర పాలకుల ముందు దళారీలుగా లొంగిపోయిన తెలంగాణ నాయకులందరూ తలలు దించుకోవాల్సిన దినం. తెలంగాణ నాయకులు ఈనాటికీ తెలివిని పొందడం లేదు. కాంగ్రెస్ మహమ్మారి ఆంధ్ర పాలకవర్గం చేతి కీలుబొమ్మగా మారి తెలంగాణను నిత్యం దోపిడీ చేస్తోంది. కొత్త కొత్త అవతారాలెత్తి సాగిస్తున్న ఈ పీడనకు అభివృద్ధి అనే నినాదం తగిలిస్తున్నారు. దీనికి అందరూ సై అంటూ తెలంగాణ మీద అమలు చేస్తున్న హింసను ఆమోదిస్తున్నారు. తెలంగాణ వారే హోం మంత్రులై హింసను అమలుచేస్తున్నారు.

ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు నుండే పెద్ద మనుషుల ఒప్పందపు ఉల్లంఘన కూడా మొదలైంది. కేంద్ర ప్రభుత్వ సమక్షంలో కుదిరిన ఈ ఒప్పందపు అతిక్రమణను అటు కేంద్ర ప్రభుత్వం కానీ, కాంగ్రెస్ నాయకులు కానీ, ఇటు విశాలాంధ్రలో ప్రజారాజ్యమని గొప్పలు ప్రకటించిన కమ్యూనిస్టు నాయకులు కానీ ఎంత మాత్రం పట్టించుకోలేదు. తెలంగాణ నుంచి నీళ్లు తరలించడానికి నిధులన్నీ మళ్లించి ఆంధ్ర ప్రయోజనాలు నెరవేర్చే ప్రాజెక్టులు కట్టుకున్నారు. సింగరేణి బొగ్గు తరలించి థర్మల్ విద్యుత్ ప్రాజెక్టులు, జల విద్యుత్ ప్రాజెక్టులు కట్టుకున్నారు. ఇంగ్లిష్ భాష నెపం పెట్టి ఉద్యోగాలు, అధికార పదవులన్నీ కొల్లగొట్టారు. తమ ప్రాంతాలలో హైకోర్టు బ్రాంచి అక్కరలేదని ఉదారంగా ప్రకటించి హైదరాబాద్ హైకోర్టును ఆక్రమించారు. హైదరాబాద్, తెలంగాణలోని ఇతర పట్టణాలకి, పల్లెలకి వనరులు, వ్యాపార, ఉపాధి అవకాశాలుండే అన్ని చోట్లలోకి ప్రవేశించారు. తెలంగాణ వ్యాప్తంగా నల్లరేగడి నేలలు, నీరున్న నేలలు, ఖనిజ సంపద ఉన్న తావులు అన్నీ ఆంధ్ర వలసవాదుల చేతికి చిక్కాయి. హైదరాబాద్ నుంచి మారుమూల పల్లెలదాకా ఎక్కడికక్కడ స్థానిక నాయకులకు కమిషన్‌లు పంచి తమ అధికారాన్ని కూడా వ్యవస్థీకృతం చేసుకున్నారు. సచివాలయం, అసెంబ్లీల తాళం చేతులు వారి చేతుల్లోనే ఉన్నాయి గనుక ఈ దురాక్రమణ వ్యవహారం వారికి సులభమైంది.

ఆంధ్ర పీడన పెరిగిన కొద్దీ తెలంగాణలో ప్రతిఘటన కూడా ప్రారంభమైంది. ప్రజల ఆగ్రహ జ్వాలలు 1969లో ఒక్కసారిగా భగ్గుమన్నాయి. తెలంగాణ వ్యాప్తంగా తెలంగాణ జెండాలెగరేశారు. నల్లజెండాలతో ఆంధ్ర పాలకవర్గాన్ని నిరసించారు. తెలంగాణ ప్రజలంతా 'ఆంధ్రా గో బ్యాక్, ఇడ్లీ, సాంబార్ గో బ్యాక్' వంటి నినాదాలు అందుకున్నారు. 1969 తెలంగాణలో ఒక గొప్ప పోరాట సంవత్సరం. విద్యార్థి, ఉపాధ్యాయ, ఉద్యోగ, కార్మిక వర్గం, పత్రికా రచయితలు తెలంగాణ కోసం తీవ్రంగా సంచలించిన కాలమది. ఆంధ్ర పాలక వర్గం కాసు బ్రహ్మానందరెడ్డి నాయకత్వంలో తెలంగాణ ఉద్యమం మీద దాడి చేసింది. 370 మంది తెలంగాణ బిడ్డల ప్రాణాలు బలి తీసుకుంది. తెలంగాణ అంతటా వేలాదిగా లాఠీఛార్జీ సంఘటనలు, బాష్పవాయు ప్రయోగాలు, వందలాది కాల్పుల సంఘటనలు జరిగాయి. తెలంగాణ అంతటా నినాదం ఒక్కటే, 'మా తెలంగాణ మాకు కావాలి'. నలభై సంవత్సరాలు దాటినా జ్ఞాపకాలు మారిపోలేదు. ఆనాటి ఆగ్రహమూ చల్లారలేదు. ఆంధ్ర పాలన మీద ద్వేషం విద్రోహానికి పాల్పడుతున్న కాంగ్రెస్ నాయకత్వం మీద, సమైక్య వాదం మీద ఈనాటికీ కసి రగులుతూనే ఉంది. 1969 ఉద్యమాన్ని కాంగ్రెస్ పార్టీ మింగేసింది. ఒకనాడు రాత్రికి రాత్రి హైదరాబాద్ పరుగెత్తుకొచ్చిన ఇందిరా గాంధీ తెలంగాణ కాంగ్రెస్ నాయకులకు పదవుల ఆశ జూపి లోబరుచుకుంది. తెలంగాణ వ్యాప్తంగా కాంగ్రెస్ నాయకులు లొంగిపోయిన తెలంగాణ ఉద్యమద్రోహుల విగ్రహాలు పెట్టి దండలేస్తున్నారు. ఆ మహత్తర ఉద్యమానికిచ్చిన హామీలను కూడా కేంద్ర, రాష్ట్ర కాంగ్రెస్ నాయకత్వాలు బురద గుంటలో తొక్కేశాయి. అప్పటి ఎన్నికలు తెలంగాణలో కాంగ్రెస్‌ను మట్టి కరిపించాయి. ప్రజలు తెలంగాణ ప్రజా సమితికి పట్టం కట్టారు. తెలంగాణ ప్రజా సమితినే కాంగ్రెస్ మింగేసింది. ఉద్యమ ద్రోహానికి పాల్పడిన కాంగ్రెస్ నాయకులు, వారి కుటుంబాలు ఆంధ్ర పాలకుల దళారులుగా తెలంగాణలో పెత్తనాలు చేస్తూనే ఉన్నారు. విద్రోహమే పునాదిగా కాంగ్రెస్ నిర్మాణమై ఉంది.

1982లో కాంగ్రెస్ ముఖ్యమంత్రే అయినా, తెలంగాణ వాడైన టి.అంజయ్యను రాజీవ్‌గాంధీ అవమాన పరిచాడు. సరిగ్గా ఆ సమయంలో తెలుగుదేశం పార్టీ ముందుకొచ్చింది. ఎన్.టి. రామారావు ఆత్మగౌరవ నినాదంతోటీ, సంక్షేమ పథకాలతోటీ వచ్చి గెలిచాడు. అయితే రామారావు కరుడుగట్టిన సమైక్యవాదిగా పనిచేశాడు. తెలంగాణను దోచి సీమాంధ్ర ప్రయోజనాలు తీర్చే పనిచేశాడు. ఒక్క అంశం చాలు. తెలుగు గంగ పేరున మద్రాసుకు నీరిచ్చే పథకం ప్రారంభించి రాయలసీమలో పెద్ద పెద్ద ప్రాజెక్టులు ప్రారంభించాడు. గాలేరు-నగరి, హంద్రీ-నీవా లాంటి పథకాలు, వెలుగోడు, బ్రహ్మంగారి మఠం ప్రాజెక్టులు. అగాథమైన తెలుగుగంగ కాలువ తవ్వకం ఆయన ప్రారంభించినవే. ఇప్పటి ముఖ్యమంత్రికి పోతిరెడ్డిపాడు పథకానికి దారి ప్రారంభించింది రామారావే. సుంకేశులను ప్రాజెక్టుగా పెద్ద ఎత్తున ఆధునీకరించడానికి పూనికతో పనిచేసింది రామారావే. ఇలా తెలంగాణను దోపిడీ చేసే కృషిని గొప్పగా సాగించిన తెలుగుదేశం పాలనలో అసెంబ్లీలో తెలంగాణ ఊసెత్తరాదనే దాకా పోయింది. దోపిడీని సహిస్తూ వచ్చిన తెలంగాణ జనం ఆత్మగౌరవ సమస్య వచ్చేసరికి అలజడి ప్రారంభించింది.

తెలుగు ప్రజల చేతిలో చావు దెబ్బ తిని అధికారం కోల్పోయిన కాంగ్రెస్, దేశమంతా తన చీకటి ముఖం తెలిసిపోయి వెలవెలబోతున్న కాంగ్రెస్‌కు తెలంగాణ ఉద్యమం కావలసి వచ్చింది. చంద్రబాబు పాలన అంతా సామ్రాజ్యవాద పాలనే అయిపోవడం, ప్రపంచబ్యాంక్ ఆదేశాల మేరకు అన్నీ అమ్మకపు సరుకులే కావడం, సంక్షేమ చర్యలు లేకపోవడం, ప్రజల మీద అణచివేత కొనసాగడం, ఎన్నికల వేళ తప్ప ఎవరూ రాజకీయాలు మాట్లాడరాదని తనను సి.ఇ.ఓ.గా ప్రకటించుకుని అతి తెలివితో ప్రజల్ని మభ్యపెడుతూ చరిత్ర అవసరమే లేదనే స్థాయికి వెళ్లడంతో ఎక్కడికక్కడా చరిత్ర మూలాల్లోకి, మౌలిక సమస్యల పరిష్కార డిమాండ్లలోకి ప్రజలు చాలా సహజంగానే ప్రయాణించారు. భూమి, భుక్తి, సంక్షేమ చర్యల అమలు, మద్య నిషేధం అమలు వంటి అనేక పోరాటాలతో పాటు తెలంగాణ పోరాటం కూడా ముందుకొచ్చింది. 1956కు ముందు నుండి తెలంగాణను ఆంధ్రతో కలపకూడదని వ్యతిరేకించిన విద్యార్థి తరం, స్వతంత్ర తెలంగాణ చరిత్ర తెలిసిన పెద్దలు, విముక్తి ఉద్యమాల నిర్మాణానికి పూనుకున్న విద్యార్థులు, 1969లో ప్రాణాలు కోల్పోయిన తెలంగాణ అమరుల వారసులు, సమస్యల సుడిగుండంలో విలవిల్లాడుతున్న ప్రజలందరిలో రగులుకుంటున్న తెలంగాణ కాంక్ష 1990ల తరువాత తెలంగాణోద్యమ నిర్మాణ రూపం తీసుకుంది. తెలంగాణ నిర్మాణాల మీద, తెలంగాణ ఆకాంక్షల మీద తెలుగుదేశం తన క్రూరమైన హింసను అమలు చేసింది. ప్రజాస్వామ్యాన్ని, ప్రజాస్వామిక తెలంగాణను ఆకాంక్షించినందుకే బెల్లి లలిత, అయిలన్న, పురుషోత్తం వంటి తెలంగాణ నేతల ప్రాణాలు బలి తీసుకున్నారు.

తెలంగాణలో 1969 తరువాత వచ్చిన కొత్త తరంలోకి తెలంగాణ ఆకాంక్షలు బలంగా ప్రవేశిస్తూ ప్రజాస్వామిక తెలంగాణ నినాదం బలపడుతున్న సమయంలో తెలుగుదేశం తెలంగాణ జనసభ మీద తీవ్రమైన నిర్బంధాన్ని ప్రయోగించింది. ఈ సందర్భాన్ని అప్పటి ప్రతిపక్ష నాయకుడుగా వై.ఎస్. రాజశేఖరరెడ్డి చాలా 'తెలివి'గా ఉపయోగించుకున్నారు. 2004 ఎన్నికల కోసం పునాది వేసుకున్నారు. 41 మంది కాంగ్రెస్ ఎం.ఎల్.ఎ.లతో సంతకాలు చేయించి జి.చిన్నారెడ్డి నాయకత్వంలో ఢిల్లీ కాంగ్రెస్‌కు మహజర్లు పంపించారు. అప్పటికే ఏర్పడి రాజకీయ ప్రక్రియతో తెలంగాణ సాధిస్తామని అనేక సభలు నిర్వహిస్తున్న తెలంగాణ రాష్ట్ర సమితిని మించి తెలంగాణ అంశం కాంగ్రెస్‌దేనని నమ్మించే పనిచేశారు. తెరాసతో పొత్తు కుదుర్చుకున్నారు. తమది విశాలాంధ్ర నినాదమే నన్న సి.పి.ఐ.(ఎం) తోటి, ఏమీ చెప్పని సి.పి.ఐ. తో పొత్తు కలిసి తెలంగాణ రాష్ట్రం ఏర్పరుస్తామని తెలంగాణ ప్రజలకు హామీలిచ్చారు. కేంద్ర నాయకత్వంతో బహిరంగ సభలలో చెప్పించారు. లగడపాటి రాజగోపాల్ వంటి వారి నోర్లు అదుపులో ఉంచారు. నక్సలైట్లతో చర్చలు, ఎం.ఆర్.పి.ఎస్. కోరిన వర్గీకరణ, ఇలా అందరికీ అన్ని హామీలతో ముందుకొచ్చారు. దీనికి ప్రతిగా ఆర్థిక సంస్కరణలు, సమైక్యవాదం, నక్సలైట్ల మీద అణచివేత వంటి విధానాలతో ఎన్నికలలోకి దిగిన తెలుగుదేశాన్ని ప్రజలు చిత్తుగా ఓడించారు. రాష్ట్రంలో కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పడింది. కేంద్రంలో కాంగ్రెస్ నాయకత్వంలోనే యు.పి.ఎ. ప్రభుత్వం ఏర్పడింది.

2004లో అధికారం పొందిన తరువాత తెలంగాణ విషయంలో, ప్రజల ప్రజాస్వామిక డిమాండ్ల విషయంలో కాంగ్రెస్ తన మోసపూరిత విధానాలను నిర్లజ్జగా అమలు చేసింది. ఇదంతా వర్తమాన చరిత్ర. యు.పి.ఎ. కనీస కార్యక్రమంలో తెలంగాణ అంశం చేర్చింది. పార్లమెంట్ ఉభయ సభలలో రాష్ట్రపతి నోట పలికించింది. మరోవైపు ప్రణబ్ ముఖర్జీ కమిటీ వేసి అభిప్రాయాలడిగింది. అన్ని పార్టీలు అభిప్రాయాలు తెలిపినా కాంగ్రెస్ తన అభిప్రాయమేమిటో చెప్పలేదు. తన అభిప్రాయం చెప్పకపోవడం, వంచించాలనుకున్నపుడు కమిటీలు వేసి కాలక్షేపం చేయడం కాంగ్రెస్‌కు వెన్నతో పెట్టిన విద్య. తెలంగాణ విషయంలో కాంగ్రెస్ విధానాన్ని ఈ రాష్ట్ర ముఖ్యమంత్రి నడుపుతున్నారు. తన నోట తెలంగాణ విషయం సోనియా చేతిలో పెట్టినాం అని చెబుతూ ఆమె నోరు మూయించారు. ప్రభుత్వంలోకి చేర్చుకుని తెరాసను చీల్చి కాంగ్రెస్‌లోకి దిగజార్చారు. తెలంగాణ కోసం ఉద్యమించడానికని చెప్పిన తెలంగాణ రాష్ట్ర సమితి ఉద్యమాలలోకి కాకుండా అధికారంలోకి చొరబడడంతో తెరాసను మింగేయడం కాంగ్రెస్‌కు సులభమైంది. తన వైఖరిని ప్రణబ్‌ముఖర్జీకి చెప్పకుండానే ఐదేండ్లు గడిపి, రోశయ్యతో మరో కమిటీ వేసి తెలంగాణ వచ్చేది లేదని పలికించింది. ఏర్పాటులోనే రోశయ్య కమిటీ అర్థం లేనిదిగా తేలిపోయింది. ఈ ఐదేండ్ల పాలన మునుపెన్నడూ లేనంతగా తెలంగాణను కొల్లగొట్టింది. తెలంగాణను తెగదోచుకోవడానికే ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పరచడం లేదని తేలిపోయింది.

ఏ నినాదాలతో కాంగ్రెస్ అధికారంలోకి వచ్చిందో ఆ నినాదాలు పక్కనబెట్టి, తెలుగుదేశం ఎన్నికల ఎజెండాతో కాంగ్రెస్ ముందుకు సాగింది. సమైక్యవాదం, ఆర్థిక సంస్కరణలు, నక్సలైట్ల మీద అణచివేత విధానాలను మరింత దూకుడుగా అమలు చేసింది. అతివాద, తీవ్రవాద ముద్రవేసి వ్యక్తులను, సంస్థలను నిర్మూలించే చర్యలు చేపట్టింది. కె. కనకాచారి, మునెప్ప వంటి ఉపాధ్యాయుల బలి ఒక ఉదాహరణ మాత్రమే. జలయజ్ఞం పేరుతో 66 ప్రాజెక్టులు చేపట్టి 22 పూర్తి చేసినట్టు ప్రకటిస్తున్న ప్రభుత్వం తెలంగాణలో రెండు పూర్తిచేసినట్టు చెబుతోంది. కానీ నీళ్లు రావడం లేదన్నదే నిజం. ప్రత్యేక ఆర్థిక మండలాల ఏర్పాటుకు పూనుకొని 75 సెజ్‌లకు అనుమతి పొంది తెలంగాణలోనే 45కు మించి సెజ్‌లు ఏర్పరిచింది. సామ్రాజ్యవాద ఏజన్సీలకు, సంపన్న వర్గాలకు, కంపెనీల అవతారమెత్తి దోచుకు తింటున్న కాంట్రాక్టర్లకు వేల ఎకరాలలో పేదల భూములు గుంజి ఇచ్చింది. ఎ.పి.ఐ.ఐ.సి.ని ఒక భూ మాఫియాగా

అభివృద్ధి చేసింది. జలయజ్ఞం ప్రాజెక్టుల నిధులు అంతకు మూడింతలు పెంచి కంట్రాక్టర్లను బలిపిస్తు కమిషన్‌లు గుంజింది. తెలంగాణ ప్రాజెక్టులకే ఎక్కువ నిధులని మభ్యపెడుతూ అధిక ప్రాధాన్యతతో పోలవరం, పులిచింతల, పోతిరెడ్డిపాడు ప్రాజెక్టులు పూర్తిచేస్తోంది. రాయలసీమకు, ఆంధ్రకు నీళ్లు - తెలంగాణకు కన్నీళ్లే జలయజ్ఞం పాలసీ. తెలంగాణను దోచుకుతింటున్నదన్న అక్కసుతో చెప్పడం కాదు, నడుస్తున్న వాస్తవమే ఇది. ఈ ఐదేండ్లలో కాంగ్రెస్ ప్రభుత్వం అమలుపరిచిన సంక్షేమ పథకాలు ప్రజల ఆకలి మంటల మీద, ఆగ్రహం మీద నీళ్లు చల్లడమే తప్ప వేరుకాదు.

తెలంగాణ పేరు మీద గెలిచి అధికారం పొంది తెలంగాణకు వ్యతిరేకంగా ఇంత దబాయింపుతో పనిచేసిన చరిత్ర మరే ముఖ్యమంత్రికి లేదు. ఆంధ్ర ప్రాంత కాంగ్రెస్ నాయకులను తెలంగాణ మీదకి రెచ్చగొడుతూ తెలంగాణ కాంగ్రెస్ నాయకులను నోటితో బుజ్జగించి, నొసటితో బెదిరించి నోర్లు మూయిస్తూ, పదవులు, కమిషన్‌లు పడేసి తన భజన చేయించుకుంటూ తెలంగాణ కాంగ్రెస్ నాయకులను తెలంగాణ మీద ద్రోహానికి ఉపయోగించారు. తెలంగాణ ప్రజల అభిప్రాయాలతో సంబంధం లేకుండా హైదరాబాద్‌ను తన ఇష్టారాజ్యంగా మార్చే ప్రయత్నం చేశారు. గ్రేటర్ హైదరాబాద్ అన్నారు. ఔటర్ రింగ్ రోడ్డు అన్నారు. హైదరాబాద్ చుట్టూ కాపాడుతూ వచ్చిన భూములను చవకగా తన అనుయాయులకు కట్టబెట్టారు. కాంగ్రెస్ రక్షా కవచం కింద రౌడీలు, మాఫియా లీడర్లు, సీమాంధ్ర సంపన్నులు హైదరాబాద్ భూములకు ఓనర్లయింర్రు. ఇన్ని దుర్మార్గాలు చేస్తూ సామాన్య ప్రజలను ఆకర్షించడానికి సంక్షేమ పథకాలు చేపట్టి అభివృద్ధి నినాదంతో ఊదరగొట్టిండు. ఎన్‌కౌంటర్లు, ఉద్యమాల ఊసులేని, గాలి కూడా కదలని వాతావరణాన్ని మామూలు విషయంగా మార్చిండు. రాజకీయమంటే ఇలా నడపాలని కాంగ్రెస్ నాయకులందరికీ ఆదర్శప్రాయుడైండు.

భూములు పంచుతామన్న మాట మురిగిపోయింది కానీ, తెలంగాణలో భూ నిర్వాసితుల సమస్య తీవ్రంగా ముందుకొచ్చింది. సెజ్‌లకు, జలయజ్ఞానికి ఒక మహబూబ్‌నగర్ జిల్లాలోనే అరవై వేల ఎకరాల భూమిని ప్రభుత్వం పేదల నుంచి గుంజుకుంది. పోలేపల్లి సెజ్ యాభై మంది రైతుల ప్రాణాలు మింగింది. ఆ కుటుంబాలు నిరాధారమైనాయి. కృష్ణానది నీటిలో పాలమూరు వాటా తేల్చింది లేదు. చేపట్టిన ప్రాజెక్టుల పేరిట తవ్విన కాలువలలో అవినీతి నిధులు పారాయి. కాంగ్రెస్ జేబులు నిండాయి. తెలంగాణలో ఏ జిల్లాను పరిశీలించినా ఇదే దుస్థితి. గోదావరి నీళ్లు గోదావరి, కృష్ణా డెల్టాలకు మలపాలె. కృష్ణ నీళ్లు రాయలసీమకు మలపాలె. ఇది ఆంధ్ర పాలకవర్గాల దుష్టనీతి. ఈ నీతి వల్ల తెలంగాణ వ్యవసాయం దెబ్బతింది. రైతాంగం అప్పుల పాలైంది. ఆత్మహత్యల పాలైంది. వృత్తులు దెబ్బతిన్నాయి. కేవలం కూటికోసమే దేశమంతటికీ, విదేశాలకూ వలసలుపోవడం తెలంగాణకు నిత్య జీవనమైంది. నీళ్లు, నిధులు, వనరులకు తోడు తెలంగాణ తీవ్రమైన శ్రమదోపిడీకి గురవుతోంది. విద్య, వైద్యం, రవాణా తదితర ఏ రంగాలను పరిశీలించినా తెలంగాణకు ఒకట్లలో నిధులు విదిల్చి రాయలసీమకు, కడపకు, కార్పొరేట్ సంస్థలకు వందల కోట్లలో నిధులు సమర్పించింది.

తన అంగ బలంతో, అర్థ బలంతో కేంద్రాన్ని, రాష్ట్రాన్ని, తెలంగాణ కాంగ్రెస్ నాయకులను ముఖ్యమంత్రి తన అదుపులో ఉంచుకున్నడు. తాను తప్ప అన్యులు మాట్లాడలేని పరిస్థితి కల్పించిండు. ఈ దుష్ట వలయంలో కూరుకుపోయినందువల్ల, తేరుకుని బయటపడనందువల్ల తెరాస మీద కూడా తెలంగాణ ప్రజలు ఆగ్రహం ప్రకటించింర్రు. ఉప ఎన్నికల్లో తెలంగాణకు ఓట్లు వచ్చినయి గానీ సీట్లు రాలేదు. ఈ ఐదేండ్లలో తెలంగాణ ద్రోహుల జాబితా పెరిగిపోయింది. ఈ ద్రోహులందరికీ కాంగ్రెస్‌లోనే ప్రాపు దొరికింది.

అసమ సమాజంలో పాలకవర్గ రాజకీయాల చేతిలో సామాజిక న్యాయం, ప్రజాస్వామ్యం సఫలమయ్యేవి కావు. ప్రజారాజ్యం పార్టీ సామాజిక తెలంగాణ అంటోంది. సామాజిక తెలంగాణ, ప్రజాస్వామిక తెలంగాణ ఒకరు ఇస్తే వచ్చేవి కావు. అవి తెలంగాణ ప్రజలు తెలంగాణలో పోరాడి సాధించుకునేవి. ఇప్పటికి ఆంధ్ర పాలకవర్గం కొత్త అవతారాలెత్తకుండా 1956కు ముందున్న స్వతంత్ర తెలంగాణను, తాము చేపట్టిన తెలంగాణను వదిలిపెడితే చాలు. బ్రిటిష్ వలసపాలకులు ఇండియా మీద ప్రయోగించిన భాషనే ఆంధ్ర పాలకులు తెలంగాణ మీద ప్రయోగిస్తున్నారు. అదనంగా ఒకే భాష నినాదాన్ని జోడిస్తున్నారు. సి.పి.ఎం. మార్క్సిజానికి వక్రభాష్యం చెబుతోంది. తాము తెలంగాణ అడగరట, విశాలాంధ్ర తమ విధానమట, తెలంగాణ ఇస్తేనేమిటి, ఇవ్వకపోతేనేమిటి అని మెలికల భాష మాట్లాడుతోంది. తెలంగాణ అవసరం, న్యాయం అంటూనే తెలంగాణ కోసం పోరాడేది లేదని సి.పి.ఐ. చెబుతోంది. ప్రతి చిన్న అవకాశాన్ని ఆంధ్రపాలక వర్గం తెలంగాణకు వ్యతిరేకంగా ఉపయోగిస్తోంది.

ఈ అన్నిటిని మించి తెలంగాణ ప్రజలు తెలంగాణ ఆకాంక్షతో ఉన్నందువల్లనే రాజకీయ పార్టీలు తెలంగాణతో జట్టుకడుతున్నాయి. 1969 నుండి అనేక ఎన్నికలలో తెలంగాణ ప్రజలు తెలంగాణకే కట్టుబడి ఫలితాలిచ్చింర్రు. తెలంగాణ ఎన్నికల ఎజెండా అయినపుడల్లా ప్రజలు తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుకే తీర్పు నిచ్చింర్రు. తెలంగాణ పోరాటం ఆత్మగౌరవ పోరాటం, అధికారం కోసం పోరాటం. అసహ్యించు కుంటున్నా, ఊసినా, దుమ్మెత్తి పోసినా కేవలం దోచుకోవడానికే ఆంధ్ర వలస పాలకులు తెలంగాణను వదిలిపెట్టడం లేదు. ఇది మన అరవై ఏండ్ల అనుభవం. ఒకే అనుభవం పునరావృతమవుతోంది. దెబ్బకొట్టిన కొద్దీ ఫినిక్స్ పక్షిలాగా తెలంగాణ లేచి నిలబడుతోంది. తెరాస ప్రయోగాలకు తోడ్పడుతూనే తెరాసను నిలదీస్తోంది. చెన్నారెడ్డి నుంచి చిన్నారెడ్డి దాకా, కాసు బ్రహ్మానందరెడ్డి నుంచి వై.ఎస్. రాజశేఖరరెడ్డి దాకా అందరికందరూ జబర్దస్తీగా తెలంగాణ మీద దోపిడీని అమలు చేసినవారే. తెలంగాణకు సంక్షేమ పథకాలు, ఆంధ్రకు మౌలిక వసతులు ఇదీ వారి విధానం. వై.ఎస్. రాజశేఖరరెడ్డి మరో అడుగు ముందుకేసి ముస్లింలను ప్రత్యేకంగా ఎం.ఐ.ఎం. పార్టీని తెలంగాణకు వ్యతిరేకంగా రెచ్చగొట్టాడు. ఆంధ్ర, రాయలసీమ సంపన్నులను, దోపిడీదారులను తెలంగాణ మీద దాడికి పురమాయిస్తున్నాడు.

దేశంలోని రాజకీయ పార్టీలన్నీ ఎన్నికల కాలంలో ప్రజల ముందుకు వస్తు ఎన్నో వాగ్దానాలు చేస్తున్నవి. ఎన్నికల తరువాత వాగ్దాన భంగానికి పాల్పడుతున్నవి. ఎన్నికలలోకి మళ్లిన పార్టీలు, ఎన్నికలలో గెలిచిన పార్టీలు సంపన్నుల సేవలోనే తలమునకలవుతున్నవి. ఇది అరవై ఏండ్ల అనుభవం. తెలంగాణ కాంక్షించే పార్టీలకు, ప్రజలకు, ప్రజాస్వామిక వాదులకు మునుపటికన్నా కూడా బాధ్యత పెరిగింది. అవమానాన్ని, మోసాన్ని తిప్పికొట్టవలసిన సమయం వచ్చింది.

తెలంగాణకు అరవై ఏండ్లుగా కాంగ్రెస్ చేస్తున్న వంచన ఈ ఐదేండ్లలో పరాకాష్టకు చేరింది. ఇప్పుడన్నీ పార్టీలు తెలంగాణ

*మంచి పుస్తకాలు తనకు కలిగించిన ప్రేరణ, తనను నిలబెట్టిన వైనాన్ని వివరిస్తూ, పుస్తకాలు చదవాల్సిన అవసరాన్ని పంచుకుంటున్నారు* **విద్యాభూషణ్**

# మనుగడను నిర్దేశించే మంచి పుస్తకాలు

పుస్తకాలు నాకు ప్రియమైన నేస్తాలు. మన మేధో వికాసానికి దోహదపడేవి మంచి పుస్తకాలే. అంటే బతుకు పుస్తకాలు అన్న మాట. ఎందుకంటే, సాధారణంగా సమస్త సామాజిక అంశాలు ఒకరికి అనుభవంలోకి రావు కదా. ఇలా ఆచరణలోకి, అనుభవంలోకి రాని అంశాల పట్ల అవగాహనను కల్పించేవే మంచి పుస్తకాలు. సామాజిక అంశాల పట్ల అవగాహనను పెంచే పుస్తకాలు మనలో ఆత్మవిమర్శను తట్టిలేపి, మనల్ని మనం సరిచేసుకునేలా దోహదపడతాయి. చిత్తశుద్ధి ఉంటే, ఒక్కో సందర్భంలో అయితే, ఈ మంచి పుస్తకాలే మన జీవిత లక్ష్యాలను సైతం దిశా నిర్దేశనం చేస్తాయన్నా కూడా అతిశయోక్తి ఎంతమాత్రం కాదు. ఇది నా అనుభవం నుంచి తెలుసుకున్న వాస్తవం.

ఇదే తరహాలో దిశా, లక్ష్యం లేకుండా, గాలివాటంగా తయారయ్యేందుకూ, మరో తరహా పుస్తకాలు, సాహిత్యం దోహద పడుతూనే ఉంటాయి. అందుకే సామాజిక పరిణామ క్రమంలో సంస్కృతీ – సాహిత్యాలకూ అంత ప్రాముఖ్యత ఉంటుంది. నక్సల్బరీ ఉద్యమాల వెలుగు శ్రీకాకుళ కొండల్లో ప్రభావితం అవుతున్న వేళ అది. ఇప్పుడ నిపిస్తుంది ఆనాటి డిటెక్టివ్ సాహిత్య తీవ్రతను పనిగట్టుకునే ప్రచారం చేస్తున్న ప్రయత్నం కుట్రపూరిత ధోరణేనేమోనని. కొమ్మినేని విశ్వమోహన్ లాంటి ప్రబుద్ధుల రచనలను మేము వేలం వెర్రిగా చదివేస్తూ, గంటల తరబడి శుష్క చర్చలతో కాలం వెళ్లబుస్తున్న రోజులవి. సుమారుగా 70వ దశకం పూర్వార్ధం. సరిగ్గా అప్పుడు అందింది భూషణం మాస్టారి 'కొండగాలి' నవల. కళ్లు తెరిపించింది. గిరిజన జీవితాలను ప్రత్యక్షంగా చూసినప్పటికీ, వారి జీవితాల పట్ల నాటి వరకూ ఉన్న వక్ర భాష్యాన్ని సరిదిద్దింది. జీవితపు విలువలను విడమర్చి దోపిడీ మూలాలను సాక్షాత్కరింపజేసింది. జీవితం అంటే ఏమిటో ఆవిష్కరించింది.

భూషణం మాస్టారి 'కొండగాలి' నవల నాలో ఓ కుదుపును కుదిపేసింది. శ్రీకాకుళ ఉద్యమ ప్రాంతంలోనే ఉంటున్నా ఉద్యమ లక్ష్యాలు అవగతం కాలే. కుటుంబ పెద్దల సూత్రీకరణలతో, అతి సమీపంగా పరిసర గిరిజనులను చూస్తున్నా, వారి దుర్భర జీవిత కారణాలు తెలియరాలే. 'కొండగాలి' దోపిడీ మూలాల్ని ఆవిష్కరింప చేసింది. వారి ఆచార వ్యవహారాలను, కుల–మతాల పట్ల ఆ నిరక్షరాస్యుల్లో ఉన్న ఔన్నత్యాన్ని, మానవతను కళ్లకు కట్టినట్టు చిత్రీకరించింది. దాంతో ఆలోచనల్లో ఓ పెద్ద కల్లోలం. కుటుంబ స్నేహితుడైన మాస్టారితో చర్చించిన మీదటే ఉపశమనం. ఆ చర్చ నా పుస్తక పఠన గతినే మార్చేసింది.

సుమారు ఇందుకు కొనసాగింపుగా రంగనాయకమ్మ గారి 'రామాయణ విషవృక్షం' వచ్చింది. ఈ పుస్తక పీఠికే చాలు మొత్తం సామాజిక పరిణామక్రమాన్ని అవగతం చేసుకునేందుకు. ఫ్యూడల్ సాహిత్య లక్ష్యాలను పరిపూర్ణంగా బహిర్గతం చేస్తుంది. ఓ స్టడీ సర్కిల్‌గా

---

అంటున్నవి. అందరూ ఆమోదించిన ఎన్నో ప్రజాస్వామిక డిమాండ్లు మూలనపడి మూల్గుతున్నవి. అందుకే మనమంతా అలర్ట్‌గా ఉండాలి. తెలంగాణ ప్రజలకు, ఆంధ్ర ప్రజలు పగవాళ్లు కారు. అట్లాగే ఆంధ్ర ప్రజలకు తెలంగాణ ప్రజలు పగవాళ్లు కాకూడదు. ఆంధ్ర ప్రాంత ప్రజాస్వామ్యవాదులంతా న్యాయమైన తెలంగాణ రాష్ట్ర కాంక్షకు అండగా నిలవాలి. తెలంగాణను మోసం చేస్తున్న ఆంధ్ర పాలకవర్గానికి తెలంగాణలోనే కాదు, ఆంధ్రలోనూ బుద్ధిచెప్పాలి. తెలంగాణ మీద ఆంధ్ర పెత్తనానికి, ఆంధ్ర పాలక వర్గాల దోపిడీకి వ్యతిరేకంగా స్వతంత్ర రాష్ట్ర సాధనకోసం తెలంగాణ ప్రజానీకం చేస్తున్న పోరాటాన్ని సమైక్యవాదులు వక్రీకరిస్తున్నారు. దీన్ని ప్రజల మధ్య వైరుధ్యంగా మార్చాలని కుట్రలు పన్నుతున్నారు. ఈ కుట్రలను ఓడించాలి.

ఒక్కమాటలో చెప్పాలంటే ఉమ్మడి మద్రాసు రాష్ట్రం నుండి విడిపోవడానికి ఆంధ్ర ఎంతగా పెనుగులాడిందో, ఇవాళ తెలంగాణ ఆంధ్రప్రదేశ్ అనే బంధిఖాన నుండి విడిపోవడానికి అంతగా పెనుగు లాడుతోంది. ఈ పెనుగులాటలో ఆంధ్ర పాలకవర్గం మద్రాసు పాలకవర్గం కన్నా దుర్మార్గమైందని తేలిపోయింది. తెలంగాణ ఆకాంక్షల మీద జరిగినంత హింస దేశంలో మరే రాష్ట్ర ఆకాంక్ష మీద కూడా అమలు జరిగి ఉండదని తెలిసిపోయింది.

సమైక్యవాదం, విశాలాంధ్ర వాదం ఏ రూపంలో వచ్చినా ఎదుర్కొందాం. తెలంగాణ వేర్పాటువాదం కాదని, ఎన్నో రాష్ట్రాలు, తెలంగాణ కన్నా చిన్న రాష్ట్రాలు ఏర్పాటు చేసినా కేంద్రం తెలంగాణ విషయం లో ఆంధ్రపాలక వర్గానికి లోబడి వ్యవహరిస్తే కుదరదని, తగిన మూల్యం చెల్లించవలసి వస్తుందని హెచ్చరిద్దాం. ఒకే భాష, ఒకే రాష్ట్రం అని పిడివాదం చేసే వారికి గడ్డి తినిపించి హిందీకి అనేక రాష్ట్రాలున్న విషయం చూపిద్దాం. మన కాళోజీ చెప్పినట్టు ముందుగా ప్రాంతేతరుణ్ని ప్రాంతం బైటికితన్ని తరుముదాం. తెలంగాణ సాధించు కుందాం. స్వతంత్ర తెలంగాణలో ప్రజాస్వామ్యాన్ని, సామాజిక న్యాయాన్ని, నూతన సంస్కృతిని సాధించుకోవడానికి సుదీర్ఘ పోరాటాలకు సిద్ధమవుదాం.

*(రచనా కాలం : ఏప్రిల్ 2009)* వీ

సన్నిహిత మిత్రులతో కలిసి నిరంతరం ఓ చర్చగా ఈ తరహా పుస్తకాలను చదువుకోవడం అవగాహనా పునాదిని మరింత పటిష్టం చేస్తుందన్నది మరో అనుభవం. దీంతో అటు-ఇటుగా హేతువాద భావనలు తొలగిపోయి, పటిష్టమైన శాస్త్రీయ అవగాహన కలిగేందుకు దోహద పడిందీ పుస్తకం.

దీనికి వెనువెంటనే వచ్చిన 'జానకి విముక్తి' నవల సామాజిక జీవనంలోని అనేకానేక పార్శ్వాలను చర్చిస్తుంది. నాస్తికవాదంతో మొదలుకొని, కుటుంబ సంబంధాలు, ప్రేమాపెళ్లి లాంటి అనేక విషయాలను విశదీకరించినందున ఓ కొత్త ఆలోచనకు బీజం వేస్తుంది. అవగాహన-ఆచరణలకు ఉన్న ప్రాముఖ్యతను సూచనప్రాయంగా తెలియజేస్తుంది. విషయాన్ని తెలుసుకుంటే సరికాదు – ఆచరించినపుడే దాని ప్రభావం, ఫలితం ఉంటుందన్నది వివరిస్తుంది. ఈ సూత్రీకరణను ఓ సామాన్య స్త్రీ కమ్యూనిస్టుగా ఎదిగిన వైనాన్ని తనదైన శైలిలో చాలా ఆసక్తికరంగా రంగనాయకమ్మ గారు అందించారు. బోధనలు చేస్తున్నవారి ఆచరణను గమనించేలా వెన్నుతడుతుందీ పుస్తకం. ఒక్క మాటలో చెప్పేది – చేసి చూపించాలంటుంది.

ఇటీవల కాలంలో చదివిన పుస్తకాల్లో ఆనాటి స్పందనా తీవ్రతను కలిగించిన పుస్తకం ఎన్. వేణుగోపాల్ రాసిన 'పరిచయాలు'. సాధారణంగా ఏదైనా పుస్తకం ఓ నిర్దిష్ట అంశానికే పరిమితం కావడం పరిపాటి. కానీ 'పరిచయాలు' పుస్తకం మాత్రం పూర్తిగా భిన్నం. అనేకానేక మంది లబ్ధప్రతిష్టులైన వ్యక్తులు, భిన్న రంగాల్లో చేసిన కృషిని, విశిష్టతను విశదీకరించే కదంబం. ఆయా విశిష్ట వ్యక్తుల వ్యక్తిత్వాలను తెలుసుకునేలా చేస్తుంది. అందుకే ఇది 'విశిష్ట వ్యక్తిత్వ పరిమళాల కదంబం' అని అనిపిస్తుంది. జీవిత స్వానుభవాలను సమీక్షించుకునేలా చేస్తుంది. ఇంతమంది వ్యక్తిత్వాల పరిశీలనా, అందునా సుమారు నలభై మంది విశిష్ట వ్యక్తుల వ్యక్తిత్వాల విశ్లేషణ ఈ పుస్తకం. ఇందులో కొద్దిమంది వ్యక్తులతో ఉన్న అరాకొరా పరిచయంతో ఏర్పర్చుకున్న అంచనాలను రచయిత విశ్లేషణతో సరిపోల్చుకోవడం లేదా బేరీజు వేసుకోవడం ఓ కొత్త అనుభవాన్నిస్తుంది. ఆయా వ్యక్తుల ఆచరణ పట్ల అభిప్రాయాన్ని బలపరుస్తుంది. ఇక పరిచయం లేని వ్యక్తుల విషయంలో అయితే, వారి సేవల విశిష్టతను తెలుసుకునేందుకు దోహద పడుతుంది. వ్యక్తిగతంగా సన్నిహితంగా పరిచయం ఉన్న వ్యక్తుల విశ్లేషణను చదువుతున్నప్పుడైతే, ఆయా వ్యక్తులను మన కళ్లెదుటే నిల్పిన అనుభూతిని కల్పిస్తుంది. దీంతో చదువుతున్న పుస్తకాన్ని తక్షణం మూసేసి, వారితో మన అనుభవాలను మననం చేసుకునేలా చేస్తుంది. అందుకే రచయిత తన ముందుమాటలో చెప్పిన 'మరణించిన మనుషులను స్మృతుల్లో బతికించుకోవడానికి చేసిన పరిచయాలివి.'

'పరిచయాలు' పుస్తకంలో వేణుగోపాల్ ప్రస్తావించిన వ్యక్తుల్లో పాలకుర్తి ఐలమ్మ ఒకరు. ఇంతవరకూ తెలంగాణ పోరాట ప్రస్తావనలో సందర్భోచితంగా ఐలమ్మ పేరు వినడమే జరిగేది. పరిచయాల్లోని ఆమె పరిచయం ద్వారా తెలంగాణ విమోచనోద్యమంలో ఐలమ్మ పోరాట పటిమ ఎంత స్ఫూర్తిదాయకంగా నిల్చిందో అన్న విషయం అవగతమైంది.

మనిషి నిస్సహాయతే నిష్క్రమణగా పరిణమిస్తుందనే వాస్తవాన్ని ఉటంకిస్తూ ఈశ్వరి గురించి రాసిన విశ్లేషణ మరో మానవీయ కోణాన్ని ఆవిష్కరిస్తుంది. తనకు తానుగా చేయని నేరానికి ఎలా బలైపోయిందీ వివరిస్తుంది. ఈ వివరణలో ప్రగతిశీల భావాల మాటున అమానవీయత ఎంతటి దుర్మార్గాన్ని ఎగజిమ్ముతుందీ చెప్తుంది. ఓ మిత్రుని ద్వారా ఆమె ఎదుర్కొన్న అసహాయ పరిస్థితులను విన్న ఉదంతం – ఈ విశ్లేషణతో మరోసారి పునరావలోకనం జరిగింది. నిస్సహాయ పరిస్థితిలో తీసుకున్న నిర్ణయం – చివరకు నిష్క్రమణే తన ప్రతీకారంగా భావించాల్సిన అనివార్య పరిస్థితులకు నెట్టేయబడింది. తాను స్త్రీ అయినందునే, చెప్పనలవి కాని అవమానాలకు, దౌర్జన్యానికి గురైందన్న విశ్లేషణ మనసును కలచివేయడమే కాదు, వంచనా ప్రవృత్తులకు భాష్యం చెప్పినట్టయింది. ఇలా ఎందరో?

మానవతకు ప్రతిరూపంగా నిల్చిన కాళోజీ విశ్లేషణ మరోకోణం. తరతమ భేదం లేకుండా బాధాతప్త ప్రజలను అక్కున చేర్చుకుని అండగా నిల్చిన మానవీయుడు కాళోజీ. అందుకే సమస్య ఉన్న ప్రతీచోటా కాళోజీ ఉంటూ ప్రజలను మించిన ఆత్మబంధువుల్లేరని తన కలాన్ని, గళాన్ని వినియోగించాడు. నిర్దిష్ట విశ్లేషణకు కొరుకుడు పడని కాళోజీ ఆచరణకు స్పష్టమైన విశ్లేషణ 'పరిచయాలు'లో ఉంది. అయినా కవిగా, అనువాదకుడుగా ఆయన శక్తి గురించీ, ఆయన తన జీవితపర్యంతమూ అనుసరించిన ఆదర్శం గురించి అంచనా కట్టవలసింది ఇంకా ఎంతో ఉందని, ఆ పనిచేయడమే ఆయనకు తగిన నివాళి' అని ముగింపు నివ్వడం మరింత ఆలోచింపజేసేదిగా ఉంది.

కాళోజీ గురించి ప్రస్తావించిన వెనువెంటనే నిర్దిష్ట లక్ష్యంతో ఆశయ సాధనకై నిబద్ధతతో పనిచేసిన స్నేహశీలి జనార్దన్ సార్ గురించి చదువుతున్నప్పుడు, గుండె గొంతులోకి వచ్చిన అనుభూతి. బహుశా ఇందుకు కారణం ఆయనతో ఉన్న కొద్దిపాటి పరిచయమే కావచ్చు. ఆయనకు ఎంత జ్ఞాపకం అంటే, వార్త దినపత్రిక వెలువడిన తొలినాళ్లలో శంకర్‌గుహ నియోగి వర్ధంతి సందర్భంగా నేను రాసిన 'నియోగి చిరంజీవి' వ్యాసాన్ని గుర్తుపెట్టుకుని, ఆ తరువాత కాలంలో ఎప్పుడు ఎదురైనా, 'నియోగీ చిరంజీవి' అనే పలుకరించే వారు. ఆదివాసుల సమస్యలపై కృషి చేయడమే తన కార్యాచరణగా నిర్దేశించుకున్న నిబద్ధత ఆయనది. అందుకే 'కృషి' సంఘీభావ కమిటీ పేరున ఆదివాసీ తెగలకు పెద్ద దిక్కు అయ్యారు. ఈ కథనంలో జేబులో చెయ్యి పెట్టుకుని నిష్కల్మషంగా మనసారా నవ్వుతూ పలకరించే జనార్దన్ కళ్లెదుట సాక్షాత్కరిస్తారంటే అతిశయోక్తి కాదు.

ఈ క్రమంలోనే కవి, చిత్రకారుడు, ఫొటోగ్రాఫర్ అయిన అలిశెట్టి ప్రభాకర్ గురించి రాసిన వ్యాఖ్యానం. సమకాలీన రాజకీయాలపై ఆయన కవితాభివ్యక్తి సాటిలేదు. నగరంలో రోడ్ల పరిస్థితులపై సిటీలైఫ్‌లో రెండు మాటల్లో ఆయన చెప్పిన వైనం, 'ఎవరి కాళ్లకు వాళ్లే బాధ్యులం – నగరంలో రోడ్ల గుంతలు.' ఎంత సూటిగా, సూక్ష్మంగా ఉంది. అకాల అనారోగ్యం, భరోసాలేని జీవన వైనంతో కలగలిసినా ఆయనెప్పుడూ కుంగదీయలేదు. ఎప్పుడు కలిసినా నవ్వుతూ, నిండు కుండలానే మాట్లాడే వారు. బతుకు భారమైన నేపథ్యం నుంచి వచ్చినందునేమో ఆయన గీతల్లో, అక్షరాల్లో కోట్లాది మంది అభాగ్యుల పట్ల తపనే కన్పిస్తూ, వినిపిస్తూండేది. పరిపూర్ణ స్త్రీ పక్షపాతిగా అనిపిస్తాడు ప్రభాకర్. ఆయన రాసిన 'వేశ్య' చిన్న కవితలోనూ, 'విషాద సాక్షాత్కారం' అన్న కవితలోనూ, చివరికి 'మరణం నా చివరి చరణం కాదు' అని తన మరణానికి ముందు రాసిన కవితలో తన ఆత్మవిశ్వాసాన్ని ప్రకటించి స్ఫూర్తిదాతగా నిలిచాడు. ఇన్ని విధాలుగా అలిశెట్టి వివరాలను 'పరిచయాలు' పుస్తకం అందిస్తుంది.

కార్మిక సంఘాలూ – కార్మిక సంఘ నాయకులూ కేవలం వేతన

బేరసారాలకే పరిమితం అవుతున్న తొలినాళ్లలో అసలు కార్మిక సంఘ నాయకుల బాధ్యత ఎంటన్నది గుర్తెరిగేలా చేసింది శంకర్‌గుహ నియోగి. 'వ్యక్తి'గా వ్యవస్థ మార్పుకై ఆయన చేసిన కృషి, ఆయన్నో 'శక్తి'గా నిరూపించింది. ఇప్పటికీ సుమారు 33 ఏళ్ల క్రితమే ఛత్తీస్‌ఘడ్ ఇనుప ఖనిజ గని కార్మికుల పని – వేతన పరిస్థితుల మెరుగుదలకై కాకుండా కాంట్రాక్ట్ లీడర్ పద్ధతికై ఉద్యమించి సాధించిన విజయం ఈనాటికీ మార్గదర్శకం. చిత్తశుద్ధే సమస్య పరిష్కారానికి క్రియాశీలకం అవుతుందనీ తన ఆచరణ ద్వారా నిరూపించాడు నియోగి. కార్మికుల మెరుగైన జీవితం కోసం సారాయి వ్యతిరేక ఉద్యమాన్ని ప్రారంభించి మహిళలను భాగస్వాములుగా చేస్తూ, మహిళా ముక్తి మోర్చా ఏర్పాటు, కార్మికుల్లో అక్షరాస్యతను పెంచేందుకై విద్యాకార్యక్రమాల నిర్వహణకై పాఠశాలల ఏర్పాటు, ఇలా బహుముఖంగా విస్తరించిన నియోగి నేటికీ చిరంజీవి. నియోగి ధాటికి తట్టుకోలేని పెట్టుబడిదారీ వర్గం ఆ ప్రాంతం నుంచి ఆయన్ని బహిష్కరించే యత్నం చేసింది. అయినా ఈ ప్రజల మనిషిని ఏమీ చేయలేకపోయింది. నిశిరాత్రి నిద్రపోతున్న నియోగిని కుట్రపూరితంగా ఈ పెట్టుబడిదారీ వ్యవస్థ కాల్చి చంపింది. అయినా నియోగి వ్యక్తిత్వ పరిమళాలు అక్కడికే పరిమితం కాకుండా విస్తరిస్తూనే ఉన్నాయి. నియోగి వ్యక్తిత్వ ఆవిష్కరణ ముందుతరాలను మరింత ప్రభావితం చేస్తుందనడం అతిశయోక్తి కాదు.

ఇలాగే 'చిరస్మరణ' నవలతో చిరపరిచితుడుగా మెదులుతున్న 'నిరంజన'పై వ్యాఖ్యానం ఎన్నో తెలియని విషయాలను తెలుసుకునేలా చేస్తుంది. నిరంజన అన్నది ఆయన కలం పేరు. ఆయనపేరు కళకుంద శివరావు అని, పాత్రికేయునిగా జీవితం ప్రారంభించి, జనవిముక్తికై చేసిన కృషి అసాధారణం అనిపిస్తాయి. ఒంటరిగానే విజ్ఞాన సర్వస్వం పేరిట ఏడు సంపుటాలను వెలువర్చడం, నాలుగు వందల దేశాల కథలను సేకరించి అనువాదం చేయించి, ఇరవై ఐదు సంకలనాలుగా వెలువర్చడం అపూర్వం. తీవ్ర అనారోగ్యంలో ఇంతటి సాహసాన్ని చేసిన ఈ కన్నడ రచయిత ప్రజల పక్షాన నిల్చి కన్నడ సాహిత్య ప్రగతిశీలతకు ఆద్యుడు అయ్యారు. ఇంతటి 'చిరస్మరణీయులు' మన నేల మీదనే హైదరాబాద్‌లోనే మరణించారన్న విషయం ఊపిరి సలపనివ్వదు.

ఈ విధంగా అనేక రంగాల్లో నిర్దిష్ట లక్ష్యంతో తమ జీవితాలనే అంకితం చేసిన పలువురు విశిష్ట వ్యక్తుల కృషినీ, ఆచరణనూ పాఠకులకు అందించిన సరికొత్త ప్రయోగం నిజంగా విశిష్టమైందే. ఆయా వ్యక్తుల అనుభవాలను చదువుతున్నప్పుడు పొందిన 'స్ఫూర్తి' మనల్ని మనం ఆత్మ విమర్శ చేసుకునేందుకు దోహదపడుతుంది. ఇంత వరకూ ఏం చేశాం? ముందు ఏం చేయాలి? ఎలా చెయ్యాలి? అన్న ఆలోచనకూ గురిచేస్తుంది. ఫలితంగా మనల్ని మనం సరిచేసుకోవడంతోనే సరిపెట్టకుండా, వివిధ ధోరణులతో నీరుగారుతున్న మన స్థైర్యాన్ని, వెన్నుతట్టి కార్యోన్ముఖులుగా చేస్తుందనడంలో అనుమానం లేదు. అదీ మనకి మనం 'చిత్తశుద్ధి'తో పరిశీలించుకున్నప్పుడే. అదే లేకుంటే ఈ కథే లేదు.

పుస్తకాలు – పుస్తక పఠనం మనిషి జీవితానికి, మనుగడకు ప్రేరణను కలిగించేవే కాదు, ఓ సమున్నత దిశగా నడిపించే మార్గ దర్శకాలు కూడా. జీవితమే సమస్యలమయం అయినప్పుడు, దైనందిన మనుగడకు ఆశను కల్పించి ముందుకు నడిపించేవి ఈ పుస్తకాలే. అలసిన మనసుకు ఊరటనిచ్చేవీ ఈ పుస్తకాలే. అనవసర కాలయాపన కోసం వెచ్చించే సమయాన్ని మరిన్ని మంచి పుస్తకాల అధ్యయనం కోసం వెచ్చిద్దాం. మరోసారి ఇలానే కలబోసుకుందాం. వీ

తెలియని విషయాల్ని తెలియజేస్తూ, కొత్త ఆలోచనల్ని రేకెత్తిస్తూ, విచక్షణతో కూడిన విజ్ఞానాన్నిచ్చి మార్గదర్శనం చేసే పుస్తకాలు ఎన్నో ఉన్నాయి. అందులో చదివినవి తక్కువ. చదువలేనివి ఎక్కువ. పౌరాణిక (ఆధ్యాత్మిక) పంచతంత్ర, జాతక కథలు చదువుతూ కొత్తగా నవలలు చదువుతున్న దశలో 'ప్రజల మనిషి' నవల నన్ను ఆలోచింపచేసింది.

వట్టికోట ఆళ్వారుస్వామి 'ప్రజల మనిషి'లో ప్రజల మనిషి ఎట్లుంటాడో, ఎట్లుండాలో చెబుతుంది. నిజాం నిరంకుశ, భూస్వామ్య దోపిడీ, పీడనల కింద తెలంగాణ ప్రజానీకం పడుతున్న కష్టనష్టాలు ఉన్నాయి. రకరకాలుగా అమలైన అణచివేత, దోపిడీ విధానాలు ఇంకా కొనసాగుతున్నట్లుగా అనిపించే పాత్రలు కనిపిస్తాయి. తెలంగాణ ప్రజల స్థితిగతులు ఆయా పాత్రల్లో దర్శనమిస్తాయి. ఆనాటి అణచివేత, దోపిడీ పీడనల్ని ఎదిరించడానికి మొదలైన గ్రంథాలయోద్యమం, స్టేట్ కాంగ్రెస్, కమ్యూనిస్టులు, ఆర్యసమాజం, ఆంధ్ర మహాసభల కార్యకలాపాలతో కొనసాగిన సాంస్కృతిక చైతన్యం కనపడుతుంది. అంతేగాక రాబోయే కాలంలో ఏర్పడనున్న మంచి ప్రభుత్వం పాలనలో ఆశావహమైన సమాజాన్ని కలగనడం ఉంటుంది. మంచి పాలనవస్తుంది. అందులో చదువురాని పౌరులుండరు. ఆకలి బాధలుండవు. ఆకలికి తట్టుకోలేక పిల్లల్ని అమ్ముకునే పరిస్థితి ఉండదు. అంతా నీతిమంతులై దయతో, ఆప్తులుగా ఉంటారంటూ 'ఒక ఆదర్శ సమాజాన్ని' కలగనడం, దానిని ఒక పాత్రతో చెప్పించడం జరుగుతుంది. ఒక మంచి సమాజాన్ని ఏర్పర్చుకోవడానికి అంతా కల్సి ఉద్యమం చేస్తున్నట్లు ఆయా పాత్రల్ని రూపొందించడం జరిగింది. ఈ పుస్తకం అధ్యయనం వల్ల ఇరవై ఏళ్ల క్రితమే సామాజిక స్పృహ కల్గిన పుస్తకాల అధ్యయనం వైపు నడిపించింది. ఆ తర్వాత కాలంలో భారతదేశంలో ఎన్నో వనరులున్నా ఎందుకు, ఎట్లా అప్పుల పాలవుతుందో, ఏ విధంగా తాకట్టు పడిపోతుందో గణాంక వివరాలతో తరిమెల నాగిరెడ్డి రాసిన 'తాకట్టులో భారతదేశం' ఆలోచింప జేసింది. జీవించేహక్కు ప్రతి మనిషికీ ఉన్నప్పటికీ ప్రజల ఆరోగ్యాలు ఎలా వ్యాపారమయంగా మారిపోయాయో వైద్యరంగం పరిస్థితి, కల్తీమందులు, రోగకారకాలు తదితర ఎన్నో విషయాల్ని వివరించిన 'ప్రమాదంలో ప్రజారోగ్యం' డా. జగదీశ్వర్, డా. తిరుపతయ్యలు అందించి హెచ్చరిక చేశారు.

ప్రపంచ పోలీసుగా ఆయా దేశాల్లో ప్రపంచ వాణిజ్య సంస్థ, ఐ.ఎం.ఎఫ్. లాంటి సంస్థల ద్వారా అమెరికా జోక్యం చేసుకొంటూ ఇతర దేశాల్ని కొల్లగొడుతున్న వైనాన్ని 'ఒక దళారీ పశ్చాత్తాపం'లో (తెలుగు అనువాదం : కొణతం దిలీప్) అమెరికా దుర్మార్గాల్ని ప్రపంచానికి అందించడం నచ్చింది.

ఇట్లా ఒక్కో పుస్తకం ఒక్కో ప్రత్యేకత కలిగి ఉండగా, ఒక్క పుస్తకం నచ్చినట్లు చెప్పడం సరైందికాదేమో.

**– ఎన్. భగవాన్ రెడ్డి**
సిద్ధిపేట, మెదక్

*పరవస్తు లోకేశ్వర్ రాసిన 'సలాం హైదరాబాద్' నవల హైదరాబాద్ చరిత్ర, ప్రేమలు, పోరాటాలు కలగలిసి తెలంగాణ హృదయాన్ని ఆవిష్కరించిందని అంటున్నారు* **కాకరాల**

# సలాం హైదరాబాద్ కథలోని వ్యథ

తెలంగాణ ప్రజల అణచివేతల చరిత్రనెరిగిన వారికి మిగిలిన మూడు ప్రాంతాల ప్రజల చైతన్యం కన్న వారి చైతన్యం భిన్నమైందని తెలుస్తుంది. తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటాన్ని రక్తపుటేరుల్లో ముంచి, బలవంతంగా తెలంగాణాన్ని భారత యూనియన్లో భాగం చేసిన నెహ్రూని 'రంగూ రంగులమారి నెవురయ్యా నీ రంగూ బైరంగ మాయనెవురయ్యా' అని ఆ మనిషిలో మనిషిని చూసి చూపించిన రైతాంగ యోధుని చైతన్యం ఆ ప్రాంతం ప్రజల్లో అణిగి మణిగి ఉంది.

సాగరాలను ఏకం చేయగలిగిన అజాత శత్రువుల ఆగ్రహమది. సముద్ర గర్భంలో బడబానలంలా ఉంటుంది. అందుకనే నీలం సంజీవరెడ్డి నుంచి వై.ఎస్ రాజశేఖరరెడ్డి దాకా, ముఖ్యమంత్రులు చేస్తూ వస్తున్న ఆయమాయ గారడీలమీద 'జూమ్‌లెన్స్' వేస్తూ వచ్చిన తెలంగాణ, అరవై తొమ్మిదిలో ప్రత్యేక రాష్ట్రం కోసం అగ్ని పర్వతంలా బద్ధలయింది.

ఈ ఉద్యమాన్ని నిష్పక్షపాతంగా పరిశీలించగలిగిన వారికి, తెలంగాణ హృదయం స్పష్టంగా కనిపిస్తుంది. అయితే అదో బ్రహ్మ పదార్థం కాదు. అసలు హృదయం, ఆత్మ, అంతరాత్మ, పరమాత్మ లాంటి పదాలు రూపంలేని వాటికి రూపాన్నిచ్చిన భావవాద తాత్విక భావనలు. వ్యక్తికో, జాతికో, ప్రాంతానికో వాటిని ఆపాదించుకున్నప్పుడు అవి ఎక్కడున్నాయనిపిస్తుంది. నిజానికి అవి వ్యవస్థలో అణువణువునా ఆవరించి ఉన్న ప్రాణ చైతన్యపు నైరూప్య భావనలు. అవి ఆ వ్యవస్థని నిశితంగా పరిశీలించి కనగలిగిన వారికి మాత్రమే కనిపిస్తాయి.

తెలంగాణ రచయిత పరవస్తు లోకేశ్వర్ ఆ పనిని గొప్పగా చేసి చూపించారు. ఆయన నవల 'సలాం హైదరాబాద్' తెలంగాణ హృదయాన్ని స్పష్టంగా కళ్లకి కట్టిస్తుంది. ఆద్యంతం ఆ హృదయ ఘోషని వినిపిస్తుంది. అంతేకాదు, తెలంగాణకి హృదయమైన హైదరాబాద్ ఆత్మకథ కూడా వినగలిగిన వారికి వినిపిస్తుంది.

ఇక్కడ కథని సంగ్రహంగా చెప్పుకోనక్కరలేదు. నవలా సంవిధాన విశిష్టతని, తెలంగాణ హృదయవైశాల్యాన్ని వ్యక్తం చేసిన, హైదరాబాద్ ఆత్మ సంస్కారాన్ని ఆవిష్కరించిన ప్రత్యేకతల్ని, స్థూలంగా గుర్తుచేసుకుంటే చాలు. ఈ నవల 10 జూన్ 2005న, శుక్రవారం మధ్యాహ్నం మొదలువుతుంది. ఆ సమయంలో 'నాలుగు వందల సంవత్సరాల నగర చరిత్రకు ప్రత్యక్షసాక్షిగా, ప్రథమ సాక్షిగా నిలిచిన 'చార్మినార్' ఉంది. దానికెదురుగా ఇక్బాల్ హోటలుంది. ఆ హోటల్లో స్వామి కూచున్నాడు. తన 'జిగ్రీ దోస్త్ చార్మినార్' తోటి ఎడతెగని నిరంతర సంభాషణని చేస్తున్నాడు – 'వర్తమానం గతంతో చేసే నిరంతర సంభాషణలా.

ఇక్కడ ముఖ్యంగా చెప్పుకోవలసిన మొదటి విశేషం ఉంది. రచయిత ఈ సూచన ద్వారా, ఇది కేవలం నవలే కాదు, చారిత్రక పత్రం కూడానని ముందే హెచ్చరించాడు. ఇక్కడే చెప్పక తప్పని మరో విశేషం కూడా ఉంది. మన దేశంలో ప్రియురాలి మీద తన ప్రేమని తెలియ జెప్పుకునేందుకు 'షాజహాన్' ప్రేమకి ప్రతీకగా 'తాజ్‌మహల్' కట్టించాడు. అలాగే కులీకుతుబ్‌షా హైదరాబాద్ నగరాన్ని కట్టించాడు. ఇక్కడ తప్పక గుర్తించవలసిన మరో విశేషం ఉంది.

ప్రపంచ చరిత్రలో పాలకులు – వారికున్న పరిమితుల్ని పరిధుల్ని అధిగమించి ప్రజల్ని ప్రేమించిన వారున్నారు. అలాంటి ప్రభువుల్ని ప్రజలు ప్రాణం కన్న మిన్నగా ప్రేమిస్తారు. అందుకనే గురజాడ 'ప్రేమ యిచ్చిన ప్రేమ వచ్చును' అన్నాడు. ఆయన సాహిత్య వారసత్వాన్ని అందుకున్న శ్రీశ్రీ 'ప్రేమ ప్రేమను ప్రేమగా ప్రేమిస్తుంది' అన్నాడు.

తెలంగాణ ప్రభువు తన ప్రజల్ని ఎలా ప్రేమించాడో? అలాగే ఆ ప్రజలు ప్రభువుని ఎలా ప్రేమించారో? వెరసి తెలంగాణ 'హృదయం' ఎంత ప్రేమపూరితమో – చారిత్రక పత్రం కూడా అయిన ఈ నవలలో గుప్తంగా ఉంది సుమా అని ముందే గుర్తు చేస్తున్నాడు రచయిత. అర్థవంతమైన ఈ ఆరంభం వెనక తెలంగాణ హృదయాన్ని, దాన్ని చరిత్రని సక్రమంగా అర్థం చేసుకోవాలన్న అతని తపన ఉంది.

ఇక నవలకి ప్రాణమైనదాని సంవిధాన విశిష్టతని చూడాలి.

స్వామి చార్మినార్ ఆత్మలు తమ అంతరంగం లోకాలను ఆవిష్కరించుకుంటూ, నార్మన్ బెతూన్ అన్నట్టుగా 'గతాన్ని కట్టెదుట నిలుపుతూ, వర్తమానాన్ని విమర్శిస్తూ, భవిష్యత్తుకు దారి చూపే దిశగా పదండి ముందుకు పదండి తోసుకుపోదాం పైపైకి' అని మన చేత సైనిక మార్చింగ్ చేయిస్తూ ముందుకు పోతుంది. సామాజిక సంఘర్షణని, చారిత్రక నేపథ్యాన్ని అర్థవంతంగా సమన్వయిస్తూ.

బెంగాల్ దర్శకుడు రుత్విక్ ఘటక్ మూవీ కెమెరాతో ప్రధాన పాత్ర వెనకబడితే కథ వస్తోందంటాడు. అలా సినిమాలు తీసి రుజువు చేశాడు. అలాగే ప్రధాన పాత్రని అనుసరిస్తూ సాగిన ఈ నవలలో తెలంగాణ ప్రజల చైతన్యం, దానికి సంకేతమైన తెలంగాణ హృదయం, దానికైన గాయం, అది సెలేసిన వైనం అన్నీ స్పష్టంగా స్ఫురిస్తాయి.

స్వామి అంతరంగంలో ఉత్తర, దక్షిణాలకు కేంద్ర బిందువైన హైదరాబాద్ నగరం. ఆ నగరంలో అనేక మత, భాషా సంస్కృతీ ప్రవాహాలు, ఆంగ్లో ఇస్లాం ప్రేమలు, పెళ్లిల్లు, వాటి వైఫల్యాలు, కరుణ రసాత్మకమైన ఖౌరున్నీసా విషాదగాథ – అన్నీ చలన చిత్రమాలికలా సాగాయి. అందులో సమకాలీన సమాజ సంఘర్షణల్లో పాల్గొన్న వ్యక్తులు, గత చరిత్రలో భాగమైన పాత్రలు తమవైన వ్యక్తిత్వాలతో చిత్రిత మయ్యాయి. సజీవమైన ఆ పాత్రల చిత్రణకి మచ్చుగా ఖైరున్నీసా ప్రేమ విషాధాల గాథని చూస్తే చాలు.

పంతొమ్మిదేళ్ల ఖైరున్నీసా మీద జేమ్స్ అక్లీస్ కిర్క్ పాట్రిక్ మనసు పడింది. ఒక సందర్భంలో పరస్పరం ఆకర్షితులయ్యారు. ఇది ఆమెవైపు మగవాళ్లకి ఇష్టంలేదు. వారు ఆమెని తమకిష్టమైన మరో వరునితో పెళ్లి చెయ్యాలనుకుంటారు. ఆమెవైపు ఆడవాళ్లకి అది నచ్చక మగవాళ్లు ఊళ్లో లేని సమయంలో చొరవ చేసి ఆమెని పాట్రిక్ దగ్గరకి చేరుస్తారు. కొంతకాలం వారిద్దరూ ఆనందపు అంచులు చూస్తారు. అలా ఆ చిలకా గోరింకల కలలు ఫలించి ఖైరున్నీసా తల్లయింది.

ఆమెవైపు మగవాళ్లు ఆమెకి గర్భవిచ్ఛిత్తి జరిపించి మరో పెళ్లి చేయాలనుకుంటారు. ఖైరున్నీసాకి గృహ నిర్బంధం, ప్రేమ వివాహాల పట్ల ఆరోగ్యకరమైన అభిప్రాయాలున్న ఆమె బలంగా సంకల్పించుకుని తన పెద్దలకు ఎదురు తిరిగింది. విరహబాధని భరించింది.

ఈ ఇద్దరి సాహచర్యాన్ని సహించలేని పెద్దలు, రాజకీయ పెద్దలు పన్నిన కౌటిల్యం ఫలితంగా ఫారూక్ కలకత్తా వెళ్లి అక్కడే చనిపోయాడు. అప్పటికి ఖైరున్నీసా ఇద్దరు పిల్లల తల్లి. ఇక్కణ్నించి ఆమె కష్టాల పరంపర మొదలైంది. ఆ కష్టాలకెదురు నడిచి కొవొత్తిలా కాలి కరిగిపోతున్న ఖైరున్నీసా కలకత్తా వెళ్లి అతని సమాధి దగ్గర అతని కోసం ప్రార్థించింది. సమాధి చూసి వస్తోన్న ఆమెకి పురాతన ఫారసీ కవితా చరణాలు గుర్తుకొచ్చాయి.

ఈ పురుషాధిక్య ప్రపంచం ఖైరున్నీసా సమస్తాన్ని దోచుకుంది. చివరికి ఫారుక్ రాసిన వీలునామా ప్రకారం అతని పిల్లల్ని అతని బంధువులు తీసుకుపోయారు. అలా అన్నీ కోల్పోయిన ఆమె అన్ని విధాలా దగా పడి మనోవ్యథతో కాలి, కరిగి, కృశించి కన్నుమూసి సమాధిలోకి వెళ్లింది.

ఇంతవరకూ స్వామి అంతరంగంలో సాగిన ఈ సన్నివేశం ముగియగానే పవిత్రప్రేమకి ప్రతీకయిన 'తాజమహల్' ముందుకొచ్చింది. అలాగే హిందూ ముస్లిం మతాల ఐక్యతకి సంకేతమైన హైదరాబాద్, దానిలోని చార్మినార్ ముందుకొచ్చాయి. వాటి తరువాత వరసగా జాతీయోద్యమ కాలపు దృశ్యాలూ, యోధులూ, నాయకులూ, ముఖ్యంగా తుర్రేబాజ్‌ఖాన్ లాంటి పోరాట యోధులు ముందుకొచ్చారు.

సఫలమైన ప్రేమకి ప్రతీకలైన భాగమతి కులీకుతుబ్‌షాలు, వారి స్మారక స్థలాలు, భవనాలు, కదులుతూ ముందుకొచ్చాయి – తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటోద్యమ దృశ్యాలు, వాటి మీంచి ఓవర్‌లాపయి వచ్చాయి. ఇది డిజాల్వు అవుతూ అరవై తొమ్మిది ప్రత్యేక తెలంగాణ ఉద్యమ దృశ్యాలు ఫోకస్‌లోకొచ్చాయి.

ఈ దృశ్యాల నేపథ్యంలో స్వామి 'మహాప్రస్థానం' కొని చదువుతూ వస్తున్నాడు. వెనక ఎవరి గొంతు నుంచో ఆ గీతాలు వినిపిస్తున్నాయి. 'వెనక దగా ముందు దగా కుడి ఎడమల దగాదగా' వినిపిస్తుండగా దగాపడిన తెలంగాణకి ప్రతీకైన ఖైరున్నీసా మూర్తిభవించిన శోకదేవతలా ముందుకొచ్చింది.

ఇటు మీదట తెలంగాణ సాయుధ పోరాటం, పోలీసు యాక్షన్ దృశ్యాలూ, వరసగా దిగంబరోద్యమం, నక్సల్బరీ రగిలించిన శ్రీకాకుళ ఉద్యమం, అరవై తొమ్మిది ప్రత్యేక తెలంగాణ పోరాటోద్యమ దృశ్యాలూ, విశాఖలో శ్రీశ్రీ సన్మాన సంరంభ దృశ్యాలూ, డెబ్బైలో విరసం స్థాపన, డెబ్బై రెండులో ముల్కీ ఉద్యమం, విద్యుల్లత కవులు. అవి వెనక్కి డిజాల్వ్ అవుతుండగా ముందుకి తోసుకువచ్చిన 2009 ప్రత్యేక తెలంగాణ, సమైఖ్యాంధ్ర దృశ్యాలు. స్వామి అంతరంగంలో మమేకమవుతున్న మనల్ని దగా పడిన తెలంగాణకి ప్రతీకైన ఖైరున్నీసా న్యాయం చెప్పమని నిలదీస్తుంది చివరికి.

ఇప్పుడు దశాబ్దాలుగా దగా పడుతూన్న తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంగా విడిపోవాలనుకుంటోంది. వచ్చిన ఒత్తిడిని బట్టి తెలంగాణ రాజకీయులందరూ, పార్టీలతో ప్రమేయం లేకుండా తెలంగాణ వైపుకి వచ్చారు. రాయలసీమ సర్కారుకు ఉత్తరాంధ్రల, రాజకీయులందరూ సమైకాంధ్రని, ప్రత్యేకాంధ్రని, గ్రేటర్ రాయలసీమని, అయోమయాన్ని సృష్టిస్తూ కల్లోలం రేపుతున్నారు. ఈ ప్రభుత్వాలు దగాపడిన తెలంగాణకి న్యాయం చేస్తాయా? తెలంగాణకి హృదయమైన హైదరాబాద్ గ్రేటర్ హైదరాబాదవుతున్న క్రమంలో దాని వ్యథని, గాయాన్ని మాన్పుతారా? పెంచుతారా? ఇవన్నీ రాబోయే కాలంలో తేలవల్సిన ప్రశ్నలు. ఇప్పటికే ఇది ఎంత జటిలమైందంటే బ్రెయిన్‌కి వచ్చిన కేన్సర్‌ని బ్రెయిన్‌కి హాని కలగని విధంగా శస్త్ర చికిత్స చేయడం లాంటిది. ఈ సమయంలో కాళోజీ చెప్పింది గుర్తుకొస్తోంది.

అన్ని ప్రాంతాల ప్రజలు హెచ్చరికగా ఉండి 'దోపిడీ చేసే పరాయివాణ్ని పొలిమేర దాకా పారద్రోలడానికి, ప్రాంతం వాడైతే ప్రాంతంలోనే పాతరేయడానికి' సంసిద్ధులై ఉండాలి. వీ

---

**నే**ను చదివిన పుస్తకం 'మండుతున్న గాయాలు' విప్లవ రచయితల సంఘం 2009లో ప్రచురించింది. రచయిత్రి బి.డి. దమయంతి.

సల్వాజుడుం బాధిత మహిళల హృదయస్పందన, పది భాగాలుగా ఈ పుస్తకంలో ఉంది. దండకారణ్య ఉద్యమ ప్రాంతాల్లో సల్వాజుడుం, నాగా మిలిటరీ, సి.ఆర్.పి.ఎఫ్. పోలీసుల అకృత్యాలను ఈ పుస్తకంలో పొందుపర్చారు. దండకారణ్య మహిళల అనుభవాల సంపుటి. ఆదివాసీ ప్రజల మీద, మహిళల మీద, పసిపిల్లల మీద హింస చేస్తున్న రాజ్యంను ప్రతి ఒక్కరూ ఈ పుస్తకం చదివి ప్రశ్నించ గలిగే స్థాయికి ఎదుగుతారని నాకనిపిస్తుంది.

ఆదివాసీ సంస్కృతిని రాజ్యం హింసచే చిన్నాభిన్నం చేస్తుంది. సామూహిక అత్యాచారాలు, హత్యలు, పసిపిల్లల చంపివేత, తలలేని మొండెములు, శరీర అవయవాల చెల్లాచెదురు ఇవన్నీ రాజ్యహింసలో భాగంగా అమలవుతున్నది. కేవలం ఉద్యమానికి సహాయ పడుతున్నారన్న ఒకే ఒక్క కారణంతో పచ్చని అడవిలో నెత్తురు చిమ్ముతోంది. ప్రతిరోజూ అక్కడ వాకపల్లిలు కనిపిస్తాయి. ఈ పుస్తకానికి ముందుమాట రాసిన వరవరరావు గారు అన్నట్టు వాళ్ల అడవి జీవితంలో పోరాటం ప్రకృతి అంత సహజమైన సంస్కృతిగా మారిపోయింది. మన నాగరిక సమాజ బాధ్యత, కర్తవ్యం మండుతున్న గాయాలను సభ్య ప్రపంచానికి చెప్పాలే. ఇప్పుడు జరుగుతున్న ఆపరేషన్ గ్రీన్‌హంట్ వల్ల అక్కడ మరెన్ని అకృత్యాలు జరుగుతున్నాయో? అక్కడి ఆదివాసీ మహిళల మానప్రాణాలు హరించ బడుతున్నాయో? అందుకే బుద్ధిజీవులయిన మనం మండుతున్న గాయాలను చదివి అర్థం చేసుకొని, ఆదివాసుల పై యుద్ధం చేస్తున్న భారతదేశ పాలకవర్గాలను ప్రశ్నించాలి. ఆపరేషన్ గ్రీన్‌హంట్ ఆపాలని ఉద్యమించాలి.

**– సి.ఎచ్. శ్రీమన్నారాయణమూర్తి**
మంచిర్యాల, ఆదిలాబాద్

*ఆంధ్రప్రదేశ్ అవతరణ సందర్భంగా తెలంగాణ చరిత్రను, సంస్కృతిని, జీవన విధానాన్ని సమగ్రంగా ప్రజల దృష్టికి తెచ్చిన 'తెలంగాణం' వ్యాస సంకలనాన్ని ఇవాళ్టి తెలంగాణ సందర్భంలో గుర్తుచేస్తున్నారు* **వరవరరావు**

# వట్టికోట ఆళ్వారుస్వామి కృషి

'తెలంగాణం' వ్యాసాలు వెలువడి అప్పుడే ఆరు నెలలైనప్పటికి నేను ఇటీవల రెండుసార్లు చదివాను. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన సందర్భంగా 1956లో మొదటిసారి రెండు సంపుటాలుగా ఈ వ్యాసాలు వెలువడినవి. దేశోద్ధారక గ్రంథమాల తరపున వట్టికోట ఆళ్వారుస్వామి సంకలనం చేసారు. అప్పటికి నేను పదహారు సంవత్సరాల వయసులో పియుసి చదువుతున్నాను. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన ఆనందం, నాగార్జున సాగర్ ఆధునిక దేవాలయం అని భావించిన పులకింతలో ఇంత సమగ్రంగా తెలంగాణ చరిత్ర ఒకచోట చదువుకున్న ఆ అనుభూతి ఇంకా మిగిలే ఉన్నది. 53 ఏళ్లు పోయాక మళ్లీ రెండు సంపుటాలు ఒక చోటే కలిపి తెలంగాణ విద్యావంతుల వేదిక, తెలంగాణ రచయితల వేదిక పునర్ముద్రించినపుడు అంతే ఆనందంతో ఆ పుస్తకాన్ని చేతికి రాగానే చదివేసాను.

వ్యాసాల్లో అదే నిజాయితీ, అదే సత్యశోధన, అదే సులభత్వం. తేడా అల్లా అప్పుడు తెలుగువాళ్లు ఒకటవుతున్నారన్న భావన. ఆంధ్రప్రదేశ్ పరిపాలనా బాధ్యతలు చేపట్టే వారికి అన్ని రంగాలలో అప్పటికి తెలంగాణ సాధించిన, సాధించని, కలిగి ఉన్న, కలిగిలేని పురోగతిని వివరించాలన్న, ముందుంచాలన్న ఒక కఠోరమైన పరిశోధనా పూర్వక ప్రయత్నం.

ఇప్పుడు తెలంగాణలో మా చక్కిన మేం విడిపోతాం. కలిసి ఉండడంలో మాకు మిగిలిందల్లా చేదు అనుభవం, ఫ్యూడల్ పాలన నుంచి, వలస పాలన కిందికి వచ్చిన న్యూనతా భావం – కనుక 53 ఏళ్ల కింద ఉన్నట్లయినా 'తెలంగాణం' ఉందా లేదా సందుక తెరచుకొని చూసుకున్న నాస్టల్జియా.

ఎంత మార్పు అంటే – వట్టికోట ఆళ్వారుస్వామి ఆంధ్ర మహాసభలో క్రియాశీల కార్యకర్తగా పనిచేసారు. మాడపాటి, సురవరం, ఆదిరాజు, మగ్దూమ్‌లతోపాటు తెలంగాణ వైతాళికుల్లో ఒకరుగా పేర్కొనదగిన బహుముఖ ప్రజ్ఞావంతుడు. వీరు, వీరితోపాటు కాళోజీ, దాశరథులు ఆంధ్రశబ్దాన్ని తెలుగుకు పర్యాయపదంగా, అభేద్యంగానే స్వీకరించారు. శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయాన్ని 1901లో ఏర్పాటు చేసిన నాటి నుంచి 1953లో అలంపూరంలో తెలంగాణ రచయితల సంఘాన్ని అఖిలాంధ్ర రచయితల సంఘంగా మార్చే వరకు ఒక ఏభై ఏళ్లు తెలంగాణ విమోచనోద్యమాన్ని ఆంధ్రాభినివేశంలోనే నిర్వహించారు. కమ్యూనిస్టులయితే (వట్టికోట ఆళ్వారుస్వామి కమ్యూనిస్టు కూడ) విశాలాంధ్ర భావనతోనే నిర్వహించారు.

ఆంధ్ర మహాభారతం నన్నయ, తిక్కన, ఎర్రనలు రచించినట్లే బమ్మెర వాడయిన పోతన శ్రీమదాంధ్ర భాగవతమే రచించాడని భావించి గౌరవించారు. త్రిలింగ ప్రదేశాల మధ్యన నివసించిన వారంతా తెలుగు వారే అనుకున్నారు. ఆంధ్రులు కారని అనుకోలేదు. ఎందుకంటే ఒక్క కాళేశ్వరం మినహా ఇప్పుడు ఆంధ్ర రూఢ్యర్థంలో వాడుతున్న ద్రాక్షారామం, రాయలసీమగా ప్రాచుర్యానికి వచ్చిన శ్రీశైలం – మరో రెండు ఉన్నాయి త్రిలింగక్షేత్రాలలో.

కాని ఈ ఏభై మూడేళ్లలో జాతి, భాష వేరయినంతగా ఆంధ్ర, తెలంగాణ శబ్దాలు రెండు ప్రాంతాల్లోనూ మనసుల్ని కలుషితం చేసాయి.

డిసెంబర్ 9న రాత్రి 'తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుకు ప్రక్రియ ప్రారంభమవుతుంది' అని కేంద్ర దేశీయ వ్యవహారాల మంత్రి ప్రకటించిన దగ్గర్నించీ ఇటు వేర్పాటువాదులు, అటు సమైక్యత పేరుతో తెలంగాణ విద్వేషవాదులు చేసుకుంటున్న పరస్పర ఆరోపణలు వింటుంటే మళ్లీ ఒకసారి 'తెలంగాణం' చదువవలసిన అవసరం ఎంత ఉందో అనిపించింది.

తెలంగాణం కేవలం ఒక భూగోళం కాదు. ఒక చరిత్ర, ఒక సంస్కృతి, ఒక జీవన విధానం అని సమగ్రంగా ఆంధ్రప్రదేశ్ అవతరణ సందర్భంగా ప్రజల దృష్టికి తేవాలనే ప్రయత్నంలో వట్టికోట ఆళ్వారుస్వామి ఏ చరిత్ర పరిశోధకుడు కూడా చేయని కృషి చేసారు. అప్పటి నుంచీ ఇప్పటివరకు గత 53 ఏళ్లలో మళ్లీ ఇటువంటి కృషి జరుగనేలేదు. ప్రాచీన చరిత్ర, ఆ చరిత్ర నిర్మాణానికవసరమైన నాణెములు, శాసనములు, తాళపత్ర గ్రంథాలు, దేవాలయాల చరిత్ర ఇందులో ఉన్నది. ఇవ్వాల్టి తెలంగాణకు కాకతీయులు 'త్రిలింగ దేశం'గా ప్రాచుర్యం తెచ్చారు కనుక, శాతవాహనుల తర్వాత మళ్లీ అంత విశాలమైన తెలుగు సామ్రాజ్యాన్ని పాలించారు గనుక కాకతీయ రాజవంశం మీద, కాకతీయ సాంఘిక చరిత్ర మీద రెండు వ్యాసాలున్నాయి. ఇవన్నీ సుప్రసిద్ధ చరిత్రకారుడు ఆదిరాజు వీరభద్రరావు గారు రాసినవే ఎంతో ప్రామాణికమైనవి. వరంగల్‌ను 12వ శతాబ్దంలోనే 'ఆంధ్ర నగరం' అన్నారని వినుకొండ వల్లభరాయని 'క్రీడాభిరామం' ఆధారంగా చెప్తున్న లగడపాటి రాజగోపాల్ గారు కాకతీయుల కాలం నుంచి, ఢిల్లీలో మొగలాయిల పాలన దాకా, అంటే ఇక్కడ కుతుబ్‌షాహీ, ఆసఫ్‌జాహీల కాలం దాకా తెలుగునేల తెలంగాణగా ప్రాచుర్యం పొందిందని ఉద్దేశపూర్వకంగా దాచిపెడుతున్నారు. మంత్రి మాదన్న గురించి, ఆయన విదేశాంగ నీతి గురించి చొల్లేటి నృసింహశర్మ, కె.వి. భూపాలరావు వంటి పండితులు, చరిత్ర పరిశోధకుల వ్యాసాలున్నాయి.

తెలంగాణ భూగోళ, నైసర్గిక స్వరూపాలు, కొండలు, నదులు, ఖనిజాలు వంటి వివరాలు ఆదిరాజు వీరభద్రరావు గారు రాస్తే, పరిశ్రమల గురించి, పారిశ్రామిక కార్మికుల గురించి గొబ్బూరి రామచంద్ర రావు రాసారు. బొగ్గు గనుల గురించి ఎస్. సోమరాజు రాసిన వ్యాసం ఎంత సందర్భోచితంగా ఉన్నదంటే సింగరేణి బొగ్గు గనుల ఓపెన్ కాస్ట్ విధ్వంసం సందర్భంగా 'వీక్షణం'లో చదివినపుడే 53 ఏళ్ల క్రితం కాలం చెల్లిన వ్యాసం అనిపించలేదు. అట్లే తెలంగాణలో కుటీర పరిశ్రమలు, చేనేత పరిశ్రమల గురించి ప్రామాణికమైన వ్యాసాలు ఉన్నాయి. 53 ఏళ్ల తర్వాత మూలబడిన కుటీర పరిశ్రమలు, ఆత్మహత్యల పరంపర సాగుతున్న చేనేత పరిశ్రమల వర్తమాన చరిత్ర మనం 53 ఏళ్లు ముందుకు వచ్చామని చెప్తుందా? వెనక్కు వెళ్లామని చెప్తుందా?

తెలంగాణ రాజకీయోద్యమం - భూదానోద్యమం వంటి సంస్కరణ వాదం మొదలు - భూసంస్కరణల విషయంలో కమ్యూనిస్టుల, కాంగ్రెస్ వాళ్ల అవగాహన వరకు విశ్లేషించాయి. కౌలుదారీ సమస్యపై దేవులపల్లి వెంకటేశ్వరరావు రాసిన సమగ్రమైన వ్యాసం, దానికదిగా వ్యాసం మాత్రమే కాదు, తెలంగాణలో మూడువేల గ్రామాలను విముక్తం చేసి, పదిలక్షల ఎకరాల భూమిని పంచిన విప్లవ భూ సంస్కరణల పరిచయం. ఇదంతా నిజాం వ్యతిరేక, ఫ్యూడల్ భూస్వామ్య వ్యతిరేక రాజకీయోద్యమంలో అంతర్భాగంగా నిర్వహించబడిన రాజకీయార్థిక ఉద్యమం. ఇటువంటి పోరాటం దేశంలో 1956 కన్న ముందు ఎక్కడా విముక్తి - విద్రోహాల దాకా నిర్వహించబడలేదు.

ఇవ్వాళ లోక్‌సత్తా - జయప్రకాశ్ నారాయణ్ మళ్లీ చాల వెనక్కు వెళ్లి ప్రాంతీయ అభివృద్ధి కమిటీలు, జిల్లా కౌన్సిళ్ల గురించి మాట్లాడి చన్నీళ్లు చల్లుతున్నారు. తెలంగాణలోని 'స్థానిక స్వపరిపాలన విధానం' గురించి ఆయన మరి ఒక పరిపాలనాధికారిగా ఆంధ్రప్రదేశ్ ఏర్పడినాక అధ్యయనం చేసారో లేదో.

తెలంగాణ రాయకీయోద్యమాల గురించి ఆయా పార్టీల సాధికార ప్రతినిధులనదగిన రావి నారాయణరెడ్డి, కోదాటి నారాయణరావులు రాసారు. మునగాల పరగణలోని పోరాటం గురించి లేదుగానీ పరిటాల ప్రజా ఉద్యమం గురించి ఉన్నది. సర్వాయి పాపని తిరుగుబాటు గురించి ఉన్నది. ఆదివాసుల గురించిన వ్యాసంలో తెగలు, అలవాట్లు, విశ్వాసాల ప్రస్తావన ఉంది గాని గోండుల ప్రస్తావన, ఆదిలాబాద్, కేసలాపురంలోన నాగోబా జాతర సందర్భంలోనైనా జోడెన్ ఘాట్ పోరాటం గురించి, రాంజీ గోండు, కొమురం భీంల స్వపరిపాలనా పోరాటం గురించి ప్రస్తావించక పోవడం పెద్దలోపం. ఆ విధంగా చూసినపుడు ఆదివాసుల సందర్భంలోనే సమ్మక్క, సారలక్క గురించి, మేడారం జాతర గురించి ప్రస్తావన ఉంది గానీ పగిడద్దరాజు కాకతీయుల నెదిరించి చేసిన పోరాటంలో సమ్మక్క, సారలక్కలు పాల్గొని ప్రదర్శించిన సాహసం, చేసిన త్యాగం గురించి ఉండాల్సింది.

మాడపాటి హనుమంతరావు తెలంగాణ విమోచనోద్యమ వైతాళికుడని, ఆయన ఆంధ్రప్రదేశ్ కేంద్ర సంఘాన్ని, ఆంధ్ర మహాసభను ప్రారంభించాడని ఇవ్వాళ అందరికీ తెలుసు. తెలంగాణ విమోచనోద్యమాన్ని ఆయన ఆంధ్రోద్యమంగా చూసాడు. అందుకే ఆయన నిజాం రాష్ట్రంలోని యంత్రాల గురించి రాసాడు. ఇది నిజానికి 1914లో రాసిన వ్యాసం. దాదాపు వంద సంవత్సరాలు గడించే వరకు ఇవ్వాళ ఎవరైనా ఈ వ్యాసాన్ని అప్‌డేట్ చేయాలనుకుంటే ఆంధ్రప్రదేశ్ లోని తెలంగాణీయులు - తెలంగాణ వాళ్లు అని రాయవలసి వస్తుందనుకుంటాను. బ్రిటిష్ ఇండియాలో మద్రాసు ప్రావిన్సులో ఆంధ్రులు అనుభవించిన వలసాధిపత్యం వంటిదే ఏభై మూడేళ్లుగా తాము అనుభవిస్తున్నామని ఇవ్వాళ తెలంగాణవాదులు (సరిగ్గా నైజాం ఆంధ్రులు అని భావించిన వాళ్ల వారసులు - అంటే మధ్యతరగతి, పెటీ బూర్జువా బుద్ధిజీవులు, రచయితలు, కళాకారులు) భావిస్తున్నారు. మహాంధ్రోదయం, విశాలాంధ్ర, ముక్కోటి ఆంధ్రులు ఒక్కటై ఉండాలని కలలుగన్న వారి వారసులే ఇవ్వాల మూడున్నర కోట్ల తెలంగాణ ఏర్పాటు గురించి కదనాన దూకారు. అందుకు సమైక్య వాద నాయకులందరూ జవాబుదారీ కావల్సిందే. అందుకే ఈ సంపుటిలో వావిలాల గోపాలకృష్ణయ్య 'మనం ఆంధ్రులం' అని చెప్తా, ఔనా, అట్లాగా అని కనుబొమ్మలు ముడిపడుతున్నాయి.

తెలంగాణ జానపద గేయాల గురించి జానపద సాహిత్య పరిశోధనలో తెలుగు సాహిత్య చరిత్రలో వేళ్లమీద లెక్కపెట్టదగిన వారిలో ఒకరైన బి. రామరాజు సాధికారికమైన వ్యాసం రాసారు. అట్లే చిత్రకళ గురించి కొండపల్లి శేషగిరి రావే స్వయంగా రాసారు.

ఇవన్నీ ఒక ఎత్తు - ఒక రచనగా, కొండను అద్దంలో చూపడంగా దాశరథి (కృష్ణమాచార్య) రాసిన 'తెలంగాణ ఆధునిక సాహిత్య ముఖద్వారం' ఒక ఎత్తు. తెలంగాణ కవుల గురించి వానమామలై వరదాచార్యులు 16 పేజీల వ్యాసం రాసినా ఎవరినో మరిచిపోయాడనే అనిపిస్తుంది. అసమగ్రమనిపిస్తుంది.

కాని దాశరథి రెండు పేజీలు ఎంత గడుసు సామరస్యంతో రాసాడంటే మనను ముఖద్వారంలో నిలబెట్టే ఆధునిక సాహిత్యాన్ని అంత సాకల్యంగా చూసాడు. బొంబాయి తమాషా చూసినట్లు. నోరు తెరిస్తే ప్రేవులు లెక్కపెట్టినట్లు చెప్పి 'ఇంతకు మించి రాయకూడదు. ఎందుకంటే నా ప్రసక్తి రావలిసి వచ్చే ప్రమాదం ఉంది' అని ముగిస్తాడు.

రెస్ట్ ఈజ్ హిస్టరీ అన్నట్లు. నిజంగా తెలంగాణంలో ఆయన నడిపిందే గదా ఆధునిక సాహిత్య చరిత్ర 1956 దాకా.

ఇంత సమగ్రమయిన పుస్తకంలో వెలితి ఏమిటో కూడ ఆళ్వారుస్వామి గారే దాచుకోకుండా వినమ్రంగా చెప్పారు.

పదిహేడు శీర్షికలకు రచనలు పొందలేకపోవడమో, వచ్చినవి తృప్తిగా లేకపోవడమో కారణమన్నారు. ఆదివాసుల గురించి ప్రస్తావన అయినా ఉన్నది గానీ ఆనాడు తెలంగాణ ఉద్యమానికి ఎంతో బలాన్నిచ్చిన భాగ్యారెడ్డి వర్మ మొదలు, తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటంలో పాల్గొన్న దళితుల వరకు ఆనాడు 'తెలంగాణం'లో రాయించలేదు. ముస్లింల గురించి ఆనాడే కాదు, ఈనాడు కూడ తెలంగాణలో వారొక ప్రధాన పాయ అనే గుర్తింపు రాజకీయోద్యమాల్లోనే కాదు, సాంస్కృతికోద్యమాల్లోనూ కనిపించడం లేదు. 1969 ప్రత్యేక తెలంగాణ ఉద్యమం - గత నలభై ఏళ్ల ప్రస్థానం, ఇటీవలి పదిరోజుల ప్రజా వెల్లువల నేపథ్యంలో ఇటువంటి కృషికి సంస్థలు పూనుకోవాలి. వట్టికోట ఆళ్వారుస్వామి ఒక్క చేత నడిపిన దేశోద్ధారక గ్రంథమాలతో పోలిస్తే, ఇవ్వాల తెలంగాణ విద్యావంతులు, రచయితలు, సాంస్కృతిక కార్యకర్తలు, సంస్థలు కోకొల్లలు. 'తెలంగాణం'ను వీరంతా కలిసి అప్‌డేట్ చేస్తారనే ఆశిద్దాం. వీ

**చదువును, జీవితాచరణను వేరుగా చేసి చూపిస్తున్న ఇవాళ్టి సందర్భంలో మంచి పుస్తకాలు చదవాల్సిన అవసరాన్ని గుర్తు చేస్తున్నారు రాంకి**

# నన్ను ప్రభావితం చేసిన పుస్తకాలు

'ఆచరణ నుండి జ్ఞానం పుడుతుంది. ఆ జ్ఞానం కొత్త ఆచరణకు దారితీస్తుంది. కొత్త ఆచరణ మరింత కొత్త జ్ఞానానికి మరింత మెరుగైన ఆచరణలకు దారితీస్తుంది. జ్ఞానం అంతిమ ప్రయోజనం ఆచరణను బలోపేతం చేయడానికే' అన్న మావో మాటలకు భిన్నంగా మన చదువులు ఆచరణకు, జ్ఞానానికి మధ్య ఉన్న సంబంధాన్నే తెగ్గొట్టేశాయి. చదివిన చదువుకు, జీవిస్తున్న బతుక్కు ఎటువంటి సంబంధం లేదు. జీవితంలో శాస్త్రీయ దృష్టి అలవడే పరిస్థితులు లేవు. సి.వి. రామన్ భౌతిక శాస్త్రంలో శాస్త్రవేత్తే అయినా తన నమ్మకాల వలన గంగా నదిలో మునిగిన చదువే. రోదసికి చేరి భూమిని, గ్రహాలను పరిశీలించే రాకెట్ నమూనాను కూడా శాస్త్రవేత్తలు వెంకటేశ్వరుని పాదాల ముందు ఉంచి పూజలు చేసే వెనుకబాటు. మనిషి గుండెను తీసి గుండెను పెట్టే శాస్త్రజ్ఞానం పెరుగుతున్నా, తాయెత్తుతోనే గుండె ధైర్యం పొందే దైన్యంలో ప్రజలు ఈనాటికీ కొనసాగుతున్నారు. శాస్త్రానికీ (జ్ఞానానికీ), ఆచరణకూ సంబంధం లేకుండా చేసి, ఏదీ అర్థమవకుండా చేసి, ప్రశ్నలకు తావులేకుండా చేసి నడిపించే సమాజ రీతిని ఎలా అర్థంచేసుకోవాలి? అర్థం చేసుకోకుండా దాన్ని ఎలా మార్చగలుగుతాం? ఇదంతా ఎందుకంటే, విషయాలకుండే కార్యకారణ సంబంధాన్ని అర్థం చేసుకునే స్థాయికి మన సమాజం ఇంకా ఎదగలేదు. ఒక పరికరాన్ని వాడుకోవడమే తప్ప, ఆ పరికరం వెనుక ఉన్న జ్ఞానం, ఆ జ్ఞానం వెనుక ఉన్న కార్యకారణ సంబంధం మనకర్థం కాలేదు. (అర్థం కాలేదు అనేకంటే అర్థం చేసుకోనీయకుండా ఉంచింది ఈ వ్యవస్థ). మరి వీటికి మనమేం చేయాలి అంటే సరియైన జ్ఞానాన్ని అందుకోవడానికి ప్రయత్నించాలి. అలా ప్రయత్నిస్తున్న వారికి సహాయపడాలి.

నన్ను మొదటిసారి బాగా ప్రభావితం చేసిన పుస్తకం శివవర్మ రాసిన 'సంస్మృతులు'. నేను పెద్దాపురం మహారాణి కాలేజీలో ఇంటర్మీడియట్ చదువుతున్నప్పుడు మిత్రుడు మహమ్మద్ ఇబ్రహీం నాచేత ఆ పుస్తకం చదివించాడు. ఆ పుస్తకం వల్ల భగత్‌సింగ్ కలలుగన్న నిజమైన స్వాతంత్ర్యం మనకు అందలేదని అర్థమయింది. అందులో భగత్‌సింగ్, చంద్రశేఖర్ ఆజాద్, రాజగురు, సుఖ్‌దేవ్‌ల త్యాగాలు, వారి సాహసాలు, బలిదానాల గురించి చదివాక దేశ స్వాతంత్ర్యం, సమానత్వం, ప్రజల సౌభ్రాతృత్వాల కోసం ప్రాణాలర్పించిన ఆ త్యాగధనుల జీవితాలు నాలో తెలియని అలజడిని రేపాయి. భగత్‌సింగ్ తన తండ్రి తెచ్చిన పెళ్లి ప్రస్తావనను సున్నితంగా తిరస్కరిస్తూ, దేశ స్వాతంత్ర్యం కోసం కార్యోన్ముఖుణ్ణై ఉన్నానని, తనకు పెళ్లి చేసుకోవాలని లేదని తండ్రికి ఉత్తరం రాయడం, ఆ ఉత్తరం చదివిన తండ్రి భగత్‌సింగ్ లక్ష్యాన్ని గౌరవిస్తూ ఉన్నతాశయం వైపు సాగిపొమ్మని ప్రోత్సహించడం మనచేత కన్నీళ్లు పెట్టించడమే కాక, సమాజం పట్ల, ప్రజల పట్ల బాధ్యత పడేలా చేస్తాయి.

అదే క్రమంలో నేను చదివిన శ్రీశ్రీ 'మహాప్రస్థానం' నాలో రేగిన అశాంతికి ప్రాణ వాయువు పోసింది. మహాప్రస్థానంలోని కవితలన్నిటిని చదువుతూ, పాడుతూ, పంచుకుంటూ గడిపిన రోజులవి. ఆ వరుసలోనే జాక్ లండన్ 'ఉక్కుపాదం'. ఈ నవలలో ఎర్నెస్ట్ ఎవర్‌హార్డ్ తన ప్రత్యర్థులతో సూటిగా చేసే చర్చలు, ఒక ఆత్మవిశ్వాసంతో, శాస్త్రీయతతో ప్రజల పక్షం నిలిచి ప్రశ్నించే ధోరణి ప్రతి ఒక్కరిని ఉత్తేజితుల్ని చేస్తుంది.

తగళి శివశంకర్ పిళ్లై 'కూలిగింజలు', అలెక్స్ హేలీ 'ఏడు తరాలు' సమాజంలో తరతరాలుగా అణచివేయబడుతున్న వర్గాల ప్రజల ఆక్రందనలను మన కళ్లకు కడతాయి. మాక్జిం గోర్కీ రాసిన 'అమ్మ' నవలలోని అమ్మ తన కొడుకు గురించి బెంగపడి, బాధపడే క్రమం నుంచి తన కొడుకు లాంటి అనేక మంది యువతీ, యువకులకు తల్లిగా మారడమే కాకుండా, ఆ పిల్లల ఉన్నత లక్ష్యాలను తన లక్ష్యంగా చేసుకోవడం ప్రతి ఒక్కరికీ ఉన్నత సామాజిక లక్ష్యాల వైపుకు నడిచే శక్తినిస్తుంది.

అలాగే రంగనాయకమ్మ గారి 'జానకివిముక్తి' నా ఆలోచనలకు స్పష్టతను ఇచ్చింది. మనకోసం మనం అనే ధోరణి మాత్రమే కాక మన చుట్టూ ఉన్న సమాజం కోసం బాధ్యత పడినప్పుడే, పరిస్థితులు మారతాయనే స్పృహను పెంచింది. మౌలికంగా మనం మన సమాజాన్ని అర్థం చేసుకోవడానికి డి.డి. కొశాంబి 'ప్రాచీన భారతదేశ చరిత్ర' బాలగోపాల్ చేసిన పరిచయం ఎంతో ఉపయోగపడుతుంది. చరిత్రకు సంబంధించి ప్రతి ఒక్కరికి మెరుగైన, స్పష్టమైన దృష్టిని ఇస్తుంది. అలాగే న్యూవిస్టాస్ 'మార్క్సిస్టు తత్వశాస్త్రం' సమాజాన్ని వస్తుగతంగా అర్థం చేసుకోవడానికి మనకు అనేక పరికరాలు అందిస్తుంది.

ప్రభావితం చేసిన ఒక్క పుస్తకం గురించి రాయడం బహుశా కష్టమే. ఈ క్రమంలో చాలా పుస్తకాలే ఉన్నాయి. వివిధ సందర్భాలలో ఆర్.ఎస్. రావు గారు 'ఒక మంచి పుస్తకం చదవండి, మీ అభిప్రాయం చెప్పండి. ఏదయినా రాయండి, కలిసి చర్చించండి' అన్న మాటలు మనకు, మన సమాజానికి చాలా అవసరమనిపిస్తాయి. గ్రంథాలయోద్యమం నడిచిన ఈ నేలపైన మనమంతా ప్రతి గ్రామానికో గ్రంథాలయాన్ని పునరుద్ధరించుకోవాల్సిన అవసరం చాలా ఉంది. ఆ దిశగా మనం నడుం బిగించాలి.

మనమంతా మార్కెట్ సంస్కృతిని పెంచే వస్తువులను కాకుండా, ఆలోచనలను మార్చే మంచి సాహిత్యాన్ని కానుకలుగా ఇచ్చే సంప్రదాయం మొదలుబెడితే సమాజానికి చాలా మేలు జరుగుతుందని అనిపిస్తుంది. మంచి ఆలోచనలు, మనుషులు చేసే చైతన్యపూరితమైన కృషితోనే మనం సమాజాన్ని మార్చగలం అనే విషయం మనకు చరిత్ర గతిని చూస్తే అర్థమవుతుంది. వీ

*తమిళనాటి నుంచి వచ్చి తెలుగు నేర్చుకోవడమే కాక అద్భుతమైన సాహిత్యాన్ని సృజించిన శారద కష్టభరిత జీవితాన్ని, అమూల్యమైన రచనలను ప్రతి ఒక్కరూ తెలుసుకోవాల్సిన, చదవాల్సిన అవసరం ఉందంటున్నారు* **ఎ. స్నేహలత**

# జీవిత వాస్తవాల శారద

ఇపుడిప్పుడే సాహిత్యాన్ని చదువుతున్న దాన్ని. నన్ను చదివించిన ప్రతి పుస్తకం నుండి సంతోషాన్నో, దుఃఖాన్నో అనుభవించాను. ఇంతకు ముందే 'సాహిత్య బాటసారి శారద' చదివాను. శారద బతుకు బాట నన్నెంతో కుదిపేసింది. కన్నీటి చుక్కనైపోయాను. గబగబా శారద రచనలు చదవడం మొదలుపెట్టాను. శారద జీవితం, రచనలు నాలో ఎంత చెక్కు చెదరని ముద్ర వేశాయో మొన్నటి నా తెనాలి ప్రయాణం వరకు గాని తెలియదు. తెనాలి స్టేషన్‌లో దిగిన నాకు చప్పున శారదే గుర్తొచ్చాడు. ఇది శారద ఊరు కదూ! అని నా మనసు, కళ్లు ఆ తెనాలిలో ప్రతి చోటా శారదని వెతికాయి. ఆ గాఢానుభూతే ఇది రాసేలా చేసింది.

శారదని చదివి ఏం తెలుసుకున్నానో తెలియదు. కానీ ఇన్నాళ్లు శారదని తెలుసుకోనందుకు, చూడనందుకు దుఃఖం కలిగింది. నిజంగా శారదని చూపించిన మిత్రులని మరువలేను.

శారద పరాయి రాష్ట్రం వాడనో, పరాయి భాష వాడనో ఒక క్షణం కూడా అనిపించనంతగా తెలుగును నేర్చుకున్నాడు. తెలుగును చదివాడు, తెలుగులో అద్భుతమైన సాహిత్యాన్ని రచించాడు. శారద ఉన్న చోటు పట్లా, భాష పట్లా కనబరిచిన శ్రద్ధా, ఆసక్తి వెలకట్టలేనివి.

రాష్ట్రాలు దాటొచ్చినా కడుపు కాలక తప్పదనీ, ఆకలి కేకలూ తప్పవన్నాడు. ప్రేమ, హింస సున్నిత హృదయాన్ని ఎంతగా కదిలిస్తాయో, కుదిపేస్తాయో అనుభవించాడు. ఇంతటి సంక్షోభకరమైన జీవితాలకి సమాజం నిర్ణయించిన నీతి, నియమం, మంచీ, చెడులూ కనీసమైన భద్రతని కలిగించలేవన్న నిజాన్ని నిర్భయంగానే చూపించాడు.

ప్రకృతిలో పుట్టి పెరిగిన మనిషి తోటి మనిషిని మనిషైనందుకే ప్రేమించిన దశనీ, కాలాన్నీ, స్థితినీ మార్చేసిన విలువలు ఎట్లా పుట్టుకొచ్చాయి. ఇలాంటి విలువలనే మోస్తున్న సమాజంలో తెలిసో, తెలియకో చేసే పొరపాట్లకు, తప్పులకు ఒక మనిషి పట్ల, మరో మనిషి చేసే నిర్ణయం ఎలా అంతులేని ఆవేదనని మిగిలిస్తుందో? మనిషినెట్లా అదృశ్యం చేస్తుందో శారద చిత్రించాడు. అంతేనా? బంధాలనీ, ఉద్వేగాలనీ ఎంతగా ఛిన్నాభిన్నం చేస్తాయో ఎవరికెవరం ఏమీ కాకుండా ఏమైపోతామో కళ్లకు కట్టాడు. అందుకే శారదవి ఒట్టిగా, కథలనీ, నవలలనీ అనలేం.

ఒక అసత్యానికి బలైపోయిన పార్వతి చావు 'ఏది సత్యం' అని ప్రశ్నిస్తే, బద్దలైపోయిన, బండబారిపోయిన బతుకులతో పద్మ, సరోజినీలు పెద్దల నిర్ణయాల్లోని 'మంచీ చెడూ'లని నిలదీశారు.

మరోపక్క వసంతం ఆకలి రగిలించిన 'అపస్వరాన్ని' వినిపించ కుండానే తనువుని చాలిస్తోంది. ఇలా ప్రతీ నవలలోను శారద స్త్రీ జీవితాలన్నీ హృదయ విదారకంగా నిలిచాయి. కడుపు నింపని, స్వేచ్ఛనివ్వని నీతి, రీతి లోకంలో నడుస్తున్నంత కాలం శారద స్త్రీ పాత్రలన్నీ సజీవంగానే ఉంటాయి.

మనిషి లోపలి పొరల్లోని అసంతృప్తులో? అవహేళనలో? భయమో? భక్తో? ఆడంబరమో? అతిశయమో? నాదేననే భావమో? నాది కాదేమోననే అభద్రతో? ప్రతీది కావాలనే కాంక్షో? దక్కదేమోననే ఈర్ష్యో? మనిషినెంత అతలాకుతలం చేస్తాయో అద్దంలా చూపించాడు. ఈనాటి వ్యాపార సంస్కృతిలో పెరిగిపోయిన విధ్వంసానికి, శారద రచనలు మరింత అద్దం పడుతున్నాయి.

శారద రచనల్లోని ప్రతిపాత్ర అభద్రత, ఆకలీ నిండిన కళ్లలో, ప్రేమనీ, మోహాన్నీ, ఉత్సాహాన్నీ, ఉద్రేకాన్నీ మరచిపోయి నైరాశ్యంలో కొట్టుకుపోవడాన్ని చూస్తాం. ఆకలి, అవసరం మనిషిలోని సుగుణాలని, సున్నితత్వాన్ని చంపేయడాన్నీ చూస్తాం.

నటరాజన్‌గా హోటల్ చాకిరీలో మగ్గిపోయాడు. మజ్జిగమ్మాడు. బజ్జీలమ్మాడు. దారిద్ర్యంలోనే బతుకీడ్చాడు. ఆకలితో, అనారోగ్యంతో కాలం వెంబడి పరిగెత్తాడు. వ్యసనాలొచ్చి చేరాయి. ఏ అవస్థలోనూ తన గమ్యాన్ని విడిచిపెట్టలేదు. సాహిత్య శ్రమలో మునిగితేలాడు. నటరాజన్‌గా కడుపేదరికంలో కొట్టుకుపోతూనే శారదగా సాహిత్య పూలు చల్లాడు. అవి యుగాలైనా వాడిపోని, చెదిరిపోని పూలు. ఆరు దశాబ్దాల తర్వాత కూడా ఇదిగో ఇలా మనల్ని పలకరిస్తూనే ఉన్నాయి. ఆర్ద్రంగా, ఆత్రంగా సమాజం వైపు చూస్తూనే ఉన్నాయి. వీ

వీక్షణంకు ఉత్తరాలు రాసేవాళ్లు, మనీఆర్డర్లు పంపేవాళ్లు తమ వివరాలను పూర్తిగా రాయవలసిందిగా కోరుతున్నాం. అలాంటి వివరాలు లేనందువల్ల ఉత్తరాలకు జవాబు రాయడంగాని, మనీ ఆర్డర్ల మేరకు పుస్తకాలు, పత్రికలు పంపడం గాని వీలు కావడం లేదు.

**- వై. రామచంద్రం (సర్క్యులేషన్ మేనేజర్) 9949 391028**

Email : yatelliram@gmail.com

*తనకు ప్రేరణనిచ్చిన నవలలోని స్త్రీపాత్ర చిత్రణ, ఆమె త్యాగం, కష్టభరిత జీవిత గాథ తనపై వేసిన గాఢమైన ప్రభావాన్ని పంచుకుంటున్నారు* **ఎస్. జీవన్‌కుమార్**

# నాకు నచ్చిన నవల స్కార్లెట్ లెటర్

నన్ను బాగా ప్రభావితం చేసిన నవల అమెరికన్ నవలాకారుడు నథానియెల్ హాథోర్న్ రచించిన 'స్కార్‌లెట్ లెటర్'. నేను ఎం.ఎ.లో పాఠ్యాంశంగా చదివిన తర్వాత, ఈ నవలను డిగ్రీ విద్యార్థులకు సి.కె.ఎం. కాలేజీ (వరంగల్) లో బోధించే అవకాశం లభించింది. చాలా కథల్లో, నవలల్లో స్త్రీని ప్రేమమూర్తిగా, త్యాగశీలిగా దయామణిగా చిత్రించడం చూసాం. కాని నథానియెల్ హాథోర్న్ ఈ నవలలో చిత్రించిన, సమాజంలో పతితగా ముద్ర పడ్డ స్త్రీ హెస్టర్ పెన్నిని చూస్తే మనకు అంతులేని గౌరవం, పూజ్యభావం కలుగుతాయి. ఆమె హిమాలయాల కన్న ఎత్తైన స్త్రీమూర్తిగా మనం భావిస్తాం.

అమెరికాలోని న్యూ ఇంగ్లండ్ (ఇప్పటి మసాచుసెట్స్) రాష్ట్రంలోని ఒక గ్రామం ఈ కథకు కేంద్రం. కథకాలం పదిహేడవ శతాబ్దం. అది అన్ని గ్రామాల్లాంటి ఒక గ్రామం. ఆరోజుల్లో క్రైస్తవ మతం పూర్తిగా సమాజాన్ని శాసిస్తుండేది. నేరము, నేరానికి శిక్ష, పాపము, పాప పరిహారం పూర్తిగా క్రైస్తవ డాక్ట్రిన్ ప్రకారమే అమలు అవుతుండేది.

ఆ గ్రామంలో ఒకరోజు మధ్యాహ్నం ప్రజలంతా ఊరి మధ్యలోని న్యాయాన్ని చెప్పే గద్దె దగ్గర సమావేశమవుతారు. ఊరి జైలు లోంచి చెడిపోయిన ఆడది, పతిత నేరం మోపబడ్డ హెస్టర్ పెన్ని అనే స్త్రీ తన చేతుల్లో అప్పుడే జన్మించిన ఒక ఆడశిశువును ఉంచుకొని బయటకు వస్తుంది. అక్రమంగా శిశువుకు జన్మనిచ్చినందుకు ఆరోజు ఆమెను విచారించి శిక్షవేయాలి. రెండు సంవత్సరాల క్రితం ఆమె యూరప్ నుండి ఈ ఊరు వచ్చింది. తర్వాత భర్త వస్తాడని చెప్పింది. కాని ఆయన రాలేదు, బహుశా సముద్రయానంలో మరణించి ఉండవచ్చని అందరూ అనుకున్నారు. భర్త లేకుండా శిశువును కన్న నేరానికి ఆమెను, దీనికి కారకుడైన పురుషుణ్ని విచారించి ఇద్దరికీ శిక్ష విధించవలసి ఉంది. అందుకే చాలా ఆసక్తితో అందరూ ఆ ఊరి మధ్యలో గుమిగూడుతారు. పూర్తి విచారణ జరగకముందే అక్కడి ఆచారం ప్రకారంగా ఆమె మెడలో 'ఎ' అన్న స్కార్లెట్ లెటర్ వేలాడదీసారు. ఇంగ్లిష్‌లో అడల్ట్రీ (పతిత) అన్న పదంలోని మొదటి అక్షరం ఆ గుర్తు. ఆ పాపని గుండెలకు హత్తుకుంటూ తన మెడలో ఉన్న స్కార్లెట్ లెటర్‌ను చూసుకుంటూ, సిగ్గుతో తలవంచుకొని అందరి ముందు నిలబడుతుంది. ప్రజలందరి సమక్షంలో విచారణ చేస్తారు. ఆ గుంపులోంచి ఒక కొత్త వ్యక్తి హెస్టర్ వైపు ఆశ్చర్యంగా చూస్తూ 'అసలీమే ఏం నేరం చేసింది?' అని పక్క వ్యక్తిని అడుగుతాడు. 'ఈమె వివాహిత స్త్రీ, భర్త దగ్గర లేకున్నా తప్పుడు మార్గంలో శిశువును కన్నది. అందుకు ఆమెకు శిక్ష వేస్తారు' అని ఆ పక్క వ్యక్తి అంటాడు. 'అయితే అందుకు కారకుడైన పురుషుణ్ని ఏం చేయరా?' అని అడుగుతాడు. 'ఆమె ఆ వ్యక్తి ఎవరో చెప్తే ఆయనను కూడా శిక్షిస్తారు' అని ఆ గ్రామస్తుడంటాడు. కాని హెస్టర్ తనను ఈ స్థితికి నెట్టిన పురుషుడి పేరు చెప్పదు. మతగురువు గద్దించి అడిగినా కూడా ససేమిరా చెప్పదు. హెస్టర్ అకస్మాత్తుగా ఆ గుంపులో ఉన్న కొత్త వ్యక్తిని చూసి చకితురాలౌతుంది. ఆ వ్యక్తి కూడా తన పెదాలపై వేలు పెట్టి వద్దనట్టు సంజ్ఞ చేసి మాయమవుతాడు. హెస్టర్‌కి శిక్ష ఖరారై జైలుకు వెళుతుంది. ఆ కొత్తగా వచ్చిన వ్యక్తి, తన పేరు రోజర్ అని, తాను వైద్యుడనని చెప్పుకొని గ్రామంలో వైద్యుడుగా చలామణి అవుతుంటాడు. ఒకరోజు జబ్బు పడ్డ హెస్టర్‌కు వైద్యం చేయాలనే నెపంతో డాక్టర్ రోజర్ జైలులోకి వెళ్లి హెస్టర్‌ను కలుస్తాడు. నిజానికి అతడు హెస్టర్ భర్త. భార్యను ముందు పడవలో ఎక్కించి, తను ఆలస్యంగా బయలుదేరతాడు. రెండేళ్లు దారితప్పి కష్టాలు పడి సముద్ర ప్రయాణం చేసి చివరకు హెస్టర్ చేసిన నేరాన్ని విచారించే రోజు గ్రామం చేరతాడు. తన భార్యను ఆ స్థితిలో చూసి హృదయం ముక్కలవుతుంది. దీనికంతా తను ఆమెతో రాకుండా ఉండడమే కారణమని బాధపడతాడు. జైలులో ఎంత ఒత్తిడి చేసినా ఆమెను ఈ పరిస్థితికి తెచ్చిన వ్యక్తి పేరు చెప్పడానికి హెస్టర్ ఒప్పుకోదు. వాళ్లిద్దరు భార్యా భర్తలన్న విషయం ఎట్టి పరిస్థితి లోనూ గ్రామంలో తెలియకూడదని ఆయన నుంచి మాట తీసుకుంటుంది. రోజర్ మాత్రం కోపంతో, పగతో రగిలిపోతుంటాడు. తన భార్యకు ఇంత అన్యాయం చేసి తన సంసారంలో నిప్పులు పోసిన ఆ వ్యక్తిని కనుక్కొని శిక్షించాలని నిర్ణయించుకుంటాడు.

ఆ ఊరి మత గురువు ఆర్థర్ డిమ్స్‌డౌన్ గ్రామంలో బాగా మర్యాద పొందే వ్యక్తి. ఆయన చర్చ్‌లో చేసే మత బోధనలు, ఇచ్చే ఉపన్యాసాలు ప్రజలు చాలా భక్తి భావంతో వింటూ, ఆయనను దాదాపు దైవ సమానుడుగా గౌరవిస్తుంటారు. ఆయన ఆరోగ్యం ఏదో తెలియని కారణంచే క్షీణిస్తూ ఉంటుంది. డాక్టర్ రోజర్‌ను ఆయనకు ప్రత్యేక వైద్యుడుగా గ్రామస్తులు నియమిస్తారు. మత గురువు ఆర్థర్, డాక్టర్ రోజర్ దగ్గరి స్నేహితులవుతారు. ఆర్థర్ దేహ పరిస్థితి క్షుణ్ణంగా ప్రతిరోజూ పరిక్షించే రోజర్‌కు ఆయనకు భౌతిక రుగ్మతలు లేవని, ఏదో తీవ్రమైన మానసిక వ్యథతో కృశించి పోతున్నాడని అర్థం అవుతుంది. మూడేళ్ల శిక్ష తర్వాత హెస్టర్, తన పాప పెరల్‌తో బయటకు వచ్చి ఊరికి దూరంగా చిన్న గుడిసె నిర్మించుకుని జీవనం మొదలు పెడుతుంది. ఆమె బట్టలపై స్కార్లెట్ లెటర్ మాత్రం అట్లాగే ఉంటుంది.

ఊరి వాళ్లకు బట్టలు కుట్టిచ్చి పొట్ట పోసుకుంటుంది. గ్రామంలో రోగులకు సేవచేయడం, ఆపదలో ఉన్న వాళ్లను ఆదుకోవడం, వృద్ధులను, పిల్లలను అక్కున చేర్చుకొని సపర్యలు చేయడం ఆమె పనిగా పెట్టుకుంటుంది. ఏ రాత్రైనా, పగలైనా, భయంకరమైన వాతావరణ పరిస్థితుల్లో ఉంటూ అందరికి తలలో నాలుకగా మెసులుతుంటుంది. ఆమె సేవాతత్పరత చూసి ప్రజలు ఆమె మెడలో ఉన్న స్కార్లెట్ లెటర్‌ను మర్చిపోతారు. పెరుగుతున్న పాప పెరల్ కూడా శిశువుగా ఉన్నప్పటి నుంచి చూస్తున్న ఆ గుర్తు తన తల్లి శరీరంలో భాగం అనుకుంటుంది. భర్త ఉండి కూడా తన పాపకు ఆయన గురించి చెప్పకుండా, తాను కూడా అతనితో అపరిచిత వ్యక్తిగా మసులుకుంటూ ఉంటుంది.

దాదాపు ఆరు సంవత్సరాల తర్వాత డాక్టర్ రోజర్ మత గురువు ఆర్థర్ తన భార్యను మోసం చేసిన వ్యక్తి అని గ్రహిస్తాడు. ఈ విషయం హెస్టర్‌కు చెప్పి ఆర్థర్‌పై ప్రతీకారం తీసుకుంటానంటాడు. కాని హెస్టర్ మాత్రం ఎట్టి పరిస్థితిలో మతగురువుపై కసి, ప్రతీకారం గురించి ఆలోచించకూడదని వేడుకొంటుంది. రోజర్ మాత్రం తన వైద్య పద్ధతుల ద్వారా రకరకాల మార్గంలో మతగురువును క్షోభకు గురిచేస్తూ ఉంటాడు. ఊర్లో ప్రజలు హెస్టర్ సేవను ఆదరించినా ఆమె కళంకిత కాబట్టి కూతురు పెరల్‌ను తల్లి సాంగత్యంలో ఉంచకుండా తల్లికి దూరంగా ఉంచడానికి ప్రయత్నిస్తారు. కాని మతగురువు ఆర్థర్ మటుకు తల్లి బిడ్డలను విడదీయకుండా సకల ప్రయత్నాలు చేస్తుంటాడు. కాలం గడిచిన కొద్దీ, ఆర్థర్ ఆరోగ్యం క్రమక్రమంగా క్షీణిస్తుంది. మానసిక వ్యథతో అఖాతంలోకి కృంగిపోతుంటాడు. రోజర్ తన మాటలతో, చేష్టలతో ఆర్థర్‌ను హింసిస్తుంటాడు. ఒకనాడు అకస్మాత్తుగా గ్రామ కూడలిలో ఆర్థర్, హెస్టర్‌ను కలుస్తాడు. తనవల్ల జన్మించిన కూతురును దగ్గరకు తీసుకుంటాడు. తాను చేసిన పాపాల్ని అదే కూడలిలో నిల్చొని ప్రజల మధ్య ప్రకటిస్తానంటాడు. కాని హెస్టర్ ఒప్పుకోదు. ఈ వెలి నుంచి, ఈ మనుష్యుల నుంచి దూరంగా పారిపోదామంటుంది. నాలుగు రోజుల తర్వాత బయలుదేరే ఓడలో గ్రామం విడిచి పారిపోదామనుకుంటారు. మతగురువు సరే అంటాడు. రోజర్ పగ తీవ్రత హెస్టర్‌కు బాగా తెలుసు. తన భర్త ఎట్లైనా ఆర్థర్‌ను చంపుతాడు. తన పతనానికి కారణమైన వ్యక్తిని చంపడం హెస్టర్‌కు ఇష్టం ఉండదు. అందుకే గ్రామం నుంచి పారిపోవడానికి ఆర్థర్‌ను ఒప్పిస్తుంది. కాని ఆర్థర్ మాత్రం తాను చేసిన పాపంతో దహించుకపోతుంటాడు. రోజు రోజుకు కృంగిపోయి జీవచ్ఛంలా తయారవుతాడు. ఒకసారి గ్రామంలో జరిగే ఎన్నికల రోజు గ్రామపెద్దలు, ప్రజలు అంతా కూడలిలో కలుస్తారు. అక్కడ చేరిన గుంపులో హెస్టర్, ఆమె కూతురు కూడా ఉంటుంది. గద్దె మీద నిల్చుని ఉపన్యసిస్తున్న ఆర్థర్ కిందికి దిగి వాళ్లిద్దర్నీ పైకి తీసుకొచ్చి, జనం ఆశ్చర్యంగా చూస్తుండగా, హెస్టర్‌కు వేసిన శిక్షకు కారకుడు తనే అని ప్రకటిస్తాడు. ఏడేళ్ల క్రితం ఇదే స్త్రీ పక్కన నిలబడి నేరస్తుడిగా ఉండవలసిన తను, ఈ గొప్ప స్త్రీ వల్ల తప్పించుకుని తిరుగుతున్నాను అంటాడు. తాను చేసిన పాపాన్ని దేవుడు క్షమిస్తే హాయిగా మరణిస్తానంటాడు. తాను ప్రజల్ని మభ్యపెట్టి, ఈ స్త్రీ వల్ల గౌరవమైన వ్యక్తిగా బతుకుతున్నా దేవుడు తనను కనిపెడ్తూనే ఉన్నాడంటూ, కోపంతో తన కోటును చింపి కిందకూలిపోతాడు. ఆయన ఛాతి చర్మంపై స్కార్లెట్ లెటర్ చూసి ప్రజలు ఆశ్చర్యపోతారు. జీవితంలో పగ తీర్చుకోవడమే తన లక్ష్యంగా పెట్టుకున్న డాక్టర్ రోజర్, మతగురువు మరణించడంతో, తన లక్ష్యం చేజారిపోయిందని, తన జీవితం అర్థరహితమైపోయిందని మానసికంగా కృంగి కొద్దిరోజుల తర్వాత మరణిస్తాడు.

హెస్టర్ మాత్రం ఇవన్నీ జరిగినా ప్రజలకు సేవ చేస్తూనే ఉంటుంది. కూతురు పెరల్‌కు ఇదంతా ఏమీ అర్థం కాదు. తన తల్లి మెడలో ఉన్న స్కార్లెట్ లెటర్ ఆమె శరీరంలో భాగంగానే భావిస్తుంది. కష్టాల్లో ఉన్న ప్రజలు, రోగులు మాలిన్యానికి చిహ్నమయిన ఆ స్కార్లెట్ లెటర్ తమ పాలిట ఆత్మబంధువుగా భావిస్తుంటారు. ప్రజలు ఆమె పాపాన్ని మరిచిపోయి ఆమెను ప్రేమమూర్తిగానే చూస్తుంటారు. స్కార్లెట్ లెటర్ మాత్రం ఆమె మరణించే వరకు ఆమెను అంటి పెట్టుకునే ఉంటుంది. తల్లి మరణం తర్వాత పెరల్ అదే గ్రామంలో నివసిస్తూ ఉంటుంది.

ఈ నవలలో హెస్టర్ పాత్ర పాఠకుల్ని కలచివేస్తుంది. కోపం, కసితో రగిలిపోవలసిన ఆమె మంచితనం, ఉదారత్వం మనలాంటి మామూలు మనుషులు అర్థం చేసుకోవడం కష్టం అవుతుంది. ఈ నవల చదివిన తర్వాత స్త్రీ పట్ల ఉండే గౌరవం నాకు వంద రెట్లు రెట్టింపు అయింది. బాలగోపాల్ జీవిత త్యాగం గురించి మాట్లాడుతూ 'రాజకీయ విశ్వాసాల కోసం, సామాజిక గమ్యం వైపు పయనించే దిశలో నిబద్ధతతో ప్రాణత్యాగాలు చేసే వారుంటారు. కాని సమాజంలో ఒక స్త్రీ మాత్రమే ఏ ఐడియాలజీ కోసం కాకుండా, ఏమీ స్వార్థం లేకుండా తన జీవితమంతా త్యాగం చేస్తుంది' అంటాడు.

అన్యాయానికి గురై సమాజంలో వెలివేయబడ్డ స్త్రీ మూర్తి హెస్టర్ పెన్నిలో కూడా ఇదే కనబడుతుంది.

**వచ్చే సంచికలలో...**

- ఫోకస్ - ఫిబ్రవరి 2010 : ఆంధ్రప్రదేశ్ ఖనిజ సంపద ఎవరి బొక్కసాలకు?
- ఫోకస్ - మార్చ్ 2010 : చిన్న రాష్ట్రాలు - అభివృద్ధి
- తిరోగమన దిశలో నేటి ప్రజా జీవనం - విద్యాభూషణ్
- రిజర్వేషన్‌లపై చిత్తశుద్ధి లేని ప్రభుత్వాలు - ఆస శ్రీరాములు
- పాలస్తీనా పోరాటం - చారిత్రక నేపథ్యం - కె. నరేంద్రమోహన్
- చిన్న రాష్ట్రాలు అభివృద్ధి నిరోధకాలా? డా. జి. లచ్చయ్య

*మనుషులు పుస్తకాలు ఎందుకు చదువుతారో, పుస్తక పఠనం ద్వారా ఏ గ్రహిస్తారో, తన అనుభవం ద్వారా వివరిస్తున్నారు* **ఎన్. వేణుగోపాల్**

# పుస్తకాలు చదవడం ఎందుకు?

**జీ**వితంలో చాల సులభంగా కనబడేవి నిజానికి చాల కష్టం. 'చదవవలసిన' లేదా 'ప్రభావితం చేసిన పుస్తకం/పుస్తకాలు' అని చెప్పడం అటువంటి సులభంగా కనబడే కష్టమైన పనుల్లో ఒకటి. ఎంత తక్కువ పుస్తకాలు చదివేవాళ్లయినా, విద్యార్జనలో భాగంగా చదివే పాఠ్యపుస్తకాలు కాక ఇతర పుస్తకాలు కొన్ని డజన్లయినా చదివి ఉంటారు. వాటిలో ఏదో ఒకటో, ఏవో కొన్నో వాళ్లను ప్రభావితం చేసి ఉంటాయి. ఆ పుస్తకాలలో ఒకటి రెండయినా అందరూ చదివితే బావుండునని అనిపించి ఉంటాయి. ఇక దొరికిన పుస్తకమల్లా చదివేవాళ్లకయితే ఇలాంటి జాబితాలో కొన్ని డజన్ల, వందల పుస్తకాలూ ఉండవచ్చు. చదవకపోయినా, ఎప్పటికయినా చదవవలసిన పుస్తకాల జాబితా కూడ ఎవరికయినా ఉండవచ్చు.

నా వరకు నాకు చదవవలసిన, ప్రభావితం చేసిన పుస్తకాల గురించి చెప్పడం చాల కష్టంగా ఉంటుంది. ఏదో ఒక పుస్తకం దగ్గర ఆలోచన ఆపేసి, దాని గురించి రాద్దామనుకుంటే మరో పుస్తకం అంతకన్న గట్టిగా పోటీ పడుతుంది. ఒక రంగంలోని పుస్తకం గురించి చెపుదామనుకుంటే మరొక రంగంలోని పుస్తకం అంతకన్న బలమైనదనిపిస్తుంది. అలాంటి పుస్తకాల గురించి చెప్పడం కన్న ముందు అసలు మనుషులు పుస్తకాలు ఎందుకు చదువుతారు, ఎందుకు చదవాలి, పుస్తక పఠనం మనిషికి ఏమిస్తుంది, పుస్తకాలు ఎలా చదవాలి, పుస్తకపఠనం జీవితంలో ఎందుకు పనికొస్తుంది లాంటి ప్రశ్నల గురించి చర్చించాలనిపిస్తోంది.

అసలు మనిషి జీవితంలోకి, అనుభవంలోకి పుస్తకం ఎలా వచ్చింది?

మనిషి ఎప్పుడూ ఒంటరి జీవి కాదు. ఆహారానికీ, ఆశ్రయానికీ, వినోదానికీ, విజ్ఞానానికీ మనిషి ఇతరుల మీద ఆధారపడవలసిందే. సంఘ జీవితంలో మాత్రమే మనిషికి ఉత్పత్తి, పంపిణీ, మారకం, వినియోగం సాధ్యమవుతాయి. అంటే ఇతర మానవులతో సంబంధాలు లేకుండా మనిషికి మనుగడే లేదు. మరి ఆ మానవసంబంధాలు ఏర్పడాలన్నా, పెంపొందాలన్నా పరస్పరం సహకరించుకోవడం, సంభాషించుకోవడం అవసరం. ఆ అవసరాన్ని సైగల కన్నా ఎక్కువగా తీర్చగలిగినది భాష. భావ వినిమయానికి, ఆచరణలో సహకారానికి అవసరమైనది భాష. మానవసమూహాలు స్థలంలోనూ, కాలంలోనూ వేరయి ఉన్నప్పుడు ఆ భాష, కేవలం తక్షణ ప్రయోజనకరంగా మాత్రమే కాక, దీర్ఘకాలికంగానూ, అన్నిస్థలాలలోనూ ఉపయోగకరమయినదిగా ఉండాలి. అంటే భాష మౌఖికంగా మాత్రమే కాక లిఖితంగా ఉండాలి. అలాంటి లిఖిత వ్యక్తీకరణల అభివృద్ధి ఫలితంగానే పుస్తకాలు రూపు దిద్దుకున్నాయి. అలా మనిషి ఆలోచనలు, ఆచరణలు అన్నీ పుస్తకరూపం ధరించాయి. వేల ఏళ్లుగా సమాజంలో అనేక దృక్పథాల, అనేక ప్రాంతాల, అనేక భాషల, అనేక సంస్కృతుల, అనేక అనుభవాల మనుషుల వ్యక్తీకరణలన్నీ పుస్తకాలలో ఉన్నాయి.

ప్రకృతి గురించీ, సమాజం గురించీ, మనిషి గురించీ మనిషికి ఏర్పడిన భావాలు, భయాలు, అనుమానాలు, ఆనందాలు, ఊహలు, ప్రయోగాలు, ప్రయోగ ఫలితాలు, వాదనలు, ప్రతివాదనలు అన్నీ పుస్తకాలలో నిక్షిప్తమయి ఉన్నాయి. అంటే వేల సంవత్సరాల మనిషి మనుగడ ఆనవాళ్లన్నీ అరకొరగానైనా, ఆనాటి స్థలకాల పరిమితుల తోనైనా అక్షరాలలో, పుస్తకాలలో మిగిలి ఉన్నాయి. అందుకే పుస్తకం చదవడమంటే సారాంశంలో మనిషిని చదవడమే. తమ గురించి తాము ఎక్కువగా తెలుసుకోవడానికే మనుషులు పుస్తకాలు చదువుతారు. పుస్తకాలు చదవడం ద్వారా తోటి మనుషుల గురించి, ఆ మనుషులను ఆవరించి ఉన్న ప్రకృతి గురించి అప్పటివరకూ తమకు తెలిసి ఉండని అవగాహనలను మనుషులు గ్రహించగలుగుతారు. లేదా తెలిసిన అవగాహనకు మార్పులూ చేర్పులూ చేసుకోగలుగుతారు.

అంటే ప్రతి పుస్తకమూ పఠిత చైతన్యాన్ని ఉన్నతీకరిస్తుంది. ఒక పుస్తకం చదవకముందరి మనిషికీ, చదివినతర్వాత మనిషికీ తప్పనిసరిగా తేడా ఉంటుంది. ఒక విషయాన్ని గ్రహించడంలో, ఆ విషయంలోని లోతులు తెలుసుకోవడంలో, తద్వారా, అసలు ఏవిషయాన్నయినా గ్రహించగల పరికరాలు సంపాదించడంలో మనుషులకు పుస్తకాలు ఎంతగానో సహాయపడతాయి. నిజానికి ఇటువంటి జ్ఞానం అక్షరం ద్వారాకన్న, ఆచరణద్వారా ఇంకా బలంగా అందుతుంది. కాని, ఇవాళ్టి సమాజంలో ప్రతి ఒక్క మనిషికీ మౌలిక ఆచరణ ఉండే అవకాశం లేదు గనుక, ఇతరుల ఆచరణ గురించిన జ్ఞానాన్ని పుస్తకాల ద్వారా పొందడానికి ప్రయత్నించక తప్పదు. 'జ్ఞానం అంటే క్రమానుగతంగా అజ్ఞానాన్ని గుర్తించడమే' అని విల్ డ్యూరాంట్ అన్నాడు. మనిషి జ్ఞాన సముపార్జనా క్రమం ముందుకు సాగుతున్నకొద్దీ, ప్రతి కొత్త జ్ఞానమూ ఆ మనిషికి అప్పటిదాకా ఆ విషయంలో అజ్ఞానం ఉన్నదని తెలుపు తుందన్నమాట. అలాగే ప్రతి పుస్తకమూ పఠితకు అప్పటికి తెలియని

విషయాన్ని తెలుపుతుంది. అంటే అప్పటిదాకా ఆ విషయం తెలియదని తెలుపుతుంది.

పుస్తక పఠనం అవగాహనను పెంచడం మాత్రమే కాదు, గొప్ప ఆనందాన్ని కూడ ఇస్తుంది. అందుకే పుస్తకాలు చదవడం అలవాటయిన వాళ్లు ఒక వ్యసనం లాగ పుస్తకాలు చదువుతారు. అది కేవలం జ్ఞానదాహం మాత్రమే కాదు, అది ఇతోధిక ఆనందం కోసం అన్వేషణ కూడ. అది ఒక తీరని దాహం.

అయితే మన సమాజంలో పుస్తకపఠనం గురించి గుర్తించవలసిన విషయాలు కొన్ని ఉన్నాయి. మొట్టమొదటిది మన విద్యావిధానంలోనే పుస్తకపఠనానికి ఉండవలసినంత ప్రాముఖ్యత లేదు. పాఠ్య పుస్తకాలు కాక ఇతర పుస్తకాలు చదవాలని విద్యార్థులను ప్రోత్సహించడంలేదు. సగం జనాభా నిరక్షరాస్యులుగా ఉండి, అక్షరాస్యులయిన వారిని కూడ పుస్తకపఠనం వైపు ప్రోత్సహించకుండా ఉన్నప్పుడు సమాజంలో పుస్తకపఠన సంస్కృతి విస్తరించే అవకాశం తక్కువ.

రెండవది, మన సమాజంలో అతి తక్కువగా ఉన్న కొనుగోలుశక్తి వల్ల, చదవదలచిన వారికి కూడ పుస్తకాలు కొనుక్కోవడం సాధ్యంకాని విలాసంలా ఉంటుంది. ప్రభుత్వ గ్రంథాలయాలు నానాటికీ శిథిల మవుతూ, నిధుల కొరతను ఎదుర్కొంటున్న దశలో చదవదలచిన వారికి గ్రంథాలయాల సహకారం కూడ లేదు.

మూడవది, చదవదలచినవారికి, చదవాలనే ఆసక్తి ఉన్నవారికి కూడ ఏమి చదవాలో, ఎట్లా చదవాలో చెప్పే, మార్గదర్శకత్వం వహించే సంప్రదాయం ఉండవలసినంతగా లేదు. సమాజపురోగమనం మీద ఆసక్తి ఉన్నవారు తప్పనిసరిగా చదవవలసిన పుస్తకాల జాబితా, అందరూ ఆమోదించే జాబితా లేదు. అసలు కొన్ని పుస్తకాలు మార్గదర్శకత్వం లేకుండా, వివరణ లేకుండా అర్థం కావడం కూడ కష్టం. అటువంటి మార్గదర్శకత్వం, వివరణలు కూడ అందుబాటులో ఉండడం లేదు. ఒకప్పుడు విస్తృతంగా ఉండిన స్టడీ సర్కిల్, సామూహిక అధ్యయనం, వివరణ వ్యాసాల సంప్రదాయం కూడ తగ్గిపోతోంది.

ఆ సమస్యలను అలా ఉంచినా చదవదలచిన వారికి, అవకాశాలు ఉన్నవారికి కూడ మరొక అవరోధం పుస్తకాల సంఖ్య. ఎంత కష్టపడినా, ఇవాళ్టి వేగవంతమైన జీవనశైలిలో రోజుకు ఒక పుస్తకం మాత్రమే చదవడం సాధ్యమవుతుంది. (యుద్ధాలు చేస్తూ, యుద్ధానికి నాయకత్వం వహిస్తూ, యుద్ధ శకటంలోనో, ఓడలోనో కూచుని నెపోలియన్ రోజుకు పది పుస్తకాలు కూడ చదివేసే వాడని జీవితచరిత్ర రాసిన ఎమిల్ లుడ్విగ్ రాశాడు. అది అసాధారణ పఠనశైలి కావచ్చు. బ్రిటిష్ లైబ్రరీలో మార్క్స్ చదివిన పుస్తకాలు, ఆయన రాసుకున్న నోట్స్ చూస్తే ఒక మనిషి అన్ని రంగాల పుస్తకాలు అంతపెద్ద సంఖ్యలో చదవడం, వాటన్నిటినీ జీర్ణం చెసుకుని మళ్లీ తన రచనలలో భాగం చేయడం సాధ్యమా అనిపిస్తుంది.) మనం ఈ భూమి మీదికి రాకముందే కొన్ని లక్షల చదవవలసిన మంచి పుస్తకాలు వెలువడి ఉంటాయి. ఒక మనిషి సగటున అరవై ఏళ్లు బతికితే, పదో ఏట చదువు మొదలుపెట్టి రోజుకో పుస్తకం చదివినా జీవితం మొత్తం మీద పద్దెనిమిదివేల పుస్తకాలకన్న ఎక్కువ చదవడం సాధ్యం కాదు. నిజానికి ఆ మనిషి జీవితకాలంలోనే కనీసం ఇంకొక వెయ్యి మంచి పుస్తకాలయినా వెలువడే ఉంటాయి.

కనుక ఎంత ప్రయత్నించినా ఒక మనిషి ప్రపంచంలోని మంచి పుస్తకాలన్నీ చదవడం కష్టసాధ్యం మాత్రమే కాదు, అసాధ్యం. అందులోనూ చాలమందికి పుస్తకపఠనం ప్రణాళికాబద్ధంగా సాగదు. చదవదలచుకున్న పుస్తకం అందుబాటులో ఉండదు. దొరికి పుస్తకం చదవకతప్పదు. ఎవరయినా పుస్తకాలు చదవడం ప్రారంభించిన తొలిరోజుల్లో దొరికిన పుస్తకమల్లా చదివే అలవాటు చేసుకుంటే మంచిది. అలా కొంతకాలం చదువుతూ పోగా, కొన్ని పుస్తకాలు పూర్తిగా చదవకుండానే ఏమి చెప్పదలచుకున్నాయో అర్థమయిపోతుంది. కొన్ని పుస్తకాలు మాత్రం అక్షరం అక్షరం చదివినా ఇంకా ఏదో ఉందని అనిపించేలా ఉంటాయి. కొన్ని పుస్తకాలు హృదయాన్ని స్పృశించి పులకలెత్తిస్తే, మరి కొన్ని ఒళ్లు గగుర్పొడిచేంత వ్యతిరేకత కలిగిస్తాయి. కొన్ని పుస్తకాలు చదివిన తర్వాత దశాబ్దాలకు కూడ గుర్తు ఉంటే, మరికొన్ని చదివిన మరుక్షణం మరపుకు వస్తాయి. కొన్ని పుస్తకాలు ఒక వయసులో, ఒక మనఃస్థితిలో, ఒక వాతవరణంలో నచ్చినట్టు, ప్రభావితం చేసినట్టు అనిపిస్తాయి గాని, ఆ వయసు, మనఃస్థితి, వాతావరణం మారగానే వాటికేమీ విలువలేదనిపిస్తుంది. ఒకప్పుడు తలకిందులుచేసి, సమ్మోహపరచిన పుస్తకం మరొకప్పుడు పరమచెత్త అనిపిస్తుంది. ఒకప్పుడు అబ్బురపరచి ఇక దీన్ని మించిన పుస్తకం లేదనిపించే పుస్తకం మరొకప్పుడు చాల సాదాగా అనిపిస్తుంది. మొత్తం మీద ఒక పుస్తకం నచ్చడానికీ, ప్రభావితం చేయడానికీ, ఆ ప్రభావం దీర్ఘకాలికం కావడానికి, అది చదవవలసిన పుస్తకం అని నలుగురికీ చెప్పాలనిపించడానికీ ఆ పుస్తకంలోని విషయం మాత్రమేకాక, స్థలకాలాలు, నేపథ్యం, మనఃస్థితి, పఠిత చైతన్యస్థాయి వంటి ఎన్నో కోణాలుంటాయి. ఈ కోణాల్లో ఏ ఒక్కటి ఏమాత్రం మారినా ఆ పుస్తకం ప్రభావం యథాతథంగా ఉంటుందనడానికి వీలులేదు. అంతమాత్రమే కాదు, పాఠకులమీద పుస్తకాలు వేసే ప్రభావాలు ఎప్పుడూ ప్రత్యక్షంగా, నేరుగా, సరళరేఖలాగ ఉంటాయని చెప్పడం కూడ కుదరదు. అసలు అర్థం కాకుండానే ప్రభావం వేసినట్టనిపించే పుస్తకాలూ ఉండవచ్చు. చదివిన ప్రతిసారీ కొత్త అర్థాలు ఇస్తూ పొరలుపొరలుగా జీవితాన్ని ఉన్నతీకరిస్తూ ప్రభావితం చేసే పుస్తకాలూ ఉండవచ్చు.

ఈ నేపథ్యంలో, పుస్తకాల ప్రభావం గురించి, చదవవలసిన పుస్తకాల గురించి నా అనుభవం నుంచి గ్రహించిన విషయాలు కొన్ని పంచుకోదలిచాను. ఇదేదో నా గురించి చెప్పుకోవడానికి కాదు. పుస్తకాలకూ మనిషికీ ఉండే సంబంధం గురించి నా జీవితం ద్వారా నాకు తెలిసిన విషయాలు నలుగురికీ పనికి వస్తాయనే ఆశతో మాత్రమే.

పుస్తకం పట్ల, అచ్చు అక్షరం పట్ల నా వెర్రి వ్యామోహం నాకు తెలిసి ఆరో ఏట మొదలయింది. నిజానికి అంతకన్న ముందే పుస్తకాల మధ్యనే, చదివే వాతావరణం మధ్యనే నేను కళ్లు తెరిచాను. మా బాపు కుటుంబ ఆర్థికపరిస్థితి కారణంగా పెద్దగా చదువుకోకపోయినా, పద్నాలుగో ఏటినుంచే ఊళ్లవెంటబడి తిరుగుతూ ఉద్యోగాలు చేసినా స్వయంకృషితో పురాణాలన్నీ చదివాడు. కూతురూ కొడుకూ పుట్టిన ప్రతి సందర్భంలోనూ ఆయన చేసిన పని ఆ జ్ఞాపకంగా ఒక పుస్తకం – చాల ఎక్కువగా వాల్మీకి రామాయణం వావిలికొలను సుబ్బారావు అనువాద సంపుటాలు – కొనిపెట్టడం. అట్లా నాకు ఊహ తెలిసేటప్పటికి

మా ఇంట్లో పెద్ద సందుగనిండా భారత, భాగవత, రామాయణాలు, మరెన్నో గ్రంథాలు ఉన్నాయి. మా బాపు సాహిత్యాసక్తికి తోడయినది మా అమ్మ సాహిత్యాసక్తి. ఆమె స్వయంగా పెద్దగా చదువుకోకపోయినా చదివించుకుని వినేది. నిజానికి మా అమ్మవైపు కుటుంబమే ఆధునిక భావాలకు, సాహిత్యానికి పాదు. అట్లా నేను పుట్టేటప్పటికే, మా ఇంట్లోకి ప్రాచీన, ఆధునిక సాహిత్యాలు ప్రవేశించి ఉన్నాయి.

నా ఆరో ఏట అప్పుడే ఒక వారపత్రికలో సీరియల్ గా ముగిసిపోయిన ఆరెకపూడి కౌసల్యాదేవి నవల ప్రేమనగర్ కలిపికుట్టిన పుస్తకం మా ఇంట్లోకి వచ్చింది. ప్రేమ అంటే, ఎడబాటు అంటే ఏమిటో తెలుసుకోలేని ఆ వయసులో ఆ నవల చదువుతూ హీరోయిన్ కష్టాలకు భోరుభోరున ఏడవడం నాకు గుర్తున్న మొట్టమొదటి సాహిత్య ప్రభావం. సాహిత్య రుచి బహుశా నాకప్పుడే దొరికింది. ఇప్పటికీ చాల పుస్తకాలు చదువుతూ నేను ఏడుస్తాను. పుస్తకం చదివేటప్పుడు సాధారణంగా నాలోని విమర్శకుడిని పక్కనపెట్టి పుస్తకంలో లీనం కావడానికి ప్రయత్నిస్తాను. కనుకనే నేను చాల తీవ్రంగా విమర్శించిన పుస్తకాలలో కూడ నన్ను కదిలించిన, నన్ను ప్రభావితం చేసిన సన్నివేశాలు, భావాలు, ఉద్వేగాలు, చిత్రణలు ఉంటాయి.

పుస్తకాల ప్రభావం మారుతుందని చూపడానికి ఉదాహరణలు ఇక్కడ చెప్పాలి. లేతవయసులో చాల గాఢమైన ప్రభావం వేసిన రెండు పుస్తకాలను కొన్ని సంవత్సరాల తర్వాత మళ్లీ చదివితే అందులో ఒకటి చాల మామూలుగా అనిపించింది. మరొకటి పూర్తిగా వ్యతిరేకమైన ఉద్వేగాల్ని కలిగించింది. మొదటిది ఒక గేయాల పుస్తకం. ఏడో ఏటనో, ఎనిమిదో ఏటనో ఆ పుస్తకం చదివి దాన్ని వదలలేకపోయాను. ఆ పుస్తకం అడిగి తెచ్చుకుని ఆ గేయాలన్నీ కంఠతా పట్టాను. దాన్ని కవిత్వం అంటారని, ఆ ప్రక్రియకు గొప్ప ప్రేరక, ఉత్తేజదాయక శక్తి ఉందని అప్పుడే తెలిసింది. కొన్నేళ్ల తర్వాత చదివితే ఆ పుస్తకం మళ్లీ అటువంటి ఉద్వేగాల్ని ప్రేరేపించలేకపోయింది.

ఇక మరొకటి, దాదాపు ఆ వయసులోనే చదివిన, ముందూ వెనుకా కొన్ని పేజీలు చినిగిపోయిన జై సోమనాథ్ నవల. భారతీయ విద్యాభవన్ నిర్మాత, సంఘ పరివార్ సిద్ధాంతకర్త కె ఎం మున్షీ రాసిన ఆ నవల మూడు నాలుగు వందల పేజీలు ఒక్క ఊపున చదివేశాను. బ్రాహ్మణ కుటుంబ వాతావరణంలోని విలువలకూ, ఆ నవలలోని మతోన్మాదానికీ పొత్తు కుదిరినందువల్లనే ఆ నవల నన్ను ప్రభావితం చేసి ఉంటుంది. కొన్ని సంవత్సరాల తర్వాత చదివితే ఆ నవల ఎంత విషాన్ని ఎంత కళాత్మకమైన పంచదారపూతతో పాఠకులకు అందించిందో అర్థమయింది.

నా పఠనాసక్తిని చూసి మా బాపు నన్ను ప్రాచీన సాహిత్యంలోకి మళ్లించాలనుకున్నాడు. ఏకంగా రామాయణం చదవమన్నాడు. నా పదో ఏట ప్రతిరోజూ పొద్దున్నే స్నానం చేసి ఉత్తరకాండ పద్యాలు మొదలుపెట్టేవాణ్ని. ఆ సమాసభరితమైన తెలుగు ఏమీ అర్థమయ్యేది కాదు గాని వృత్తాలనడక, పదజాలం, గంభీరమైన భాష స్పష్టాస్పష్టంగా నా మనసులోకి ప్రవేశించాయి.

ఏ పుస్తకం నుంచయినా నేర్చుకునేది ఎంతోకొంత ఉంటుందని, ఒక్కోసారి ప్రతికూల, పరోక్ష ప్రభావాల ద్వారా కూడ పుస్తకాలు మనిషి అవగాహనను పెంచుతాయని చెప్పడానికి ఇవి చెపుతున్నాను. ఒక పుస్తకం మొత్తానికి మొత్తంగా కూడ ప్రభావం వేయలేకపోవచ్చు. కాని దానిలో ఏదో ఒక వాదన, ఏదో ఒక సన్నివేశం, ఏదో ఒక నిర్ధారణ, ఏదో వ్యక్తీకరణ, ఏదో ఒక పదబంధం, ఏదో ఒక ఖండిక మాత్రమే కూడ చెరగని ముద్రను వేయవచ్చు.

తర్వాత ఒకటి రెండు సంవత్సరాలు గడిచేసరికి విప్లవసాహిత్య పరిచయం, ముఖ్యంగా శివసాగర్ కవిత్వ ప్రభావం మొదలయ్యాయి. ఆ రోజుల్లో శివసాగర్ కవితా సంపుటి గెరిల్లా లోని గేయాలన్నీ నోటికి వచ్చేవి. అప్పటి నుంచి దాదాపు ఐదారు సంవత్సరాలు ప్రభావమంటే కవిత్వానిదే. ఆ తర్వాత ఇంటర్మీడియట్ తప్పి ఖాళీగా గడిపిన సంవత్సరకాలంలో చేతికి దొరికిన పుస్తకమల్లా చదువుతూ ఉన్నప్పుడు, లోతయిన ప్రభావం వేసినది రాహుల్ సాంకృత్యాయన్. చరిత్రనూ, కల్పననూ ఉద్వేగభరితమైన శైలిలో రాసిన రాహుల్జీ పుస్తకాలన్నీ సంపాదించి నమిలి పారేశాను. ఇక ఎక్కడ వ్యాసరచనలోనయినా, వక్తృత్వం లోనయినా, మామూలు మాటల్లోనయినా రాహుల్జీ ప్రస్తావన లేకుండా బండి నడిచేది కాదు. ఏ విషయాన్నయినా చారిత్రక దృష్టితో చూడాలని ఆ రచనలనుంచే తెలుసుకున్నాను. నా రాహుల్ సాంకృత్యాయన్ వ్యామోహం చూసి, వరవరరావు గారు 'ఎంగెల్స్ ను చదువు' అన్నారు.

అట్లా కుటుంబం, వ్యక్తిగత ఆస్తి, రాజ్యం పుట్టుక చదివితే లోకం కొత్తగా కనబడ్డట్టయింది. ప్రపంచాన్ని అర్థం చేసుకునే పనిముట్లు దొరికినట్టయింది. కవిత్వంలోంచి, నవలలోంచి, సృజనాత్మక సాహిత్య ప్రక్రియల్లోంచి సామాజిక శాస్త్రాల అధ్యయనంలోకి ప్రయాణం అట్లా ప్రారంభమయింది. రాజకీయార్థిక శాస్త్రం, తత్వశాస్త్రం, చరిత్ర, సామాజిక శాస్త్రం – వాటికి అవసరమైనమేరకు భౌతిక శాస్త్రాలు – వీటిలో ఏఒక్కరంగం తీసుకునా ఇప్పటికీ నా ఆలోచనలను నడిపే ప్రభావం చూపిన పుస్తకాలు ఎన్నో ఉన్నాయి. వాటిలో మార్క్స్ ఎకనామిక్ అండ్ ఫిలసాఫికల్ మాన్యుస్క్రిప్ట్స్ ఆఫ్ 1844, మార్క్స్ ఎంగెల్స్ ల జర్మన్ ఐడియాలజీ, లెనిన్ మెటీరియలిజం అండ్ ఎంపిరియో క్రిటిసిజం, మావో ఆన్ ప్రాక్టీస్, ఆన్ కాంట్రడిక్షన్ ముఖ్యమైనవి.

ఒక సాహిత్య పుస్తకమో, జీవిత చరిత్రో ఒక జీవితానుభవాన్ని, ఉద్వేగాన్ని తెలుసుకోవడానికి ఉపయోగపడతాయి గనుక అవి తప్పనిసరిగా ఉత్తేజకరంగా ఉంటాయి. కవిత్వం, కథ, నవల, నాటకం, జీవితచరిత్ర ఉత్తేజానికీ, ఒక మానసిక స్థితినుంచి బయటపడడానికీ పనికివస్తాయి. అలా చదవవలసిన పుస్తకాలు ఎన్నో ఉంటాయి. నావరకు నాకు ఒక అధఃపాతాళ మానసిక స్థితిలో ఉన్నప్పుడు నన్ను కాపాడిన పుస్తకంగా గూగీ నవల డెవిల్ ఆన్ ద క్రాస్ నిలబడుతుంది. అటువంటి మానసిక స్థితిలో ఎప్పుడయినా నన్ను ప్రభావితం చేసే, ఉత్తేజపరిచే సందర్భాలూ సన్నివేశాలూ నిండిన నవలలు ఆస్ట్రోవ్ స్కీ హౌ ద స్టీల్ వాజ్ టెంపర్డ్, రాబర్ట్ ట్రెస్సెల్ రాగ్డ్ ట్రౌజర్డ్ ఫిలాంత్రొపిస్ట్స్, జాక్ లండన్ ఐరన్ హీల్, గోర్కీ అమ్మ, మార్క్వెజ్ నవలలు కథలు, ఎడువార్డో గలియనో రాసిన డేస్ అండ్ నైట్స్ ఆఫ్ లవ్ అండ్ వార్, పాబ్లో నెరూడా, ఫైజ్ అహ్మద్ ఫైజ్, శ్రీశ్రీ కవిత్వం, కుటుంబరావు, రావిశాస్త్రి రచనలు...ఎన్నెన్నో. అలా జీవితాన్ని చిత్రించే సృజనాత్మక రచనలు

**పోరాటం తప్ప కార్మికులకు వారి బతుకులు బాగు చేసుకోవడానికి మార్గాంతరం లేని స్థితిని లోవేజ్ కాపిటలిజం పుస్తకంలో రచయిత ఫ్రెడ్ గోల్డ్‌స్టీన్ ప్రభావశీలంగా వ్యక్తంచేశారని, ఇది తప్పక చదవాల్సిన పుస్తకం అని అంటున్నారు ఇ.ఎస్. బ్రహ్మాచారి**

# తక్కువ వేతనాల కాపిటలిజం

గత మూడు దశాబ్దాల్లో అమెరికా కార్మికుల వేతనాలు ఎలా తగ్గుతూ వచ్చిందీ వివరించారు రచయిత. పెట్టుబడిదారులు పాలకుల సాయంతో ఎలా పట్టుదలతో సాధించిందీ, కార్మిక నాయకులు సైతం బాధ్యతల నుంచి ఎలా తప్పుకున్నదీ వివరించారు.

రష్యా,తూర్పు యూరప్ దేశాలూ పతనమయ్యాక పెట్టుబడిదారీ కార్పొరేషన్లకి దొరికే ప్రపంచ శ్రామిక శ్రేణులు రెట్టింపయ్యాయి. ఐ.ఎల్.ఓ అధ్యయనం ప్రకారం 1985 –2000 మధ్య ప్రపంచ కార్పొరేట్లకి 147 కోట్ల మంది శ్రామికులు అదనంగా దొరికారు. ఎలాగా? చైనా విదేశీ పెట్టుబడులకి తలుపులు తెరిచింది. రెండు, సోవియట్ రష్యా పడిపోయింది. మూడు, 1991లో భారత పెట్టుబడిదారీ వర్గం ఐ.ఎం.ఎఫ్.కి లొంగి విదేశీ పెట్టుబడిని స్వాగతించింది.

చైనా, భారతదేశం, పాత సోవియట్ యూనియన్, తూర్పు యూరప్ దేశాలు ద్వారాలు తెరిచాయి. దాంతో 147 కోట్ల మంది శ్రామికులు కొత్తగా దొరికారు. అప్పటికి ప్రపంచ పెట్టుబడిదారులకి 146 కోట్ల మంది శ్రామికులు అందుబాటులో ఉన్నారు. ఈ మూడు కొత్త ప్రాంతాల కలయికతో మార్కెట్‌లో పోటీ పడే శ్రామికులు రెండింతలయ్యారు. 2000లో ప్రపంచ కార్మికుల సంఖ్య 293 కోట్ల మంది. కార్మికుల సరఫరా పెరిగింది. దాంతో వేతనాలు తగ్గించే అవకాశం యజమానులకి కలిగింది. పారిశ్రామికదేశాల కార్మికులు వేతనాల విషయంలో వర్ధమానదేశాల శ్రామికులతో పోటీ పడాల్సొచ్చింది.

ఉత్పత్తి రంగంలోనూ సమాచార రంగంలోనూ డిజిటల్ యుగం తెచ్చిన పెను సాంకేతిక మార్పుల్ని ఉపయోగించుకొని భారీ కార్పొరేషన్‌లు పెద్దజీతాల ఉద్యోగాల్ని నాశనం చేయగలిగాయి.

ప్రపంచీకరణ వల్ల కార్మికుల మధ్య పోటీ పెరిగింది. అప్పటికి పోటీ దేశంలోని శ్రామికుల మధ్య ఉండేది. అంటే ఉదాహరణకి అమెరికా కార్మికుడు ఇతర అమెరికా కార్మికులతో పోటీ పడాల్సివచ్చేది. వేతనాలు అమెరికా జీవన స్థితిగతులను బట్టి ఉండేవి. ప్రపంచీకరణ వేతనాల్లో మార్పు తెచ్చింది. అమెరికా ఉద్యోగి ఫిలిప్పైన్స్ శ్రామికులతో పోటీ పడాల్సొచ్చింది. పెట్టుబడికి రెక్కలొచ్చాయి. ఏదేశానికైనా ఎగిరిపోగలదు. ఎక్కడ వేతనాలు తక్కువయితే అక్కడకు అమెరికా కంపెనీలు వెళ్లిపోయాయి. ఇండియాలో శ్రామికునికి వచ్చే ఆదాయం 10వ వంతే.

---

కాక, అసలు జీవిత చలన సూత్రాలను విప్పిచెప్పే, ఆ సూత్రాలను అర్థం చేసుకునే పరికరాలు అందించే సిద్ధాంత పుస్తకాలు జ్ఞానద్వారాలు తెరుస్తాయి. ప్రతి పఠనం నుంచీ ఉత్తేజం పొందగల అవకాశాన్ని ఇస్తాయి. తత్వశాస్త్రం, రాజకీయార్థిక శాస్త్రం, చరిత్ర, సామాజికశాస్త్రాల నుంచి అటువంటి పుస్తకాలెన్నో ఉంటాయి.

ఇన్ని పుస్తకాల ప్రభావాలలోంచి విడదీసి, అన్నిటికన్నా నన్ను ఎక్కువ ప్రభావితం చేసిన పుస్తకం ఏదని అడిగితే చెప్పడం కష్టం గాని బహుశా అట్లా చెప్పగల ఏకైక పుస్తకం 'కన్యాశుల్కం'. ముప్పై ఐదేళ్లకింద మొదటిసారి చదివిన కన్యాశుల్కం ఇప్పటికి కొన్ని డజన్ల సార్లయినా చదివి ఉంటాను. ఎన్నో సంభాషణలు కంఠోపాఠం. ప్రతిరోజూ ఏదో ఒక సందర్భంలో కన్యాశుల్కం గుర్తొస్తూనే ఉంటుంది. నా మీద ఆ పుస్తకం ప్రభావం వల్ల అది ప్రతి సందర్భానికీ గుర్తొస్తుందా? లేక, గురజాడ దార్శనికత వంద సంవత్సరాల ఇవతలికి వ్యాపించిందా? రెండూ నిజమే కావచ్చు.

ఒక నిర్దిష్ట స్థలకాలాల్లో రాసిన పుస్తకం ఆ స్థలకాలాలు గడిచిపోయిన తర్వాత కూడ ప్రాసంగికతను కోల్పోకపోవడం దాని ప్రభావానికి గుర్తు. ఎవరో తమ సొంత వేదనను, వాదనను ప్రకటించుకున్న పుస్తకం నా వేదనకు, నా వాదనకు అక్షరాలు తొడిగినట్టనిపించడం ఆ పుస్తకం ప్రభావానికి గుర్తు. ఒక పుస్తకంలోని పాత్రలు, సంబంధాలు, సన్నివేశాలు, ఉద్వేగాలు, వ్యాఖ్యానాలు, వాదనలు, విశ్లేషణలు పాఠకుల నిజజీవితంలో చుట్టూ కనబడుతుండడం ఆ పుస్తకపు ప్రభావానికి గుర్తు. అంటే ఒక పుస్తకపఠనం ద్వారా మనిషిలో నిరంతర సంభాషణ రగుల్కొంటుంది. తాము చదివిన పుస్తకం, తమ చుట్టూ జీవితం నిరంతరం సంఘర్షిస్తూ, సరిపోల్చుకుంటూ సాగుతున్నప్పుడు మనుషులు ఆ ఐక్యత – ఘర్షణలలోంచే అవగాహనలను పెంచుకుంటారు. నైసర్గిక, సహజజీవిగా ఉన్న మనిషి సామాజికజీవిగా, ఉదాత్త మానవజీవిగా ఎదగడానికి సహకరించేది పుస్తకపఠనం.

*(ఈ వ్యాసానికి తొలిరూపం 2001 ఫిబ్రవరి 18న విజయవాడ పుస్తక మహోత్సవంలో చేయవలసి ఉండిన ప్రసంగ వ్యాసం. మిత్రుడు ఆజం అలీ హత్య వల్ల నేను ఆ సభకు హాజరు కాలేకపోగా, ఆ ప్రసంగభాగాలు నిర్వాహకులు చదివి వినిపించారు)* వీ

దేశ దేశాల నుంచీ ఉద్యోగాల కోసం అమెరికా చేరారు. అమెరికా కార్మికులు వీళ్లతో పోటీ పడాల్సి వచ్చింది. కంపెనీలు ఈ అవకాశాన్ని ఉపయోగించుకున్నాయి. జీతాలు తగ్గించాయి. గతంలో మాంద్యాలలో పోయిన ఉద్యోగాలు వికాసకాలాల్లో తిరిగి వచ్చేవి. ప్రపంచీకరణ, శాస్త్ర సాంకేతిక విప్లవం పరిస్థితుల్లో మార్పుతెచ్చాయి. 1981, 1991, 2001 మాంద్యాలలో పోయిన ఉద్యోగాలు వికాసకాలల్లో మళ్లీ రాలేదు. అంతేకాదు, గుంపు తొలగింపులు కొనసాగాయి. ప్రస్తుత మాంద్యంలో తొలగింపులు ప్రమాదస్థాయిలో ఉంటాయని రచయిత అభిప్రాయం. 1973 నుంచీ 1995 వరకూ స్టీల్ పరిశ్రమలో కార్మికుల సంఖ్య 6 లక్షల నుంచీ 1,80,000కు తగ్గింది. 1980–2005 మధ్య 2 కోట్లమంది ఇతర దేశస్తులు చట్ట ప్రకారమే అమెరికా చేరారు. ఇదే కాలంలో ఆన్‌డాక్యుమెంటెడ్ వర్కర్స్ 1 కోటీ 20 లక్షల మంది ప్రవేశించి ఉంటారని అంచనా.

2006లో ఇద్దరు పెద్దలూ, ఇద్దరు పిల్లలూ ఉన్న కుటుంబానికి ఏడాదికి ఆదాయం 20,444 డాలర్లకి తగ్గితే పేదరిక స్థాయి. అంటే ఒకరికి పూర్తి పని గంటకి 9.83 డాలర్‌లు వచ్చేది ఉండాలి. ఈ నిర్వచనం ప్రకారం అమెరికాలో 2006 లో 3 కోట్లా 65 లక్షల మంది పేదరికంలో ఉన్నారు. అంతే ఆదాయం అయితే ఏదో బతుకుతారంతే. జనరల్ మోటార్స్ ఫోర్డ్ క్రిజ్లర్ మూడూ 2008 మొదట్లో 70,000 యూనియన్ ఉద్యోగాలని తొలగిస్తున్నట్లు ప్రకటించింది. అంతేకాదు. అమెరికాలో 20 ప్లాంట్లు మూసేస్తానంది. వాటిని తక్కువ వేతనాలున్న దేశాలకు మళ్లిస్తానంది. మెక్సికోలో అసెంబ్లీ శ్రామికుడికి గంటకి 3.5 డాలర్లు. అదే డెట్రాయిట్‌లో 27 డాలర్లు.

డెల్ఫి, విస్ట్యాన్ ప్రపంచంలోనే అతిపెద్ద ఆటో విడిభాగాలు సరఫరా చేసే కంపెనీలు. డెల్ఫి అమెరికాలో దివాలా దాఖలు చేసింది. విదేశాలలో– మెక్సికో, చైనా లాంటి తక్కువ వేతన దేశాల్లో ఆ కంపెనీకి 1,15,000 మంది కార్మికులున్నారు. దాని లక్ష్యం అమెరికాలో శ్రామికుల వేతనాలు 27 డాలర్ల నుంచి 16.5 డాలర్లకు తగ్గించడం. అమెరికాలో ఉన్న 32,000 మందిని 7000కి కుదించడం. అంటే 25 వేల యూనియన్ ఉద్యోగాల్ని నాశానం చెయ్యడం.

2004 మే లో ఫొరెస్టర్ రిసెర్చ్ సంస్థ 2015 కల్లా 33 లక్షల వైట్ కాలర్ ఉద్యోగాలు విదేశాలకి వెళ్లిపోతాయని చెప్పింది. అంటే 13,600 కోట్ల డాలర్ల వేతనాలు అమెరికా నుంచి తక్కువ వేతన ప్రాంతాలకి వెళ్లిపోతాయి. అమెరికాలో ఒక కంప్యూటర్ ప్రోగ్రామర్‌కి గంటకి 60 డాలర్లిస్తే, ఇండియాలో 10 డాలర్లు చాలు అని ఆ సంస్థ చెప్పింది. ఒక నిర్వచనం ప్రకారం కీతావేతనం అంటే గంటకి 11.11 డాలర్లు, అంతకు తక్కువ. 2006లో అమెరికాలో అంతకు తక్కువ వచ్చే ఉద్యోగాలు 4 కోట్ల 40 లక్షలున్నాయి. 1973లో సగటు శ్రామికుని వారం వేతనం 581.67 డాలర్లు (2005 విలువలో). అక్కడనుంచి 1995 దాకా పడుతూ వచ్చింది. తిరిగి 2000 దాకా పెరిగి మళ్లీ పడిపోయింది. 2006 లో 543.65 డాలర్లకు పడింది. అంటే 30 ఏళ్లలో వారానికి 40 డాలర్లు తగ్గింది. దీన్ని బట్టి నూటికి 80 మందికి 7 శాతం వేతనం తగ్గింది.

1981లో రొనాల్డ్ రీగన్ అధ్యక్షుడయ్యాడు. యూనియన్లని దెబ్బ తీశాడు. యజమానుల ఇష్టారాజ్యం ఏర్పరిచాడు. పునర్ వ్యవస్థీకరణని అడ్డూ ఆపూ లేకుండా ప్రోత్సహించాడు. ఎయిర్ ట్రాఫిక్ కంట్రొలర్స్ యూనియన్‌ని విచ్చిన్నం చెయ్యడానికి సర్వశక్తులూ ఒడ్డాడు. తన ముందు అధ్యక్షుడు జిమ్మీ కార్టర్ పథకాన్ని సమర్థవంతంగా అమలు పరిచాడు. 11,400 మంది కార్మికుల్ని తొలగించాడు. వాళ్లని జీవితకాలం పాటు ప్రభుత్వోద్యోగాలకి అనర్హులుగా ప్రకటించాడు. పాలకవర్గాలకి పట్టు చిక్కింది. అవకాశాన్ని అందిపుచ్చుకున్నారు. జనరల్ ఎలక్ట్రిక్ పగ్గాలు పట్టిన జాక్ వెల్ఛ్ 72,000 మందిని తొలగించాడు. తర్వాత ఆర్‌సిఎని కొని అందులో ముందు 51,000 మందిని తర్వాత మరొక 31,000 మందిని తీసివేశాడు. అతన్ని అందరూ న్యూట్రాన్ జాక్ అనేవారు. (న్యూట్రాన్ బాంబ్‌లాగా చట్రాలలోనే ఉంచి జనాన్ని చంపడంలో నేర్పరి అని). 1980 రికవరీ కాలంలో గుంపు తొలగింపులు (మాస్ లేఆఫ్స్) నిరాటంకంగా కొనసాగాయి. ఒక్క ఆటో పరిశ్రమలోనే 35 ప్లాంట్లు మూసివేశారు. తర్వాతి 1990 మాంద్యంలోనూ, 2001 మాంద్యం లోనూ రెండు రికవరీల్లోనూ గుంపు తొలగింపుల జోరు తగ్గలేదు. వికాస కాలంలో కూడా ఉద్యోగాలు రద్దవుతున్నాయి. కార్మికుల కష్టాలు పెరుగుతూనే ఉన్నాయి

1997 యునైటెడ్ పార్సెల్ సర్విస్ శ్రామికులు సమ్మె చేశారు. 1,85,000 మందిలో నూటికి 60 మంది పార్ట్‌టైం వాళ్లు. వాళ్లకి గంటకి 9 డాలర్లు. అదే ఫుల్ టైం వాళ్లకి గంటకి 19.95 డాలర్లు. ఫుల్ టైం ఉద్యోగాలు డిమాండ్ చేశారు. పైగా 10,000 మంది పార్ట్ టైం వేతనమిస్తూ వారానికి 35 గంటలు పనిచేయిస్తున్నారు. సమ్మె బాగా జరిగింది. పెట్టుబడిదారులు బిల్ క్లింటన్ మీద ఒత్తిడి తెచ్చారు. ప్రభుత్వం సమ్మెని తొక్కివేసేందుకు సిద్ధమైంది. ఎఎఫ్ఎల్–సిఐఒ నాయకులు వెనక్కి తగ్గారు. శ్రామికులంతా సమర్థించిన సమ్మె క్రమంగా ముగిసింది. ఇందుకు రచయిత నాయకుల్ని తప్పుపట్టాడు.

కార్మిక పోరాటాలు తప్ప వేతనాలని నిలబెట్టుకునే మార్గం లేదని స్పష్టంగా పదే పదే చెబుతాడు. మార్క్సిస్టు అవగాహనతో రాసిన పుస్తకం ఇది. ఆయన రచనల నుంచి చాలా చోట్ల కోట్ చేశాడు. మొదలుపెడితే చివరి దాకా చకచకా సాగిపోతుంది. ఉద్యోగులూ, కార్మికులూ, మేధావులూ అందరూ తప్పక చదవాల్సిన పుస్తకం ఇది.

ఈపుస్తకాన్ని ఇంటర్నెట్‌లో ఈ అడ్రస్‌లో ఉచితంగా పొందవచ్చు:
http://www.lowwagecapitalism.com/Low-WageCapitalism-lores.pdf

వీక్షణం పత్రికను ప్రతి నెల 29–30 తేదీల్లో పోస్టు చేస్తాం. పత్రిక 7వ తేదీలోగా అందకపోతే మాకు తెలియపర్చండి. చందా రెన్యువల్ చేసుకున్న వారికే పత్రికను పంపించడం జరుగుతుంది.

*పోలీసు కాల్పులు, పరిసర గ్రామాల్లో మహిళలపై అత్యాచారాలు, పోలీసు, ప్రైవేట్ మూకల ముట్టడిలో ఉన్న నారాయణ్ పట్నాకు* **అఖిల భారత మహిళా నిజనిర్ధారణ బృందం** *వెళ్లి ఎదుర్కొన్న అనుభవాలు అక్కడి పరిస్థితికి అద్దం పడతాయి*

# నిర్బంధంలో నారాయణ్ పట్నా

ఒరిస్సాలోని కోరాపుట్ జిల్లాలోని నారాయణ్ పట్నాలో 20 నవంబర్ 2009న జరిగిన పోలీసు కాల్పులు, భలియాపుట్, బిక్రంపూర్, బసన్‌పుట్, పాలపుట్ గ్రామాల్లో ఆదివాసీ మహిళలపై జరిగిన అత్యాచార సంఘటనలను పరిశీలించడానికి అఖిల భారత మహిళా నిజనిర్ధారణ బృందం 9 డిసెంబర్ 2009న పార్వతీపురం నుండి ఉదయం 8.30 గంటలకు బయలుదేరింది. బృందంలోని పదకొండు మందిలో తొమ్మిది మంది మహిళలు కాగా, డ్రైవర్‌తో సహా ఇద్దరు పురుషులున్నారు. ఆ ప్రాంతాన్ని పరిశీలించడానికి అఖిల భారత మహిళా నిజనిర్ధారణ బృందం వస్తున్నట్లుగా 7 డిసెంబర్ 2009న కోరాపుట్ కలెక్టర్‌కు సమాచారం అందజేశాం. మేము ప్రయాణంలో ఉండగా నారాయణ్ పట్నా పోలీసు స్టేషన్ వద్ద పోలీసులు మమ్మల్ని ఆపారు. మా బృందంలోని సభ్యుల పేర్లు, చిరునామా, మొబైల్ నంబర్లు అక్కడ వారు అడిగిన వివరాలు తెలియజేశాం. డ్రైవర్ తన లైసెన్స్, ఇన్సూరెన్స్ కాగితాలు పోలీసులకు చూపాడు. పోలీస్ స్టేషన్ ఆవరణలో చాలామంది వ్యక్తులు సాధారణ దుస్తుల్లో ఉన్నారు. ఒకరిని అడగగా వారు ప్రత్యేక పోలీసు బలగాలకి చెందినవారని తెలిసింది. ఎవ్వరికీ యూనిఫాంలు లేవు. పేర్లను తెలియజేసే గుర్తింపు బిళ్లలు లేవు. వారిలో ఒకరిని అడిగితే ఆ ప్రాంతంలోని పోలీసు బలగాల సంఖ్య రెండు వందల మంది దాకా ఉందని తెలిసింది. మేము అక్కడ ఉన్నప్పుడు పోలీసు స్టేషన్ ఆవరణలో ఒక యాభై మంది దాకా (ఆదివాసులు) గ్రామస్తులు మోకాళ్లపై కూర్చొని కనిపించారు. వాళ్లంతా 'ఛాసీ ములియా ఆదివాసి సంఘ్' కు చెందినవారని, పోలీసులకు 'లొంగిపోయిన' వారని తెలిసింది.

స్టేషన్‌లో ఉన్న పోలీస్ అధికారిని కలిసే ప్రయత్నం చేయగా, పనిలో ఉన్నారని, సాయంత్రం కలుస్తారని చెప్పారు. అక్కడ సాధారణ దుస్తుల్లో ఉన్న పోలీసుల నుండి నెమ్మదిగా మాపై అసహనం వ్యక్తం కాసాగింది. వాళ్లలో కొంతమంది 'మా ఇళ్లు తగలబడినప్పుడు వీళ్లంతా ఎక్కడ ఉన్నారో, కాల్పులు జరిగేసరికల్లా వచ్చారు' అని అనసాగారు. కొంతమంది శత్రుపూరిత వ్యాఖ్యలు చేయడం మొదలుపెట్టారు.

ఈలోపు స్టేషన్ బయట రెండు వందల మందికి పైగా గుమిగూడారు. వారు చూడడానికి సాధారణ గ్రామస్తులలాగా గానీ, ఆదివాసులలాగా గానీ లేరు. 'మిమ్మల్ని, మీ వాహనాలని అక్కడున్న వాళ్లేమైనా చెయ్యవచ్చని, మాకు ఎటువంటి బాధ్యతా లేదని' అంటూ స్టేషన్‌లో పోలీసులు మమ్మల్ని హెచ్చరించారు. ఈ పరిస్థితిలో మేం వెనక్కి మళ్లిపోతామని చెప్పాం. మేం పోలీసుస్టేషన్ నుంచి బయటకు అడుగు పెట్టగానే అక్కడ ఉన్న మూక మమ్మల్ని చుట్టుముట్టింది. వాళ్లలో కొంతమంది వాహనం వెనక అద్దాన్ని పగులగొట్టారు. డ్రైవర్‌ను కదలనీయకుండా చుట్టుముట్టి, నానా దుర్భాషలాడి, ప్రశ్నలు వేసి బెదిరించారు. బృందంలోని మహిళలను చెప్పరాని భాషలో కించపరిచే మాటలు అన్నారు. సాధారణ దుస్తుల్లో అప్పటివరకు తన మొబైల్ ఫోన్‌తో ఫొటోలు తీస్తున్న పోలీసు 'వాళ్లని కొట్టండి' అని అరిచే సరికి, అక్కడ ఉన్న మూక మా మీదికి వచ్చింది. డ్రైవర్‌ను మళ్లీ మళ్లీ చెంప పగులగొట్టారు. మధుమిత, డెబ్బై అయిదేళ్ల కుసుమ్ కార్నిక్‌లు డ్రైవర్‌ను విడిపించడానికి వెళ్లబోతే ఒకరు మధుమిత పీక పట్టుకునే ప్రయత్నం చేశారు. ఆమె తనను తాను రక్షించుకునే క్రమంలో దవడకు గట్టిగా దెబ్బ తగిలింది. కుసుమ్ కూడా గాయపడింది.

పోలీసుస్టేషన్ లోపల రుమిత కుందూను ఒకతను తిట్టగా, మరొకతను 'ఈ ఆడవాళ్లంతా అక్కడ ఉన్న మగవాళ్లతో పడుకోవడానికి వచ్చార'న్నాడు. మమతాదాస్‌ను వీపు మీద కొట్టి, నానా దుర్భాషలాడారు. ఇవన్నీ కూడా పోలీసు బలగాల ముందు, పోలీసుస్టేషన్ బయటే జరిగాయి. ఈలోపు ఒక పోలీసు 'స్టేషన్ బయట ఉన్న పోలీసులందరిని లోపలకు రమ్మని, జనాన్ని ఇష్టమొచ్చింది చేసుకోనిమ్మని' అరిచాడు.

మా అందరిలోకల్లా డ్రైవర్ బాగా దెబ్బలు తిన్నాడు. అతన్ని పోలీసుల బారి నుంచి విడిపించి బండి ఎక్కించడానికి మేం అన్ని రకాలుగా ప్రయత్నించాం. బండికి నష్టం చేశారు. కిటికీ అద్దాలు పగులగొట్టారు. అతి కష్టం మీద మేం అక్కడి నుంచి బంధుగాంవ్ గ్రామం వైపు బయలుదేరాం. మమ్మల్ని మోటర్‌సైకిళ్లపై యువకులు అనుసరించారు. మళ్లీ బంధుగాంవ్ పోలీస్‌స్టేషన్‌కు ఆ గ్రామానికి మధ్యలో సాధారణ దుస్తుల్లో ఉన్న పోలీసులు మమ్మల్ని నిలిపివేశారు. డ్రైవర్ లైసెన్స్, బండి కాగితాలు గుంజుకున్నారు. తన కాగితాల కోసం బతిమిలాడుతుంటే, ఈలోపు ఇరవైమంది అక్కడ గుమిగూడారు. మేం ఎలాగో బండి కాగితాలు వెనక్కి తీసుకొని ముందుకు కదిలాం. మమ్మల్ని మోటర్‌సైకిళ్లపై అనుసరిస్తున్న యువకులు డ్రైవర్‌ను కిటికీ నుంచే మళ్లీ కొట్టారు. మేం అప్పటికే ఈ చేదు అనుభవాల పరంపరతో కంపించిపోయాం. షాక్‌కు గురయ్యాం.

అక్కడి నుంచి కట్టుల్‌పేట వైపు బయలుదేరాం. అక్కడకు చేరకముందే మేం వస్తున్నట్లు అక్కడి వారికి సమాచారం అందింది. ఎద్దుల బండిని అడ్డంగా నిలిపి రోడ్డును అప్పటికే మూసివేశారు. ఇక్కడ కూడా ఆదివాసేతరులే డ్రైవర్‌ను బయటకు లాగి దాడిచేశారు. మా బృందంలో ఉన్న మరొక పురుష సభ్యుడు పూర్ణచంద్ర సాహును కూడా బయటకు లాగి కొట్టే ప్రయత్నం చేశారు. మేం కల్పించుకొని

రక్షించడానికి ప్రయత్నిస్తున్నప్పుడు కుసుమ్ కార్నిక్‌కు దెబ్బలు తగిలాయి. ఆ దెబ్బలకు తలకు బొప్పి కట్టింది.

అక్కడ పదిహేను నిమిషాలకు పైగా ఈ పెనుగులాట జరిగింది. మేం ప్రయాణిస్తున్న వాహనానికి మరింత నష్టంచేశారు. డ్రైవర్‌ను మరిన్ని చెంపదెబ్బలు కొట్టారు. మాపై మరింత హింస జరిగింది. బండిని తగలబెడతామని బెదిరించారు.

ఈలోపు బంధుగాంవ్ గ్రామంలో మా పేర్లు తీసుకున్న సాధారణ దుస్తుల్లో ఉన్న 'పోలీసులు' అక్కడికి చేరుకొని అక్కడ ఉన్న గుంపును చెదరగొట్టారు. ఈ యువకులను ప్రత్యేక పోలీసు అధికార్లుగా (ఎస్.పి.ఒ.) నియమించారని తరువాత మాకు తెలిసింది.

మూడుచోట్ల ఆపి, మాపై దాడులకు పాల్పడిన యువకులు మమ్మల్ని ఆంధ్రప్రదేశ్ సరిహద్దుల దాకా వెంబడించారు. పోలీసులు ఈ సాధారణ దుస్తుల్లో ఉన్న యువకులతో ఫోన్‌లో సంభాషణలు జరుపుతూనే ఉన్నారు.

చివరకు మేం ఆంధ్రప్రదేశ్ సరిహద్దులోని బొండపల్లి గ్రామం చేరుకున్నాం. మేం అక్కడికి చేరిన కొద్దిసేపటికే ఒక జీపు నిండా ఆంధ్రా పోలీసులు, ఇంకో జీపు నిండా సాయుధ ప్రత్యేక పోలీసు బలగాలు వచ్చాయి. వాళ్లు మమ్మల్ని ఆపి మేము ఎవరమో చెప్పమన్నారు. మమ్మల్ని బాధితులుగా కాక, నేరస్తులలాగా చూడడమే కాకుండా, వాహనాన్ని తనిఖీ చేశారు. ఆ రోజు మొత్తంలో మేం మూడవసారి మా పేర్లు, చిరునామాలు, ఫోన్ నెంబర్ల వివరాలు అందజేశాం.

మా బృందంలోని మధుమిత విజయనగరం ఎస్.పి.తో మాట్లాడాకే వాళ్లు మమ్మల్ని అక్కడి నుంచి కదలనిచ్చారు. ఒరిస్సా పోలీసుల నుండి వారికి అందిన విశ్వసనీయ సమాచారంతో, ఆంధ్రలోకి అసాంఘిక శక్తులు ప్రవేశించాయనే సమాచారంతోనే తాము అలా వ్యవహరించామని అన్నారు.

మమ్మల్ని అనుసరించిన యువకులు, పోలీసులతో ఎదురైన అనుభవాలు మమ్మల్ని తీవ్ర ఆందోళనకు గురిచేశాయి. దేశ ప్రజాస్వామ్యం(?) పై, దాని పని విధానం పై అనేక ప్రశ్నలు ముసురు కున్నాయి. మా ఆవేదన అంతా ఒక అఖిల భారత మహిళా నిజనిర్ధారణ బృందమే ఇంతటి భయోత్పాతాన్నీ, హింసనూ, అవమానాన్నీ అదీ పోలీసుల సమక్షంలోనే ఎదుర్కోవాల్సి వస్తే నారాయణ్ పట్నాలోని ఆదివాసులు ఇంకా ఎటువంటి హింసను, నిత్య నిర్బంధాల్ని ఎదుర్కొంటున్నారో ఊహించుకోవచ్చు. ఆ ప్రాంతం మొత్తం పోలీసుల ముట్టడిలో ఉంది. ఈ సంఘటనతో అర్థమయే మరో అంశం 20 నవంబర్ 2009 ఘటనపై ప్రభుత్వం ఎటువంటి స్వతంత్ర నిజ నిర్ధారణలను అనుమతించదలచుకోలేదు. ఆ ప్రాంతంలో అనాదిగా ఆదివాసులు ఎదుర్కొంటున్న సమస్యలను బయటకు రానీయదలచు కోలేదు.

## ఆందోళన కలిగిస్తున్న అంశాలు

1. మేము చవిచూసిన భయ, భీతావహ పరిస్థితి 20 నవంబర్ 2009 నారాయణ్ పట్నా కాల్పుల తర్వాత ఆ ప్రాంతంలో నెలకొన్న ఉద్రిక్త పరిస్థితిని చెప్పకనే తెలియచెబుతోంది.

2. నారాయణ్ పట్నా ప్రాంతంలోని ప్రజలు బయటకు రావడానికి, పోవడానికి వీలులేని దిగ్బంధంలో ఉన్నారు. పోలీసులు, వారి కనుసన్నలలో నడిచే కిరాయి మూకలతో దారులన్నీ మూసుకు పోయాయి. కిరాయి మూకలను అదుపు చేసే ఉద్దేశం పోలీసులకు లేదు.

3. ఆదివాసుల పట్ల జరుగుతున్న, దిగ్భ్రాంతికి గురిచేస్తున్న అనుచిత వ్యవహారం, అత్యాచారాలు, హింస గురించిన ఎటువంటి సమాచారం తెలిసే పరిస్థితి లేదు.

4. నారాయణ్ పట్నా పోలీసు స్టేషన్‌లో సాధారణ దుస్తుల్లో ఉండి పోలీసులమని చెప్పుకున్నవారు, పోలీసు స్టేషన్ వెలుపల చాలా స్వేచ్ఛగా, వెసులుబాటుతో పోలీసులతో సంభాషణలు జరుపుతున్నవారు, మమ్మల్ని కొట్టమని ఆదేశించగానే ముందుకు కదిలినవారు బయట సమాజానికి అందుతున్న నివేదికలు నిజమేనని నిర్ధారిస్తున్నారు. సల్వాజుడుం తరహాలో అక్కడ 'శాంతి సమితి' పనిచేస్తోంది. వారు పోలీసులతో, ప్రభుత్వంతో సన్నిహితంగా పనిచేస్తున్న వారో లేక ప్రభుత్వ పరోక్ష సహకారంతో పనిచేస్తున్నవారోనని అర్థమవుతోంది.

5. ప్రముఖులతో కూడిన ఒక మహిళా బృందమే ఇంతటి హింసను ఎదుర్కొంటే, గ్రామాలలో ఏ పాటి చిన్న అసమ్మతికి ఆస్కారం లేదని స్పష్టమవుతోంది.

6. మాపై దాడులకు పాల్పడ్డవారందరూ ఆదివాసీయేతరులే.

## మా డిమాండ్‌లు

1. నారాయణ్ పట్నా పోలీసు అధికారిని వెంటనే సస్పెండ్ చేయాలి.

2. మాపై వేర్వేరు చోట్ల దాడులకు పాల్పడిన మూకలకూ, పోలీసులకూ ఉన్న సంబంధాన్ని బయటపెట్టాలి.

3. నారాయణ్ పట్నాలోని పరిస్థితులను పరిశీలించడానికి వస్తున్న స్వతంత్ర బృందాలపై, స్థానిక ఆదివాసులపై అమలవుతున్న హింసను అమలు చేస్తున్న కోరాపుట్ ఎస్.పి. ని వెంటనే సస్పెండ్ చేయాలి.

4. అక్కడ పరిస్థితిని వెలికి తీయడానికి స్వతంత్ర నిజనిర్ధారణ బృందాలను అనుమతించాలి.

5. అక్కడ సాధారణ పరిస్థితులు నెలకొనడానికి ఆ ప్రాంత దిగ్బంధనాన్ని ఉపసంహరించాలి.

6. నారాయణ్ పట్నాలో జరిగిన కాల్పులపై, అక్కడి ఆదివాసుల సమస్యలపై ప్రభుత్వం వెంటనే ఒక స్వతంత్ర ఉన్నతస్థాయి విచారణను చేపట్టాలి.

ఈ పత్రికా ప్రకటనను ఇచ్చిన బృందంలోని సభ్యులు – సుధా భరద్వాజ్ (న్యాయవాది, పి.యు.సి.ఎల్., ఛత్తీస్‌గఢ్); మధుమిత దత్త (*ది అదర్ మీడియా, చెన్నై*); శ్వేతా నారాయణ్ (*ది అదర్ మీడియా, చెన్నై*); మమత దాస్, (*నేషనల్ ఫోరం ఫర్ ఫారెస్ట్ పీపుల్ అండ్ ఫారెస్ట్ వర్కర్స్, ఢిల్లీ*); దుర్గ (*ఛత్తీస్‌గఢ్ మహిళా అధికార్ మంచ్, ఛత్తీస్‌గఢ్*); ప్రమీల (*ముక్తిగామి మహిళా సంఘటన్, భువనేశ్వర్*); కుసుమ్ కార్నిక్ (*ఆదివాసి ఏక్‌జుటా సంఘటన, పూణె*); రుమిత కుందూ (*కాంపెయిన్ అగెనెస్ట్ వయలెన్స్ ఆన్ వుమెన్, ఒరిస్సా*); రమణి (*ప్రొగ్రెసివ్ ఆర్గనైజేషన్ ఆఫ్ వుమెన్, పార్వతీపురం*); పూర్ణచంద్ సాహు (*ఆల్ ఇండియా కిసాన్ మజ్దూర్ సంఘ్, పార్వతీపురం*).

*(తెలుగు అనువాదం : **డి.వి. రామకృష్ణారావు**)*

*గాంధేయవాది **హిమాంశు కుమార్** ఛత్తీస్‌గడ్‌లోని దంతేవాడలో పరిస్థితుల పై 31 అక్టోబర్ 2009న ముంబయిలోని ప్రెస్ క్లబ్‌లో చేసిన ప్రసంగం ఆధారంగా **జ్యోతి పున్వాని** రాసిన వ్యాసం*

# సమస్య మావోయిస్టులా? రాజ్యమా?

అసలైన భారతదేశం గ్రామాలలో ఉందని, వాటిని పునరుజ్జీవింప చెయ్యడానికి యువత అక్కడికి వెళ్లాలని అన్న గాంధీజీ మాటలు నమ్మినేను పదిహేడు సంవత్సరాల క్రితం దంతేవాడ వెళ్లాను. నా ఆశ్రమం నిర్మించుకోవడానికి గ్రామస్తులు నాకు భూమిచ్చారు. రాజ్యాంగంలోని 5వ షెడ్యూల్ ప్రకారం వారికి ఆ అధికారం ఉంది. ప్రభుత్వం ఈ సంవత్సరం వెయ్యిమంది పోలీసులను, ల్యాండ్‌మైన్ వాహనాలను పంపించి నా ఆశ్రమాన్ని కూలగొట్టించింది. నా ఇల్లు కూడా కూలగొట్ట బడవచ్చు అని, నేను కూడా వాళ్ల లాంటి వాడినేనని, ఆదివాసులు నన్ను పూర్తిగా నమ్మడం అప్పటి నుంచే మొదలయ్యింది.

దంతేవాడలో ఆదివాసులు ఆదిమ ప్రజల మాదిరిగా ప్రకృతికి అనుగుణంగా జీవించేవారే. సహజ న్యాయమే అక్కడ అమలులో ఉండేది. అడవులలో నేరాలు లేవు, పోలీసులు లేరు. నా పెళ్లయిన నెల రోజులకు నేను దంతేవాడ వెళ్లాను. నేను నా భార్యను ఐదారు రోజులు వదిలిపెట్టి మధ్యప్రదేశ్ అంతా తిరిగి వచ్చేవాడిని. నా భార్య ఎప్పుడూ భయపడలేదు.

దంతేవాడలోని మావోయిస్టులు ప్రమాదకరంగా మారారని 2005లో ఛత్తీస్‌గడ్ ప్రభుత్వం భావించింది. అది 'సల్వాజుడుం' ని ప్రారంభించింది. దీని అర్థం 'ఉమ్మడి శాంతి ఉద్యమం'. మావోయిస్టులకు ఆదివాసుల మద్దతు ఉందని వాళ్లకు తెలుసు. అందుకని గ్రామాలను ఖాళీ చేయించాలన్న నిర్ణయం తీసుకున్నారు. ప్రజలను బలవంతంగా వాళ్ల ఊళ్లనుంచి ఖాళీ చేయించి, పోలీస్‌స్టేషన్ల దగ్గర క్యాంపులలో చేర్చాలని ప్రయత్నించారు. దీనికి వాళ్లు కొంతమంది గూండాలను కూడగట్టుకుని, పోలీసులతోపాటు గ్రామం మీదికి వెళ్లి ప్రజల మీద దాడి చేసి క్యాంపులలో చేరమని బలవంతం చేసేవారు.

కానీ ఆదివాసులు ప్రకృతి మధ్య – వాగు పక్కన, కొండపైన – ఉండడానికి అలవాటు పడ్డారు. ఆదివాసులలో ఒక ఇంటికి మరో ఇంటికి ఎంతో దూరం ఉంటుంది. క్యాంపులలో ప్రభుత్వం నిర్మించిన షెడ్డులలో నుంచి బయటికి వస్తే ఇంకొకరికి ఇల్లు పక్కనే ఉంటుంది. నీ వెనక ఇంకో ఇల్లు ఉంటుంది. ఇటువంటి షెడ్లలో నుంచి ఆదివాసులు పారిపోవడానికి ప్రయత్నిస్తే ఈ 'దేశభక్తి' దళం వాళ్లపై కాల్పులు జరుపుతుంది. పట్టుకుని జైళ్లలో పెడుతుంది, అత్యాచారం చేస్తుంది.

ఒక దశలో ఈ క్యాంపులలో వెయ్యి గ్రామాల నుంచి 54,000 మంది ఆదివాసులు ఉన్నారు. 644 గ్రామాలను 'శుద్ధి' చేశామని ప్రభుత్వం ప్రకటించింది. క్యాంపుల నుంచి 50,000 మంది అడవులలోకి పారిపోయారు. అప్పుడు క్యాంపులలో ఉన్న వాళ్లు మా పక్షాన ఉన్నారని, పారిపోయిన వారు నక్సలైట్లతో ఉన్నారని ముఖ్యమంత్రి రమణ్‌సింగ్ ప్రకటన చేశారు.

ముఖ్యమంత్రికి నేను ఒక బహిరంగ లేఖ రాశాను – రాష్ట్రానికి ముఖ్యమంత్రి అయిన మీరు తమ ఇళ్లలో ఉండాలని నిర్ణయించుకున్న పౌరులను నక్సలైట్లని అంటున్నారు! వాళ్లని కాల్చి చంపని ఆదేశాలు ఇస్తారా? అతడు అదే చేశాడు. అదే గ్రామంపై మళ్లీ, మళ్లీ దాడులు చేయసాగారు. ఆదివాసులు తమ గ్రామాలకు తిరిగివచ్చి తమ భూములను సాగు చేసుకోవడానికి ప్రయత్నించే వారు. ప్రతిసారీ వాళ్లని పట్టుకొని తీవ్ర చిత్రహింసలు పెట్టేవారు. వాళ్ల పంటలను తగలబెట్టేవారు. ఇటువంటి పరిస్థితుల్లో ఆదివాసులకు మద్దతుగా నక్సలైట్లు నిలిచారు. అందుకే వాళ్లు నక్సలైట్లను తమ స్నేహితులుగా భావిస్తారు.

సల్వాజుడుం వర్గాలకు మందు, మాంసం, ఆడవాళ్లు కావాలి. రోజూ కావాలి. వీటిని ఆదివాసుల నుంచి బలవంతంగా తీసుకునే వాళ్లు. మనం దీనిని పట్టించుకోం. కానీ పోలీసులకు వ్యతిరేకంగా ఆదివాసులు లాఠీలు పట్టుకున్నప్పుడు మాత్రం మనం గగ్గోలు పెట్టేస్తాం.

మావోయిస్టుల హింస గురించి రాజ్యం మాట్లాడుతుంది. కాని రాజ్యమే హింసకు పాల్పడుతుంది. గృహశాఖ మంత్రి శాంతి గురించి మాట్లాడుతుంటారు. కానీ ఆదివాసులపై నిరంతర దాడులు చేస్తూ ఉంటే శాంతి ఎలా నెలకొంటుంది? అంతేకాకుండా మావోయిస్టులకు వాళ్ల హింసామార్గాన్ని వదిలిపెట్టమని నన్ను చెప్పమంటారు. ఇప్పుడు పరిస్థితి ఎంతగానో దిగజారిపోయి, బయట నుంచి వచ్చిన ఏ వ్యక్తినైనా ఆదివాసీలు శత్రువుగా పరిగణిస్తున్నారు. తోటి దేశస్తులనే ఆదివాసులు శత్రువుగా పరిగణించే పరిస్థితిని రాజ్యం సృష్టించింది.

పల్లె ప్రజలకు పునరావాసం కల్పించి, వారికి నష్టపరిహారం ఇవ్వమని ప్రభుత్వం ఆదేశించింది. ఒక్క గ్రామాన్నీ ఇప్పటివరకు తిరిగి నెలకొల్పలేదు; ఒక్క ఆదివాసీకి కూడ నష్టపరిహారం చెల్లించలేదు. సల్వాజుడుం నేపథ్యంలో దంతేవాడలోని పరిస్థితులను చూడమని జాతీయ మానవ హక్కుల సంఘాని (ఎన్‌ఎచ్‌ఆర్‌సి) కి సుప్రీంకోర్టు సూచనలు ఇచ్చింది. ఎన్‌ఎచ్‌ఆర్‌సి బృందాన్ని కలవడానికి మా కార్యకర్తలు దంతేవాడ నుంచి కొంతమంది ఆదివాసులను, ఆంధ్రప్రదేశ్‌కి పారిపోయిన కొంతమంది ఆదివాసులను తీసుకెళ్లారు. ఎన్‌ఎచ్‌ఆర్‌సి బృందాన్ని కలిసి తిరిగివస్తున్న నేంద్ర గ్రామస్తులను 11 జూన్‌న కొంతమంది సల్వాజుడుం సభ్యులు ఆపి కొట్టారు. ఎన్‌ఎచ్‌ఆర్‌సితో మాట్లాడడం నేరమా అని డైరెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్‌కి ఫోన్‌చేసి

అడిగాను. కానీ దానివల్ల ఏ ప్రయోజనమూ ఒనగూడలేదు. ఎన్‌ఎచ్‌ఆర్‌సి ముందు మాతో బలవంతంగా ప్రకటన చేయించారని ఒక కాగితం మీద గ్రామస్తులతో సంతకం పెట్టించుకున్నారు.

గాంధేయవాదిగా నాకు చాలా కోపం వచ్చింది. అధికారికంగా నియమింపబడిన నిజనిర్ధారణ కమిటీతో మాట్లాడినందుకు నా కళ్ల ముందే ప్రజలు దాడులకు గురవుతున్నారు. ఈ గ్రామం నుంచి మేం కదలబోవడం లేదన్న నిర్ణయాన్ని తీసుకున్నాం. ఊరినే తగలబెట్టాలను కుంటే ముందుగా నన్ను తగలబెట్టనివ్వండి. ఊరికి తిరిగి రమ్మని ఆదివాసులను కోరాం. ఊరి చుట్టూ జూలై 1న మానవహారం ఏర్పాటు చేశాం. నేంద్రాలో ఆరు నెలలపాటు ఉన్నాం. ఆంధ్రప్రదేశ్‌కి వెళ్లిపోయిన వాళ్లను తిరిగి గ్రామాలకు రమ్మని పిలవడానికి కార్యకర్తలను పంపించాం. తిరిగి వచ్చి, ఇక్కడ ఉండడానికి సిద్ధమైనందుకు వాళ్లని అభినందించాలి. మూడు సంవత్సరాల నుంచి వాళ్లు తమ భూములను దున్నుకోలేక పోయారు. వాళ్ల దగ్గర విత్తనాలు లేవు, పశువులు ఎప్పుడో పారిపోయాయి; వాళ్ల ఇళ్లను పలుమార్లు తగలబెట్టారు. వాళ్ల పునరావాసానికి మేం ఏర్పాట్లు చేశాం. ఆ విధంగా మొదటి గ్రామం పునరావాసం అయ్యింది. దీంతో చుట్టుపక్కల గ్రామస్తులు ధైర్యం కూడగట్టుకొని మా దగ్గరకు వచ్చారు. ఇదే ప్రయోగాన్ని మా కార్యకర్తలు తిరిగి అక్కడ అమలు చెయ్యసాగారు.

మా కార్యకర్తలు తోడుగా ఆదివాసులు తిరిగి గ్రామానికి వెళుతున్నారని తెలిసిన జిల్లా కలెక్టర్ నాకు ఫోన్ చేశాడు. ఆ రోజు శనివారం, సాయంత్రం 4.30 గంటలు. మరునాడు ఆదివారం, ప్రభుత్వ కార్యాలయాలు పనిచెయ్యవని అతడికి తెలుసు. ఎన్నికల పనిలో అన్ని బలగాలు నిమగ్నమై ఉన్నాయని, వాళ్లకి ఎటువంటి భద్రత కల్పించలేనని అతడు చెప్పాడు. భద్రత కావాలని నేనెప్పుడు కోరానని అతడిని ప్రశ్నించాను. రాజ్యాంగం ప్రకారం తమ ఇంటికి వెళ్లడాన్ని మీరు ఆపలేరు. వంతెన దగ్గరకు వచ్చేసరికి పోలీసులు వాళ్లని ఆపేశారు. ఆ వంతెనను పోలీసులు మూడేళ్లుగా దాటలేకపోయారు. నేను కలెక్టరుకి ఫోన్ చేశాను– ప్రజలు తమ ఊరికి తిరిగి వెళ్లడాన్ని అనుమతిస్తున్నారా, లేదా? మీరు అనుమతించకపోతే వాళ్లను సుప్రీంకోర్టుకు తీసికెళ్లి దాని ఆదేశాలను అమలు చెయ్యడాన్ని మీరు అడ్డుకుంటున్నారని చెబుతామని అన్నాను. ఆ రోజు సాయంత్రం అందరం వంతెన దాటాం. అయితే ప్రభుత్వం అంతటితో ఆగలేదు. వాళ్లు నా జీపుని జప్తు చేశారు. మేం కోర్టుకి వెళ్లి దానిని విడిపించుకోవలసి వచ్చింది. గ్రామస్తుల కోసం ఉద్దేశించిన ఆహారంలో సగం పోలీసులు తీసేసుకున్నారని తెలిసింది. ఈ రకంగా ప్రవర్తించిన పోలీసు బలగాలను ఎవరు కాపాడగలరు?

ఆదివాసులు తమ భూములను సాగుచేసుకోడానికి మరోసారి ప్రయత్నించారు. కాని పునరావాసం చెందిన గ్రామస్తులపై పోలీసులు మళ్లీ దాడులు మొదలుపెట్టారు. అయినా మేం మా ప్రయత్నాలు చేస్తూనే ఉన్నాం. ఇప్పుడు ఈ ముప్ఫై గ్రామాలలో శాంతి నెలకొని ఉంది. ఎవరైనా వెళ్లి వాటిని సందర్శించవచ్చు. దీనిని నమూనాగా, ఆదర్శంగా తీసుకొండని ప్రభుత్వానికి చెప్పాం. ప్రజలకు అక్కడ సౌకర్యంగా ఉంది కాబట్టి వాళ్లకి పోరాటాల పట్ల ఆసక్తి లేదు. కాని ప్రభుత్వం ఒకే ఒక ఉద్దేశంతో వాళ్లపై దాడులు చేస్తూనే ఉంది; వాళ్లు ఇళ్ల నుంచి పారిపోవాలి, అప్పుడు ప్రభుత్వం ఆ భూములను మైనింగ్ కోసం పరిశ్రమలకు అప్పగించవచ్చు.

ఆ సమయంలో ఆదివాసులు తమ యువకులు గ్రామాలను సల్వాజుడుం బలగాల నుంచి కాపాడుతారని నిర్ణయించుకున్నారు. లాఠీలు, వ్యవసాయ పరికరాలు, ఏది ఉంటే అది చేతపట్టుకుని గ్రామాలకు పహారా ఉండసాగారు. వాళ్లకి ఉన్న ఆహార ధాన్యాలను కొండలలో దాచుకోసాగారు. ఈ యువకులు ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఆయుధం చేపట్టారని, వీళ్లు నక్సలైట్లని గృహమంత్రి పి. చిదంబరం అంటున్నారు.

ప్రభుత్వానికి శాంతి అవసరం లేదు, దానికి భూమి కావాలి. దానికి ఎంత అహంకారమంటే, అది చేసిన తప్పులను ఒప్పుకోవడానికి సిద్ధంగా లేదు. అత్యాచారం, మనుషుల్ని ఎత్తుకుపోవడం, గృహదహనాలు వంటి సమస్యలపై వెయ్యి ఎఫ్.ఐ.ఆర్.లు నమోదు చెయ్యడానికి ప్రయత్నించాం. వాటిని నమోదు చేసుకోలేదు. అవి తప్పుడు ఫిర్యాదులు కాబట్టి వాటిని నమోదు చేసుకోమని సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్ (ఎస్.పి.) అన్నారు. ఫిర్యాదు ప్రత్యేకించి పోలీసులపై చేసినప్పుడు అది సరైందో, కాదో నిర్ణయించే అధికారం పోలీసులకు లేదని సుప్రీం కోర్టు చెబుతోంది.

పోలీసు స్టేషన్‌లో రెండు రోజులపాటు తన పైన సామూహిక అత్యాచారం జరిగిందన్న ఫిర్యాదుతో మా వద్దకు ఒక అమ్మాయి వచ్చింది. మా ఎఫ్.ఐ.ఆర్.ని ఎస్.పి. నమోదు చేసుకోలేదు. మేం సుప్రీంకోర్టుకి వెళ్లాం. రాష్ట్ర ప్రభుత్వాన్ని తన సమాధానం ఇవ్వమని అది ఆదేశించింది. తన సమాధానంలో ఎస్.పి. ఇలా పేర్కొన్నాడు : 'ఈ అమ్మాయిపై అత్యాచారం జరిపారా అని నిందితులను అడిగాం. (నిందితులు సల్వాజుడుం నాయకులు). వాళ్లు లేదని బదులిచ్చారు. ఆమె మాపై బురద చల్లడానికి ప్రయత్నిస్తోంది'. అంటే, అత్యాచారం జరిగిందన్న ఫిర్యాదుపై పోలీసులు విచారించే విధానం ఇదన్నమాట. అత్యాచారంకు పాల్పడిన వాళ్లని పిలిచి ప్రశ్నలు అడిగి, వాళ్లిచ్చే సమాధానాలను బట్టి నిర్ణయానికి వస్తారు.

వినాయక్‌సేన్‌ని విడుదల చెయ్యాలని మేం ఉద్యమించినప్పుడు సల్వాజుడుం అంతం కావాలని, ఛత్తీస్‌గడ్ ప్రత్యేక ప్రజా భద్రత చట్టం కింద అరెస్ట్ అయిన వారినందరినీ విడుదల చెయ్యాలని, అసలు ఈ చట్టాన్నే రద్దు చెయ్యాలని కూడా మేం ఉద్యమించాం. అయితే, ఏం జరగలేదు. ప్రస్తుతం అదే చట్టాన్ని గ్రామస్తులకు వ్యతిరేకంగా ఉపయోగిస్తున్నారు. 'మీరు మావోయిస్టులకు మంచి నీళ్లు ఇచ్చారు. వాళ్లకు దారి చూపారు. కాబట్టి మీరు కూడా నిందితులే' అని అధికారులు అంటున్నారు.

మీ న్యాయవ్యవస్థ, మీ పరిపాలనా వ్యవస్థ, మీ ప్రజాస్వామిక వ్యవస్థ – మీరే అంతా నాశనం చేస్తున్నారు. నక్సలైట్లకు ఇక మిగిలింది పెద్దగా లేదు! రాయడం, మాట్లాడడం కూడా నేరమైనప్పుడు – వినాయక్ సేన్ కేవలం రాస్తూ ఉండేవాడు, నేను మాట్లాడుతూ ఉంటాను – ఇంకేం చేస్తారు చెప్పండి? పూర్తి నిస్సహాయత పరిస్థితిలో ఆయుధాలను చేతబట్టే ఆదివాసులను తప్పు ఎలా పడతారు?

జనవరిలో పందొమ్మిది మంది ఆదివాసులను చంపేశారు. నలుగురు ఆడపిల్లలపై అత్యాచారం చేశారు. మేం కోర్టుకి వెళ్లాం.

ప్రభుత్వ ప్లీడరు వాయిదాలు తీసుకుంటూ ఉంటాడు, న్యాయమూర్తులు మారుతూ ఉంటారు. ప్రత్యేక పోలీసు అధికారులు (ఎస్.పి.ఒ.లు) ముగ్గురు ఆదివాసులను చంపారు. వారి భార్యలు హైకోర్టులో రిట్ దాఖలు చేశారు. వాళ్లని నక్సలైట్లు చంపారనీ, ప్రభుత్వం మీద రిట్ వెయ్యమని ఆ మహిళలపై నక్సలైట్లు ఒత్తిడి చేశారని ప్రభుత్వం బదులిచ్చింది. న్యాయమూర్తి దీనిని నమ్మక తప్పలేదు. సాధారణ పల్లె ప్రజలను చంపేసి నక్సలైట్ కమాండర్లని చంపేశామని పేర్కొంటారు. మేం అడిగిందల్లా కేంద్ర నేర పరిశోధనా విభాగం (సిబిఐ) తో విచారణ, నష్టపరిహారం. కాని ఆ గ్రామస్తులతో న్యాయమూర్తి ఏమంటున్నాడంటే 'మీరు ఈ శిబిరంలో ఉండాలో లేదో నిర్ణయించుకోండి, ప్రభుత్వం మిమ్మల్ని చూసుకుంటుంది.'

ఆపరేషన్ గ్రీన్‌హంట్ మొదటి దశలో సెప్టెంబర్ నెలలో సాయుధ దళాలు ఒక కుటుంబం అంతటిపై దాడిచేశాయి. ముందు తండ్రిని, తరువాత తల్లిని, తరువాత చిన్న కూతురుని పొడిచారు. తరువాత ఆమె రెండేళ్ల కొడుకుని తుపాకి మడమలతో పళ్లు ఊడిపోయేలా కొట్టారు, నాలుకలో కొంత భాగం కోసేశారు. వాళ్ల గోడు మీడియా వినాలని నేను వాళ్లని రాయపూర్‌కి తీసుకెళ్లాను. వాళ్లు నక్సలైట్లు కారన్న రుజువులు మీ దగ్గర ఏమున్నాయని రాయపూర్ ప్రెస్ క్లబ్బు వాళ్లు నన్ను అడిగారు. ప్రభుత్వం కూడా వాళ్లని నక్సలైట్లుగా పేర్కొనడం లేదని నేను చెప్పాను. అయినా కూడా వాళ్ల వేదికను నన్ను ఉపయోగించుకోనివ్వ లేదు. అంటే ఇప్పుడు ఆదివాసులు మీడియా దగ్గరకు కూడా వెళ్లలేరు. వారు ఇక ఎవరి దగ్గరకి వెళతారు?

వాళ్లకి అన్ని దారులూ మూసుకుపోయాయి. పోలీసులు వాళ్లని కొడతారు. రాజకీయ నాయకులు – వాళ్లు కాంగ్రెస్ కానివ్వండి, భారతీయ జనతాపార్టీ వాళ్లు కానివ్వండి – సల్వాజుడుం పక్షాన ఉన్నారు. కోర్టులు వాళ్ల మొర ఆలకించవు. మీడియా వాళ్లను పట్టించుకోదు. ఇక మావోయిస్టుల దగ్గరికి కాకుండా వాళ్లు ఎక్కడికి వెళతారు? పోలీసులు వాళ్లపై దాడులు చేసినప్పుడు వాళ్లని రక్షించేది నక్సలైట్లే. మీకు నిజంగా శాంతి కావాలంటే నక్సలైట్లు ఆదరణ పొందడానికి మూల కారణాలు లేకుండా చూడండి.

హింస అంతం కావడానికి అవసరమైన పరిస్థితులను సృష్టించడానికి మేం ప్రయత్నించాం. పోలీసులు వృద్ధురాళ్ల ఎదలు కోసి, ముసలివాళ్లను పొడిచి, పడుచులపై అత్యాచారాలు చేస్తున్న నేపథ్యంలో పల్లె ప్రజల చేతుల్లో ఎవరైనా ఒక పోలీసు చిక్కితే ఏమవుతుందో మీరు ఊహించవచ్చు. ఇటువంటి పరిస్థితులు ఉత్పన్నం కాకుండా రాజ్యం చూడాలి. నక్సలైట్లకు జనాదరణ ఎందుకు లభిస్తోందని రాజకీయ నాయకులు ప్రశ్నించుకోవాలి? ప్రజాస్వామ్య పద్ధతుల్లో ఎంపికైన నాయకులకు ఎందుకు ప్రజాదరణ లేదు? పట్వారీ నా డబ్బు గుంజుకున్నాడని ఒక ఆదివాసి వెళ్లి పోలీసులకు ఫిర్యాదు చేస్తే వాళ్లు వెళ్లి విచారణ మొదలుపెడతారా?

పేదల హక్కులు కాపాడడానికి మీ పోలీసుల తుపాకులు ఎక్కు పెట్టబడిన రోజున నక్సలిజం అంతమైపోతుంది. నా బిడ్డ అల్లరి చేస్తుంటే ఎందుకలా ప్రవరిస్తున్నాడో అర్థం చేసుకోడానికి ప్రయత్నించనా? ఇంత హింస ఎందుకు ఉందని మావోయిస్టులను ప్రధానమంత్రి అడగలేరా? కొన్ని దశాబ్దాలుగా ఆదివాసులకు పెద్ద పోరు జరుగనున్నదని చెపుతూ వారిని సన్నద్ధం చేస్తున్నారు. ఒకరోజున నేను నడుచుకుంటూ వెళుతుండగా చెట్టు కింద పడుకుని ఉన్న ఒక ముసలి వ్యక్తి 'పోరు జరుగుతుంది కదూ?' అంటూ అడిగాడు.

అందుకే నేను జనజీవన స్రవంతిలో ఉన్న పార్టీల రాజకీయ నాయకులను ఈ ప్రాంతంలోకి రావద్దని చెబుతుంటాను. ఆదివాసులు ఎదురు చూస్తున్నారు, మిమ్మల్ని బంధిస్తారు అని చెబుతుంటాను. ఈ ఆదివాసులు ఉత్తరప్రదేశ్‌లో లాంటి ప్రజలు కాదు. వాళ్లు మీ మీదకు దూకి, మీ అంగరక్షకుల దగ్గర ఉన్న ఎకె 47లను లాక్కుంటారు. ఆపరేషన్ గ్రీన్‌హంట్‌లో జమ్ము–కాశ్మీర్‌లో కంటే ఎక్కువ సంఖ్యలో సాయుధ దళాల వారు చనిపోతారు. సెప్టెంబర్ నెలలో ఆపరేషన్ గ్రీన్‌హంట్ మొదలయ్యింది. ఒక్క మావోయిస్టుని కూడా చంపలేక పోయారు. కానీ 'కోబ్రా' దళానికి చెందిన ఆరుగురు జవానులు చనిపోయారు. వాళ్లు ముసలి ఆదివాసులను, పిల్లలను మాత్రమే చంపగలరు. ఒక ఆరేళ్ల పిల్లవాడిని పొడిచారు. ఒక 85 ఏళ్ల వృద్ధుడిని మంచంలోనే పొడిచి చంపేశారు. పోలీసులు ఏ మాత్రం హృదయం లేకుండా హత్యలకు పాల్పడుతున్నారు. పైగా మీరు మా పక్షాన ఉన్నారా, నక్సలైట్లతో ఉన్నారా అని ప్రభుత్వం అడుగుతుంది. మీ పోలీసుల పక్షాన మేం లేమని నేను బహిరంగంగా చెప్పగలను. చనిపోతూ ఉన్న ఆదివాసుల పక్షాన మేం ఉన్నాం.

నక్సలైట్ల ప్రభావాన్ని అభివృద్ధి ఎలా తగ్గిస్తుందో వివరిస్తూ దిగ్విజయ్ సింగ్ ఒక వ్యాసం రాశాడు. నాలుగు డిమాండ్లు ముందు ఉంచుతూ అతనికి నేను ఉత్తరం రాశాను. మొదటి డిమాండ్ – మీ సాయుధ దళాలను వెనక్కు పిలిపించండి. ఏడు వందల గ్రామాలకు రాకపోకలు లేకుండా చేశారు. ఆ ఊరి ప్రజలు బయటకు రాలేరు, బయట వాళ్లు ఎవరూ లోపలికి ప్రవేశించలేరు. ఐదు కిలోమీటర్ల దూరంలో ఉన్న వారపు సంతకి వెళితే ఎస్‌పిఒ పట్టుకుంటాడని తెలిసిన ఆదివాసీ మహిళ సరుకులు కొనుక్కోడానికి 85 కిలోమీటర్ల దూరంలో ఉన్న బజారుకి వెళుతుంది. అక్కడికి వెళ్లడానికి రెండు రోజులు, తిరిగి రావడానికి రెండు రోజులు పడుతుంది. అంటే వారంలో నాలుగురోజులు సరుకుల కోసం వెళ్లి రావడం సరిపోతుంది. ఒక నెలకి సరిపడా బియ్యం ఒకేసారి ఎందుకు కొనుక్కోవు అని ఆ ఆదివాసీ మహిళను అడిగితే 'మేం ఇప్ప పూలతో వచ్చిన డబ్బుతో ఎంత బియ్యం వస్తుందో అంతే కొన్నుక్కోగలం. మా ఇప్పపూలకి 20 రూపాయలు మాత్రమే వస్తే, అంత మొత్తంలోనే బియ్యం కొన్నుక్కోగలం' అని ఆమె బదులిచ్చింది.

ఈ పరిస్థితికి కారణం రాజ్యమే కాని నక్సలైట్లు కాదు. కొన్ని గ్రామాలను విముక్తి ప్రాంతాలుగా ప్రకటించడం అన్నది రాజ్యం ఎత్తుగడలో భాగమే. అప్పుడు వాళ్లే ఆ గ్రామాల్లో మేం పనిచేసే పరిస్థితి లేదని ఫిర్యాదు చెయ్యవచ్చు. వాస్తవానికి సల్వాజుడుం వల్లనే రాజ్యం అక్కడ పని చెయ్యలేని పరిస్థితి ఏర్పడింది. ఆ గ్రామాలలో ప్రభుత్వ సంస్థ ఏది కూడా, చివరికి చట్టం కూడా పనిచెయ్యదు. జీవించే హక్కును ఇచ్చే ఆర్టికల్ 21 కూడా అక్కడ పనిచెయ్యదు. ఆదివాసులు వేటాడ బడుతున్నారు. కొన్నిసార్లు భయమూ, నిస్సహాయతల నుంచి కూడా హింస పుడుతుంది.

*(ఇంకా ఉంది)*

*(తెలుగు అనువాదం : కె. సురేష్)* ☐

*వ్యక్తులు ఆ కాలానికి ఎంత గొప్ప వారైనా వందల ఏళ్ల మానవ చరిత్ర, సంస్కృతుల ముందు చాలా చిన్నవారేనని, అందునా ప్రజావ్యతిరేకంగా పాలన కొనసాగించిన నాయకుల పేర్లను ప్రాంతాలకు పెట్టడం సరైంది కాదంటూ ప్రజా సంఘాలు వేసిన పిటిషన్*

# కడపకు వైఎస్ పేరు సమంజసమా?

కడప జిల్లాను వై.ఎస్. రాజశేఖరరెడ్డి జిల్లాగా పేరు మార్చాలని ప్రభుత్వం నిర్ణయించడంతో కడప జిల్లా సంస్కృతికి, చరిత్రకు అతిపెద్ద ప్రమాదం వచ్చి పడింది. జిల్లా కేంద్రంగా కడప ఏర్పడి రెండు వందల సంవత్సరాలైందని గత ఏడాదే ద్విశత వార్షికోత్సవాలు వైభవంగా జరిగాయి. ఒక పరిపాలనా కేంద్రంగా కడపకు రెండు వందల ఏండ్ల గుర్తింపు ఉన్నా నిజానికి చరిత్రలో కడప అనే పేరు శతాబ్దాల నుండి ఉనికిలో ఉంది. ఇక్కడి ప్రజల విశ్వాసాల ప్రకారం, మెకంజీ కైఫీయత్తుల ప్రకారం కడప అంటే వెంకటేశ్వరుని గడప. కచ్చితమైన చారిత్రక ఆధారం ప్రకారం క్రీ.శ. 971 నాటికే 'కడప' ప్రాదేశిక విభాగంగా ఉనికిలో ఉన్నట్లు వైదుంబ రాజవంశానికి చెందిన భువన త్రినేత్ర అనే రాజు అత్తిరాలలో వేయించిన రాగిశాసనం ద్వారా తెలుస్తోంది. కడప జిల్లా ఒకప్పటి మద్రాస్ ప్రెసిడెన్సీలోని రాయలసీమలోని అతిపెద్ద ప్రాంతం. బళ్లారి సరిహద్దుల నుండి ఇప్పటి అనంతపురం, చిత్తూరు, కర్నూలు, ప్రకాశం జిల్లాల్లో చాలా ప్రాంతాలు ఒకప్పుడు కడప జిల్లాలో భాగమే. ఇక్కడ సకల వెనుకబాటుతనాలతో పాటు మహాద్భుతమైన దేశీ సంప్రదాయాలు ఉన్నాయి. నాచన సోమనాథుడు, అల్లసాని పెద్దన, సూరనకవి, ఈశ్వరీదేవిల సాహిత్య వారసత్వముంది. పండితలోగిళ్ల నుండి ప్రజల ముంగిటికి సాహిత్యాన్ని ప్రవహింపజేసిన తాళ్లపాక అన్నమయ్య తేనెపలుకుల పదాల్లో, ఆధిపత్య సమాజపు పోకడల్ని నిరసించిన ప్రజాకవి వేమన, బ్రాహ్మణీయ సంస్కృతిని నిలదీసిన వీరబ్రహ్మం ఈ ప్రాంతానికి చెందినవారే. పోతులూరు వీరబ్రహ్మం కాలజ్ఞానం ఈ నేలలోనే ఉంది. తెలుగు సినిమా స్వర్ణయుగం నాటి కళాకారులు బి.ఎన్. రెడ్డి, బి. నాగిరెడ్డి, శాంతకుమారిలు కడప జిల్లా వారే. పుట్టపర్తి నారాయణాచార్యులు మొదలుకొని ఆధునిక సాహిత్యానికి కొత్త ఒరవడినందించిన రాచమల్లు రామచంద్రారెడ్డి, ఇల్లస్ట్రేటెడ్ వీక్లీ పత్రికా సంపాదకుడు ఎ.ఎస్. రామన్ వంటి రచయితలు, మేధావులు ఈ ప్రాంత చరిత్రలో భాగమయ్యారు.

1857 నాటి మొదటి భారత స్వాతంత్ర్య పోరాటానికి ముందే వలసపాలనపై తిరుగుబాటు చేసిన ఉయ్యాలవాడ నరసింహారెడ్డి ఒకప్పటి కడప ప్రాంతం వాడే (ఇప్పుడు కర్నూలు జిల్లాలో భాగమైన ఉయ్యాలవాడ అప్పటి కడప ప్రాంతం లోనిదే). ఈ ప్రాంతం నుండి జాతీయోద్యమంలో తమ సర్వస్వాన్ని త్యాగం చేసినవారున్నారు. ఇవన్నీ 'కడప' అనే మూడక్షరాల పేరుతో ముడిపడి ఉన్నవి. ఒక్కమాటలో చెప్పాలంటే ఈ ప్రాంతానికి సంబంధించిన వేయి సంవత్సరాలు పై బడిన చరిత్ర, సంస్కృతి, పోరాటాల సారం 'కడప' అన్న అక్షరాల్లో వ్యక్తమవుతుంటుంది.

ఇంతటి అస్తిత్వం గల పేరును ఇప్పుడు మార్చవలసిన అవసరం ఏమిటి? కొత్తగా ఏర్పడే ప్రాంతాలకైతే ప్రజల మనోభావాల్లో గూడుకట్టుకున్న మనుషుల పేర్లు పెట్టవచ్చునేమో గాని ఉన్న పేరు మార్చి మనిషి పేరు పెట్టడం ఎంత ఉచితం? రంగారెడ్డి, ప్రకాశం జిల్లాలకు కొత్తగా ఏర్పడినప్పుడు పెట్టినవే ఆయా పేర్లు. నెల్లూరు జిల్లాకు పొట్టి శ్రీరాములు పేరు పెట్టినా, పొట్టి శ్రీరాములుకు, వై.ఎస్.ఆర్.కు పోలికేముంది? తెలుగువారి ఆత్మగౌరవం కోసం ప్రాణ త్యాగం చేసిన పొట్టి శ్రీరాములుకు, ఆధిపత్య రాజకీయాల్లో ఒక్కొక్క మెట్టూ ఎక్కే క్రమంలో లెక్కలేనన్ని అక్రమాలు చేసిన రాజశేఖరరెడ్డికి పోలికెక్కడ తేగలం? రాజారెడ్డి హయాం నుండి వై.ఎస్. కుటుంబం రాష్ట్రంలో బలమైన శక్తిగా ఎట్లా ఎదుగుతూ వచ్చిందో జిల్లాలో అందరికీ తెలిసిన చరిత్రే. వై.ఎస్. రాజారెడ్డి 1964లో వెంకటనర్సయ్య అనే ముగ్గురాళ్ల వ్యాపారికి భాగస్తునిగా మంగంపేట బైరైటీస్ గనులలోకి ప్రవేశించడం, 1975లో వెంకటనర్సయ్య హత్య తర్వాత ఆ కుటంబం గనుల్లో కోట్ల డబ్బు కూడబెట్టి 1978లో ఆ డబ్బులు రాజకీయాల్లోకి తెచ్చి జిల్లా రాజకీయాల రూపమే మార్చివేయడం జిల్లావాసుల అనుభవంలోనివే.

1989లో వై.ఎస్. కుటుంబానికి చెందిన విజయలక్ష్మి బైరైటీస్ గనుల తవ్వకాల్లో అక్రమాలు జరిగాయని కె.వి. నటరాజన్ కమిషన్ తన విచారణలో నిర్ధారణ చేస్తే ఈ విషయాన్ని పరిశీలించడానికి రాష్ట్ర అసెంబ్లీ నియమించిన సబ్ కమిటీ యాభై లక్షల రూపాయల జరిమానా విధించింది. (వాళ్లు ఆ సొమ్ము ఇప్పటికీ చెల్లించలేదన్నది గమనార్హం). ముగ్గురాళ్ల డబ్బును, కడపజిల్లాలోని ముఠాకక్షల సంస్కృతిని చాలా చాకచక్యంగా వాడుకుని రాజశేఖరరెడ్డి జిల్లాలో జవాబులేని నాయకునిగా ఎదుగుతూ మరోవైపు రాయలసీమలోని ఫ్యాక్షన్ లీడర్లకు మల్లే కాకుండా పెద్దమనిషి ఇమేజ్‌ను పూర్తిగా చెరిగిపోకుండా కాపాడుకోగలిగాడు. పత్రికలు సైతం అతని గురించి చెడు ఎక్కువగా రాయవు. అతనివల్ల జరిగే హింసాకాండ పత్రికలకెక్కినా అతని పేరుమీద ఎక్కదు. అతను స్వయంగా ఎన్నికల్లో రిగ్గింగ్ చేసినా, హత్యలు చేయించినా తన ప్రాబల్యం పెంచుకోవడానికి ప్రత్యర్థులను మట్టుబెట్టడానికి రౌడీలను, హంతకులను, బందిపోట్లను, మట్కా ఆడించేవాళ్లను, దొంగసారా అమ్మే వాళ్లను చేరదీసి పోషించినా అతనిని ఒక దౌర్జన్యకారునిగా కాక ప్రజా నాయకునిగానే పత్రికలు చూపిస్తాయి.

అట్లా జిల్లాలో దాదాపు ఏకైక నాయకుడిగా ఎదిగి ఆ పైన జిల్లా బయట కూడా తన మనుషుల్ని తయారు చేసుకున్నాడు. అందుకోసం ఈయన ఒక్క కాంగ్రెస్ పార్టీలోనే కాదు, తెలుగుదేశం పార్టీలో కూడా తన మనుషుల్ని తయారు చేసుకున్నాడు. తనకు పోటీగా వచ్చే సొంతపార్టీ

వాళ్లను తొక్కేయడానికి ప్రతిపక్ష పార్టీ మెంబర్లను ఎన్నికల్లో గెలిపించాడు. ఎక్కడ అగ్గిరాజుకున్నా తనకు అనుకూలమనిపిస్తే దానిని పెంచి దావానలం చేశాడు. 1991లో ముఖ్యమంత్రి పీఠం కోసం రాజేసిన హైదరాబాద్ మతకలహాల మంటల్ని పాతబస్తీవాళ్లు కలలో కూడా మర్చిపోలేరు.

ఇక్కడ ప్రజాస్వామ్యం, ప్రజాస్వామిక సంస్కృతి, అంతకంతకూ అధోగతి పాలుకావడానికి అతి ఎక్కువ దోహదం చేసింది వై.ఎస్. కుటుంబం అన్న విషయం జిల్లా వాసులందరికీ తెలుసు. వై.ఎస్. రాజశేఖరరెడ్డి మొదటిసారి ముఖ్యమంత్రి అయినపుడు మానవహక్కుల ఉద్యమకారుడు బాలగోపాల్ రాసింది అక్షరాలా నిజం. "సమాజాన్ని పీడిస్తున్న రుగ్మతలను నయం చేయడానికి వచ్చిన మంచి డాక్టరుగా మీడియా వై.ఎస్.ను ప్రశంసిస్తోంది. నిజానికి ఆయనకు అధికార ప్రాభవం రాష్ట్రంలో మరే రాజకీయవేత్తకంటే కూడా రక్తపాతంతో కూడుకుని ఉంది." అట్లాగే ఆయన ఐదేళ్ల పాలనలో కూడా లెక్కలేనంత రక్తం పారింది. అధికారంలో లేనప్పుడు నక్సలైట్లది సామాజిక సమస్య అని, శాంతి చర్చలకు హామీ ఇచ్చి, అధికారంలోకొచ్చాక కొద్ది కాలానికే చర్చల నాటకానికి తెరదించి ప్రజల ఆకాంక్షలను హేళన చేస్తూ నల్లమలను రక్తపుటేర్లలో ముంచాడు. నిలువ నీడ కోసం రోడ్డెక్కిన వాళ్లను ముదిగొండలో, గంగవరంలో కాల్చి చంపాడు. ప్రతిపక్షంలో ఉన్నప్పుడు ఒక మాట, అధికారంలో ఉన్నప్పుడు మరోమాట అనే అవకాశవాద రాజకీయ సూత్రాన్ని చాలా సమర్థవంతంగా ఆచరించాడు. నల్గొండలో యురేనియం ప్రాజెక్టు ప్రతిపాదనను తీవ్రంగా వ్యతిరేకించి, ప్రజాసంఘాలు, ప్రతిపక్షాలతో కలిసి ఉద్యమంలో పాల్గొని, ముఖ్యమంత్రి అయ్యాక ప్రాణాంతకమైన అదే ప్రాజెక్టును పులివెందులలో అయితే తనకు ఎదురుండదని తెచ్చిపెట్టాడు. పులివెందులలోనూ ప్రజలు అడ్డుపడితే వాళ్ల నోరు నొక్కి ప్రాజెక్టు పనులు మొదలుపెట్టాడు.

జనార్దనరెడ్డి హయాంలో ప్రైవేట్ ఇంజనీరింగ్ కాలేజీల అక్రమ అనుమతులను నిరసించిన వై.ఎస్., జనార్దనరెడ్డి కంటే కొన్ని పదుల రెట్లు కాలేజీలకు అనుమతులివ్వడమే కాక ఫీజు రీఎంబర్స్‌మెంట్ పేరుతో కార్పొరేట్ కాలేజీల వ్యాపారాన్ని, లాభాలను స్థిరీకరించాడు. ప్రతిపక్షంలో ఉన్నప్పుడు కార్పొరేట్ కంపెనీలకు కారుచవకగా భూములు కట్టబెట్టిన చంద్రబాబు ప్రభుత్వాన్ని దుయ్యబట్టిన ఈయన, అధికారంలోకొచ్చాక సెజ్‌ల పేరుతో ఏకంగా రాష్ట్రాన్నే ముక్కలు, ముక్కలుగా బడా కంపెనీలకు, రియల్ ఎస్టేట్ వ్యాపారులకు పంచి ఇచ్చాడు. చంద్రబాబును ప్రపంచబ్యాంక్ జీతగాడని విమర్శించి, తాను అంతకంటే ఎక్కువ సాగిలపడి ప్రపంచబ్యాంక్ విధానాలను కొనసాగించాడు. అభినవ కాటన్‌గా గొప్పలకు పోయిన జలయజ్ఞంలో రైతుల పొలాల్లో పారిన నీళ్లు గోరంతైతే, కాంట్రాక్టర్‌ల జేబుల్లోకి పారిన నిధులు కొండంత. ఇడుపుల పాయలో, కోడూరులో ఎన్నో ఏళ్లుగా అనుభవిస్తున్న పేదల భూమిని (ప్రతిపక్షాలు గగ్గోలు పెడుతున్నా పెడచెవిన పెట్టి) ముఖ్యమంత్రి అయ్యాక ఉన్నట్లుండి జ్ఞానోదయమైనట్లు ఆ భూముల్ని తిరిగి ఇచ్చేస్తూ అభినవ వినోభాబావేగా తన భజనపరులతో కీర్తించుకోగలగడం ఒక్క రాజశేఖరరెడ్డికే సాధ్యం. ఇంతటి అవకాశవాద రాజకీయాల్లో మునిగి తేలిన వ్యక్తిని ఏ విలువల కోసం జిల్లాకు ప్రతీకగా నిలబెడుదాం?

కడప అంటే బాంబుల జిల్లా కాదని, దానికి ఎంతో సాంస్కృతిక చరిత్ర ఉందని అనేక సందర్భాల్లో, సినిమాలు, పత్రికలు, ఎలక్ట్రానిక్ మీడియా గీస్తున్న వక్ర చిత్రాన్ని నిరసిస్తూ వస్తున్నాయి. ఇకపై కడప జిల్లా వై.ఎస్.ఆర్. జిల్లాగా సరికొత్త నామం ధరిస్తే వై.ఎస్.ఆర్. అంటే గుర్తొచ్చే ఫ్యాక్షన్ హత్యలు, 1991 హైదరాబాద్ మతకలహాలు, ప్రముఖుల బహిరంగ సభల్లో విసిరిన చెప్పులు మన జిల్లాకు ప్రతిరూపం అయిపోతాయి. ఇదే ఇక్కడ సంస్కృతికి, చరిత్రకు దాపురించిన అతిపెద్ద ప్రమాదం.

రాజ్యాలు, రాజులు పోయినా రాజభక్తికి మించిన బానిసత్వంతో వై.ఎస్.రాజశేఖరరెడ్డి ముప్పై ఏళ్ల నేర చరిత్రను ఆయన విషాద మరణం చుట్టూ అల్లుకున్న సానుభూతితో చెరిపేద్దామా? వై.ఎస్. రాజశేఖరరెడ్డి పులివెందులకు, కడప జిల్లాకు ఎంతోమేలు చేశారని రాష్ట్ర వ్యాప్తంగా ఏవేవో సంక్షేమ పథకాల్ని ప్రవేశపెట్టాడని వాదన తెస్తున్నారు. ప్రజలకు ఏదో చేస్తున్నట్లు భ్రమలు కల్పిస్తూనే కార్పొరేట్ కంపెనీలకు, రియల్ ఎస్టేట్ వ్యాపారులకు, ఆయన బంధుమిత్రులకు, మంది మాగధులకు ఎంత దోచిపెట్టాడో ప్రజలకు ఇప్పుడు అర్థం కాకున్నా వాదన కోసం ఆయన మహాద్భుతంగా జిల్లానూ, రాష్ట్రాన్ని అభివృద్ధి చేశాడని, ఆయన ఏ పాపం ఎరగడని, సాధుజీవి అని, లోక కళ్యాణం కోసం ఆయన, ఆయన కుటుంబం పాటుపడిందని అంగీకరించినా ఆయనను గౌరవించడానికి జిల్లాకు పేరు పెట్టడం, అదీ ఉన్న పేరు తీసేసి పెట్టడం ఒక మార్గమవుతుందా? అలా గౌరవించదలచుకుంటే ఆయన కృషితో ఏర్పడిన సంస్థలకు, నిర్మాణాలకు ఆయన పేరు పెడితే పెట్టండి. ఇప్పటిదాకా ఉన్న సంప్రదాయం అదే కదా. దేశనాయకులైన ఇందిరాగాంధీ, రాజీవ్‌గాంధీ, ఎన్.టి.రామారావు వంటి వారి పట్ల ఎంత గౌరవాభిమానాలున్నా వాడలకు, సంస్థలకు వారి పేర్లు పెట్టారు గాని ఏ జిల్లాకు వారిపేరు పెట్టలేదు. ఇప్పుడు వై.ఎస్. రాజశేఖరరెడ్డి పేరు జిల్లాకు పెట్టి ఈ కొత్త సంప్రదాయానికి తెరలేపితే జిల్లాలు మిగలవు. ప్రాంతాల చారిత్రక, సాంస్కృతిక విశేషాలు అట్టడుగున పడిపోతాయి. అవశేషాలుగానే మిగులుతాయి.

ఒక వ్యక్తి అది ఎంతటివాడైనా సరే, వేల ఏళ్ల చరిత్రను మించి గొప్పవాడైపోతాడా? జిల్లా పేరుతో ముడిపడి ఉన్న చరిత్ర, సంస్కృతి ఇక్కడి ఎందరో మహనీయుల జీవితాలు అన్నింటినీ కాదని ఒక్క రాజశేఖరరెడ్డి పేరునే ముందుకు తీసుకురావడం ఎంతవరకు సమంజసం? ఏ వ్యక్తి అయినా ఫలానా ప్రాంతం వాడని చెప్పుకుంటారు. తన జీవితాచరణతో ప్రాంతంపేరును ఇనుమడింపజేస్తాడు. కాని ఇప్పుడు ఒక వ్యక్తి పేరుతో మన ప్రాంతానికి ఉన్న పేరును, చరిత్రను, సంస్కృతిని, పిడికెడుమంది నాయకులు కలిసి చెరిపేయాలనుకుంటున్నారు.

వై.ఎస్. కుటుంబం అంటే భయమో లేక అవకాశవాద ప్రయోజనాలో కొందరి నోళ్లు కుట్టేసి ఉండొచ్చు. ఈ గొడవలో లబ్ధిపొందేదేమి ఉండదు కాబట్టి ఇంకొందరు కలుగజేసుకోరు. కారణమేదైనా ఈ ధోరణి ప్రజాస్వామ్యాన్ని నిలువునా పాతరవేస్తుంది. కాబట్టి కడపను వై.ఎస్. రాజశేఖరరెడ్డి జిల్లాగా పేరు మార్చాలని రాష్ట్ర కాబినెట్ ఏకపక్షంగా తీసుకున్న నిర్ణయాన్ని వ్యతిరేకిస్తూ, మన రాజకీయ నాయకుల అవకాశవాదాన్ని నిలదీద్దాం.

ప్రజలు, ప్రజాస్వామికవాదులు, రచయితలు, విద్యార్థులు, మేధావులు కలసిరండి. మన కడపను కాపాడుకుందాం. ■

***హైదరాబాద్‌లో జరిగిన జాతీయ ప్రెస్ దినోత్సవం సందర్భంగా ప్రెస్ కౌన్సిల్ అధ్యక్షుడు జస్టిస్ జి ఎన్ రే ప్రసంగానికి మాడభూషి శ్రీధర్ అనుసరణ***

# అక్షరాన్నీ అమ్ముకుంటున్న మీడియా

***కా**ల్చివేసే నిప్పు కాదు మీడియా దారిచూపే దీపం కావాలి.*

***– జస్టిస్ జి ఎన్ రే,*** ప్రెస్ కౌన్సిల్ అధ్యక్షులు

నిప్పు, దీపం రెండూ వెలుగునిస్తాయి. మీడియా నాశనం చేసే నిప్పు కాకుండా దారిచూపే దీపమై ఉండాలి. పత్రికల సంఖ్యలో, వాటి సర్క్యులేషన్‌లో ఆంధ్రప్రదేశ్ దేశం మొత్తం మీద ఎంతో అగ్రస్థానంలో ఉందని న్యూస్‌పేపర్ల రిజిస్ట్రార్ లెక్కలు చెప్తున్నాయి. ఒక్క హైదరాబాద్ లోనే 200 పైగా ప్రచురణలు ఆర్ఎన్ఐకి ఏటా తమ రిటర్న్‌లు సమర్పిస్తున్నాయంటే ఈ నగరంలో మాధ్యమాలు ఎంత చైతన్యవంతంగా ఉన్నాయో అర్థం చేసుకోవచ్చు. ప్రైవేట్ రంగంలో ఎలక్ట్రానిక్ మీడియా శరవేగంగా విస్తరిస్తున్నది. కనుక పత్రికారంగం పుట్టిపెరిగిన ఈ రెండు శతాబ్దాలలో వచ్చిన మార్పులగురించి, ఇక ముందుకూడా సామాజిక, ఆర్థిక రంగంలో ప్రజాభ్యుదయానికి పత్రికలు పరికరాలుగా ఉపయోగ పడడానికి సరికొత్త సాంకేతిక పరిజ్ఞానాన్ని భవిష్యత్తులో వినియోగించే అంశాలను గురించి చర్చించడానికి ఈ నగరం సరైన వేదిక.

బ్రిటిష్ పాలనలో ప్రాథమిక హక్కులు లేవు. కనుక జనులకు పత్రికా స్వేచ్ఛ కరువే. అధికారిక గెజిట్ అయిన హిక్కీస్ గెజిట్ 18వ శతాబ్దిలో ప్రారంభమయిన తొలి భారత పత్రిక. చట్టంలో పేర్కొన్న కొన్ని పత్రికలకు తప్ప మరెవరకీ ప్రత్యేకమైన హక్కులేవీ వలసపాలకులు కల్పించలేదు. విదేశీపాలకులు తమకు అనుకూలమైన రీతిలో పత్రికలను శాసిస్తూ అనేకానేక శాసనాలు చేసారు. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత రాజ్యాంగంలో ప్రత్యేకంగా పత్రికలకు భావస్వేచ్ఛను పేర్కొనక పోయినా ప్రజలందరితో పాటు ఆ హక్కు పత్రికా రచయితలకు ఉపకరించే విధంగా రాజ్యాంగం హక్కులను నిర్వచించింది. పత్రికలమీద సెన్సార్‌షిప్ కేసులో సుప్రీంకోర్టు 1950 తరువాత రాజ్యాంగ వివాదాన్ని పరిష్కరిస్తూ భారత పౌర సమాజం పౌర భావస్వాతంత్ర్య ప్రాధాన్యాన్ని గుర్తించి గౌరవించింది. ఆ తరువాత చాలాకాలం గడిచిపోయింది. ఈనాటి వాతావరణంలో, పత్రికల స్వాతంత్ర్యం గురించి వినబడడం కన్న బాధ్యతల గురించి ప్రస్తావన ఎక్కువ చేయవలసిన పరిస్థితులు పెరిగాయి. మారుతున్న మాధ్యమాల తీరుతెన్నుల గురించి ఆలోచించవలసిన అవసరాలు వచ్చాయి.

**జనమాధ్యమాల విశిష్ట పాత్ర** : బ్రిటిష్ పాలనా కాలంలో పత్రికలు ప్రజల ఉద్యమాలకు వెన్నుదన్నుగా నిలబడ్డాయి. ప్రజల్లో స్వాతంత్ర్యోద్యమ భావాలను పెంచడంలో చారిత్రాత్మక పాత్రను పత్రికలు పోషించాయి. యూరోపియన్ నాగరికతతో మన దేశంలో మారాయి. ఇక్కడ పోర్చుగీసు వారు అచ్చుయంత్రాలను ప్రవేశ పెట్టారు. బెంగాల్‌లో మిషనరీలు కూడా మత ప్రచారం కోసం సాంకేతిక పరిజ్ఞానాన్ని ప్రవేశ పెట్టాయి. తరువాత 250 సంవత్సరాలలో ఆధునిక భారతదేశంలో జన మాధ్యమం ఒక ప్రధానమైన నాలుగో వ్యవస్థగా ఎదిగి నిలిచి పోయింది. సామాజిక, రాజకీయ సమాచార ప్రసారం ఎంత కీలకమైందో గమనించిన భారతీయులు బలీయమైన మాధ్యమాలను నిర్మించి ఉద్యమాలకు ఊతమిచ్చారు. మీడియా నిర్మాణ పురోగమనాల్లో ప్రభుత్వాల కన్న వ్యక్తుల ప్రాధాన్యతే ఎక్కువ. నోరునొక్కే విదేశీపాలనా విధానాలు మీడియా చైతన్యవంతమైన తిరుగుబాటు ఉద్యమ కార్యక్రమాలను ఆపలేకపోయాయి. 19వ శతాబ్దంలో పత్రికలు జాతి ఎదుర్కొనే సవాళ్ల గురించి వెల్లడిస్తూ కొత్త అధ్యాయాన్ని రచించాయి. ఫ్యూడల్ వార్తలు బ్రిటిష్ పాలకుల విశేషాలు కాకుండా వివిధ సామాజిక సమస్యల గురించి రాజకీయ ఆలోచనల గురించి భారతీయ పత్రికలు రాసాయి. అవిద్య, బాల్యవివాహాలు వితంతు వివాహాలు, సతి వంటి దురాచారాల మీద కలం ఎక్కుపెట్టాయి. తిలక్, గోఖలే, గాంధీజీ వంటి నేతల చేతుల్లో పత్రికలు ఆయుధాలుగా మారాయి.

స్వేచ్ఛకోసం పత్రికలు సాధనాలుగా నిలిచాయి. జాతి లక్ష్యాలను నిర్దేశిస్తూ, ప్రజాభిప్రాయాన్ని నిర్మిస్తూ, పౌరహక్కులను సాధిస్తూ ప్రజలను ముందుకు నడిపాయి. కత్తికన్న కలం గొప్పదనే దృఢమైన విశ్వాసమే భారతీయ పత్రికలను ఈనాటికీ జనం పక్కన నిలబెట్టాయి. కొన్ని గర్హనీయమైన తప్పిదాలు జరుగుతున్నా, మీడియాకు జనబాహుళ్యంలో గౌరవ విశ్వాసాలు ఇప్పటికీ ఉన్నాయి. స్వాతంత్ర్యంకోసం పోరాటం, సాంఘిక సంస్కరణలకోసం ఉద్యమం, పౌరుల అభ్యుదయం కోసం కృషి చేసిన మీడియాకు ఆ చరిత్రే పునాది. స్వతంత్ర్యమైన నిర్భయ నిర్వహణ, స్వేచ్ఛకు కట్టుబడి ఉండడం, అణచివేతకు తీవ్రవ్యతిరేకత, సమాజానికి మార్గదర్శకత్వం నెరపే పటిమ, మానవ హక్కుల రక్షణ బాధ్యత పత్రికలకు ప్రాణప్రదమైనవి. భారత ప్రజాస్వామ్యం అంతకంతకూ పటిష్టం కావడంలో సాగిన పోరాటాలను మీడియా ప్రతిబింబించడమే కాకుండా ప్రతి దశలో నిర్మాణాత్మక సలహా సహకారాలను అందించింది.

గత 62 సంవత్సరాలలో మీడియాలో రెండురకాల పెను మార్పులు వచ్చాయి. సానుకూలమైనవి ప్రతికూలమైనవి. ప్రపంచీకరణ, నవీన ఆర్థిక విధానాలు సమాచార ప్రసార వ్యవహారాలను ప్రభావితం చేసాయి. కమ్యూనికేషన్ పరిశ్రమ కూడా ప్రపంచీకరణకు సానుకూల

పరిస్థితులు కల్పించింది. ఆర్థిక, మార్కెట్ రంగంలో మాత్రమే కాకుండా సంస్కృతిపైన కూడా ఈ ప్రభావం విపరీతంగా పడింది. వాణిజ్య ప్రకటనలను, టెలివిజన్‌ను ఇంటర్నెట్‌ను కలపడం ద్వారా ఈ ప్రభావం సుగమమైంది.

అచ్చు సాంకేతిక పరిజ్ఞానంలో వచ్చిన విప్లవాత్మక మార్పులు పత్రికలను వర్ణమయం చేయడం, అందంగా విషయాలను అందించడం లోనే కాకుండా, ఒకే సమయంలో బహుళ ప్రచురణ కేంద్రాల నుంచి శరవేగంగా తక్కువ ఖర్చుతో ముద్రించే వనరులు పెంచి విభిన్న ప్రాంతాల్లో ఉన్న లక్షలాది మందికి పత్రికలను చేరువ చేసాయి. మారుమూల ప్రాంతాల నుంచి వార్తలను సేకరించి పంపించడంలో కూడా టెక్నాలజీ వెసలుబాటు కల్పించింది. పత్రికల వార్తా నివేదన వేగం, ముద్రణ వేగం, పత్రికలు పాఠకులకు చేర్చడంలో వేగం పత్రికారంగాన్ని మార్చి వేసింది, దీనితో పాటు అక్షరాస్యత, తలసరి ఆదాయం కూడా పెరగడంతో పత్రికల సర్క్యులేషన్ అనూహ్యంగా పెరిగింది. భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు తరువాత భారతీయ భాషా పత్రికలు కూడా విస్తరించాయి. ప్రభుత్వ అభివృద్ధి కార్యక్రమాల అమలులో పత్రికల పాత్ర పెరిగింది. ఇంగ్లిష్ పత్రికలతో సమానంగా భాషా పత్రికలు పెరిగాయి. పాఠకులకు ఇంతకుముందు లేని వైవిధ్యం, రకరకాల పత్రికల పోటీలో మంచి వాటిని ఎంచుకునే సౌకర్యం పెరిగింది. కంప్యూటర్ మౌజ్‌ను క్లిక్ చేస్తే చాలు వార్తా పత్రికలు ప్రత్యక్షం అయ్యే సౌకర్యం కూడా అందివచ్చింది. పత్రికలలో మహిళల పాత్ర పెరిగింది. మహిళా జర్నలిస్టుల ఉద్యోగ వనరులు అభివృద్ధి చెందాయి. మహిళా సమస్యల విశ్లేషణ, రచనలో మహిళా జర్నలిస్టులు మరింత మానవీయంగా తగిన రీతిలో ప్రతిస్పందించారు.మహిళా సాధికారికతలో మీడియా ఇంకా కీలకమైన పాత్రపోషించే అవకాశాలు ఉన్నాయి. అయితే అసమంజసంగా మీడియా మహిళా వివక్షను మరోరకంగా ప్రస్తావించడం వల్ల ప్రతికూల ఫలితాలు వస్తాయని ఈ సందర్భంలో హెచ్చరించదలచాను. అనేక మీడియా సంస్థల్లో మహిళలు కీలకమైన స్థానాల్లో ఉండడం సంతోషకరం. పత్రికా సంబంధమైన ఉద్యోగాలు పెరిగి జర్నలిస్టుల వృత్తి అభివృద్ధి చెందింది.

ఈ అభివృద్ధి వల్ల జర్నలిజం సంబంధ విద్యాసంస్థలు పెరిగాయి. విశ్వవిద్యాలయాల్లో, ఇతర సంస్థల్లో జర్నలిజం విద్యకు గిరాకీ పెరిగింది. పట్టభద్ర స్నాతకోత్తర విద్యల్లో అవకాశాలు ఏర్పడ్డాయి. డిప్లమా కోర్సులు పెరిగాయి. మాస్ కమ్యూనికేషన్ కోర్సులు ప్రవేశ పెట్టారు. జర్నలిజం విస్తరించడం వల్ల, పలుకుబడి పెరగడం వల్ల యువతరం జర్నలిజం వృత్తి వైపు మళ్లుతున్నారు. ఎలక్ట్రానిక్ మీడియాలో ఉద్యోగాల పట్ల గ్లామర్ ఏర్పడింది. అయితే ఈ మాస్ కమ్యూనికేషన్ సంస్థల్లో వనరులు, అధ్యాపకులు, విద్యా ప్రమాణాలు ఉండవలసిన రీతిలో లేవు. కోర్సులు కూడా పటిష్టంగా లేవు. మెడికల్ కౌన్సిల్, ఇంజినీరింగ్ కౌన్సిల్ వలెనే జర్నలిజం కోర్సుల ప్రమాణాలు కాపాడడానికి ఒక మండలి ఉండాలి.

పత్రికలకు వాణిజ్య ప్రకటనలు చాలా అవసరం. నగరాల్లో అయితే 70 లేదా 80 శాతం ఆదాయం అడ్వర్టయిజ్‌మెంట్స్ ద్వారానే వస్తున్నది. కనుక ప్రకటనలు ఎక్కువ స్థలాన్ని ఆక్రమిస్తున్నాయి. దానికో నిష్పత్తి లేకుండా పోయింది. ప్రకటనలు ఎక్కువై మామూలు వార్తలకు అవకాశం తగ్గిపోతున్నది. కనుక పేజీలు పెరిగినా ప్రకటనలూ పెరగడం వల్ల ఆదాయం విపరీతమై, తక్కువ ధరకు ఎక్కువ పేజీల పత్రిక అందుబాటులోకి వస్తున్నది. పత్రిక పాలసీని, దృక్కోణాన్ని కూడా ప్రకటనలు మార్చుతున్నాయి.

పరిశోధనా పాత్రికేయ రచన ఈ కాలంలో స్టింగ్ ఆపరేషన్‌గా పేరుపొందింది. దాగిన కెమెరాలతో సాగే ఈ సచిత్ర పరిశోధన కొత్త చరిత్ర సృష్టించింది. పత్రికారంగం ప్రజా ప్రయోజనాల రక్షణకుగాను ఎక్కువ అధికారాలను సంతరించుకుంది. కాని ఈ శక్తి దుర్వినియోగం అవుతోంది. ప్రముఖుల పరువు తీయడానికి, బ్లాక్ మెయిల్ చేయడానికి, ఉపయోగపడుతున్నది. ఎడిటర్లకే పరిమితమైన కీలకమైన హోదాను ఇప్పుడు పరిశోధనా జర్నలిస్టులు పొందుతున్నారు. రిపోర్టర్లు లీడ్ వార్తల రచయితలవుతున్నారు. అయితే పరిశోధనాత్మక జర్నలిజం అధికారాన్ని సొంతానికి వాడుకునే దురాచారాన్ని ఆపడానికి పరిష్కారాలు కల్పించడానికి అవకాశాలు వెతకాల్సి ఉంది.

రాజకీయాలకు, సంస్కృతికి, ఆర్థిక సామాజిక రంగాలకు లక్ష్యాలను నిర్దేశించే దశకు మీడియా ఎదిగింది. 1990లలో ఎలక్ట్రానిక్ మీడియా విస్తరించింది. ప్రజల మెదళ్ల మీద మీడియాకు పెత్తనం పెరిగింది. జనం అలవాట్లను, జీవనధోరణిని, ఇష్టాయిష్టాలను మీడియా నియంత్రిస్తున్నది. ప్రింట్ మీడియాను దాటి ఎలక్ట్రానిక్ మీడియా ప్రజలను ప్రభావితం చేయడంలో ముందుకు వెళ్లిపోయింది.

ఈనాటి రాజకీయ చిత్రం కూడా గ్లోబలైజేషన్, లిబరలైజేషన్ ప్రైవేటైజేషన్ వల్ల మారుతూ, దాని ప్రభావం మీడియా మీద కూడ పడి, జనమాధ్యమాలు కూడా మారిపోతున్నాయి. ఎలక్ట్రానిక్ మీడియా పోటీని తట్టుకోవడానికి ప్రింట్ మీడియా కొత్త వృత్తిపరమైన ప్రమాణాలను సంతరించుకుంటూ పటిష్టపడుతున్నది. మునుపులేని వైవిధ్యాలను ఇస్తూ పత్రికలు ఆకర్షిస్తున్నాయి. భాషా పత్రికలు కూడా ఈ నాణ్యతా సాధనలో ముందున్నాయి.

కాని నాలుగో మూలస్తంభం పాత్ర నిర్వహణలో పత్రికలు సఫలం కాలేకపోతున్నాయి. ప్రజల సమస్యలను విశ్లేషించే బదులు, సుపరిపాలనా విధానాలను చర్చించే బదులు, కేవలం లాభార్జనల వెంట పడి గిరాకి వత్తిడులకు లొంగిపోయి గోరంతలు కొండంతలు చేయడం, కొండలను గోరంతలు చేయడం, అనవసర సంచలనాలు కలిగించడం, కార్పొరేట్ అవసరాలకు అనుగుణంగా కమ్యూనికేషన్‌కు కావలసిన రంగులు పూయడం వంటి పనులకు పత్రికలు పాల్పడుతున్నాయి. ప్రకటన దారులు, కార్పొరేట్ రంగాల ప్రయోజనాలను రక్షించే అసలు లక్ష్యాన్ని తమ లాభార్జన అవసరాలను దాచి, పాఠకుల అవసరాలకు అనుగుణంగా పత్రికలలో అంశాలు రూపొందిస్తున్నాం అనే వాదం చాటున తమ పక్షపాతాన్ని నిజాల వక్రీకరణను దాచే ప్రయత్నం చేయడం శోచనీయం. టెక్నాలజీ పుణ్యమా అని ఈ రోజు ప్రతిపత్రికా వెబ్‌లో ఎప్పటికప్పుడు తాజా వార్తలను ఇస్తూ పాఠకులకు అందుబాటులో ఉంటున్నాయి. పాఠకులు మామూలు వార్తా విశేషాలతో సంతృప్తి చెందడం లేదు. జరుగుతున్న అంశాలతో పాటు విశ్లేషణను కోరుకుంటున్నారు. కాని దురదృష్టవశాత్తూ ఎక్కువ కాపీలు అమ్ముకోవడం, ఎక్కువ ప్రకటనలు సాధించడం కోసం పత్రికలను వ్యాపార వస్తువులుగా మార్చాయి. మీడియా సంస్థలు వ్యాపార సంస్థలుగా మారాయి. జర్నలిజం ఈరోజు ఒక వృత్తి వ్యాపారం మాత్రమే. లక్ష్యసాధనకు కృషి చేసే మిషన్ కాదు.

తెలిసి తెలిసి నాలుగో వ్యవస్థ బాధ్యతలను విస్మరించింది మీడియా. ఒక్క మాటలో చెప్పాలంటే ఈ ధోరణి దురదృష్టకరమైందే కాకుండా పౌర సమాజం తీవ్రంగా ఖండించవలసిన పరిస్థితిలో మీడియా ఉంది.

మొదట్లో వార్తాపత్రికలు మేధావి వర్గానికి చెందిన మధ్యతరగతి ఆ పై తరగతి పౌరులు ప్రారంభించేవారు. వారి లక్ష్యం లాభాలు కాదు. సాంఘిక సంస్కరణలు, స్వాతంత్ర్యం లక్ష్యం. సర్క్యులేషన్ పరిమితంగా ఉండేది. కీలకమైన విషయాలను చిన్నవి చేసి చూపడం, చిన్నవిషయాలను సంచలనం చేయడం జరిగేది కాదు. కాని భారత మీడియా క్రమంగా కార్పొరేట్ పరం అయిపోయింది. పెద్ద పత్రికలు కార్పొరేట్ సంస్థల చేతిలోకి వెళ్లాయి. అందులో వార్తలు, వ్యాసాలు అన్నీ కార్పొరేట్ అవసరాలకు అనుగుణంగా మలచడం మొదలైంది. బలహీనుల సమస్యలకు మసి పూయడం, తీవ్రమైన జాతీయ సమస్యలను సరిగ్గా విశ్లేషించకపోవడం ఎక్కువైంది. 2004లో మీడియా ధోరణలను విశ్లేషించిన సెంటర్ ఫర్ మీడియా స్టడీస్ మాస్ మీడియా విస్తృతి అంతగా లేదని, ఒక్కొక్క మీడియా విడిగా అభివృద్ధి చెందినా జన బాహుళ్యంలోకి వెళ్లలేదని, ఆర్థికరంగంలో అట్టడుగున ఉన్న వర్గాల సమస్యలను పూర్తిగా వదిలేసారని నివేదించింది.

పెద్ద మీడియా హౌజెస్ విస్తరణ, మీడియా కార్పొరైటైజేషన్ వెరసి గుత్తాధిపత్యం వైపు నడుస్తున్నాయి. ఇది తీవ్రమైన విపరిణామం. చిన్న, మధ్యతరగతి పత్రికలు, ప్రాంతీయ పత్రికలు, గ్రామాల్లో సర్క్యులేషన్ ఉన్న పత్రికలు ఆర్థిక ఇబ్బందుల్లో ఇరుక్కుపోతున్నాయి. పోటీని తట్టుకోలేకపోతున్నాయి. పెద్దపత్రికలు జిల్లాలను కూడా ఆక్రమిస్తున్నాయి. ఏం చేసైనా సరే ప్రత్యర్థులను నిర్మూలించి తమ వ్యాపారాన్ని విస్తరించాలనే కొత్త దురాక్రమణ ధోరణి పెరిగిపోయింది. అన్ని రకాల గొంతులను వినిపించే రాజకీయ వ్యవస్థలో ఆ గొంతుకలకు చోటు కల్పించే విభిన్న మీడియా అవసరం. మరోకోణం, వార్తకు ఆవైపు చూపే వారులేరు. ఒక మూసలో ఉన్న విషయమే జనానికి చేర్చే గుత్తాధి పత్యం మీడియాలో విస్తరించడం ప్రజాస్వామ్యానికి మంచిది కాదు.

ఇతర వ్యవస్థలవలె మీడియా కూడా తప్పుడు పనులకు అవినీతికి పాల్పడుతున్నది. బాహాటంగా కొన్ని, రహస్యంగాకొన్ని అక్రమాలకు పాల్పడుతున్నది. ఎల్లో జర్నలిజం, బ్లాక్ మెయిలింగ్ మనకు తెలిసిన దుష్ట ధోరణులు. కాని పైకి కనపడకుండా తెరచాటున మీడియా సాగించే అవినీతి వల్ల కలిగే నష్టం అపారం. వక్రీకరణ, తప్పుడు సమాచారం గుప్పించడం, వార్తల విక్రయం (వార్తల రూపంలో ప్రకటనలు, లేదా ప్రకటనలు అని చెప్పకుండా వార్తల్లో అనుకూలంగా రాసినందుకు డబ్బు వసూలు చేయడం), నిజాలను, సామాన్యుల సమస్యలను దాచడం, కార్పొరేట్ అవసరాలను తీర్చడం మీడియాకు ఇప్పుడు నిత్యకృత్యం అయిపోయింది. కొందరు రాజకీయ నాయకులను, వర్గాలను వ్యాపార ప్రముఖులను, పెద్దగా చూపడం, వారి కరపత్రాలుగా మారడం, వినోద కార్యక్రమాలలో వార్తలను జొప్పించడం, సానుకూల వార్తలు వ్యాసాలు సృష్టించడం, ఇంటర్వ్యూలు, సర్వేలు, వ్యాసరచన, సమీక్ష పేరుతో వ్యతిరేకుల పరువుతీసే వార్తలు రాయడం రంగులద్దిన సమాచార ప్రసారం ఈరోజు మీడియా పనిగా మారింది. పౌర సమాజానికి వార్తలు చేరవేసే ప్రజాస్వామ్య బాధ్యతలను మరిచి మీడియా లాభాల కోసం మసిపూసిన సమాచారాన్ని ఇవ్వడం ఇక విషాదం. విదేశీ పర్యటనలు, ఖరీదైన బహుమతులు, నగదు లాభాలు ఇచ్చి జర్నలిస్టులను వశపరుచు కుంటున్నారు. దీంతో వీరి కలం వారికి అనుగుణంగా రాస్తుంది. వారిపైన విమర్శలు వచ్చే సమయంలో మెత్త బడుతుంది. వారి ప్రయోజనాలను మాత్రమే చెప్తుంది. ఈ కలాలు రాసే విషయాల వల్ల సమాజానికి ఏ ప్రయోజనమూ ఉండదు.

గత పార్లమెంటు ఎన్నికల్లో, మీడియా ముఖ్యంగా పత్రికలు రాజకీయ నాయకులతో రహస్య ఒప్పందాలు చేసుకుని వారికి అనుకూలమైన రీతిలో వార్తలు రాసేందుకు, వారికి వ్యతిరేకాంశాలు రాయకుండా ఉండేందుకు, వారి ప్రత్యర్థులకు వ్యతిరేకంగా వార్తలు సృష్టించేందుకు రేటు కట్టి డబ్బు వసూలు చేశాయి. దీన్ని పెయిడ్ న్యూస్ వార్తా విక్రయ ధోరణి అనవలసి వస్తున్నది. జర్నలిస్టు సంఘాలు, ప్రముఖులు ఈ ధోరణులను విమర్శించారు. ఎన్నికల తరువాత ఆంధ్రప్రదేశ్ జూబిలీ హాల్‌లో ఆంధ్రప్రదేశ్ యూనియన్ ఆఫ్ జర్నలిస్టు ఒక సదస్సు నిర్వహించింది. ఈ ధోరణులపై వివరాలు సేకరించి లోతైన పరిశీలన చేసేందుకు, వార్తా విక్రయ ధోరణులను విశ్లేషించేందుకు ప్రెస్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా ఒక కమిటీ వేసింది. పత్రికలకు భావ ప్రకటనా స్వాతంత్ర్యం ఉన్నది తప్పుడు సమాచారం ఇవ్వడానికి కాదు. డబ్బు కోసం వక్రీకరించడానికి, ఒక వర్గాన్ని గొప్పచేసిచూపడానికి కాదు.

మీడియా విచారణ, కోర్టు విచారణలో ఉన్న అంశాలపై రచన, కోర్టు విశేషాల వక్రీకరణ ప్రస్తుత సమస్యలు. ఈ అంశాలను చర్చించడానికి భారత ప్రధాన న్యాయమూర్తి, సుప్రీంకోర్టు లీగల్ సర్వీసెస్ అథారిటీ, ప్రెస్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా, ఎడిటర్స్ గిల్డ్ ఆఫ్ ఇండియా, ఇండియన్ లా ఇన్‌స్టిట్యూట్‌లు సమిష్టిగా ఒక జాతీయ సదస్సును నిర్వహించాయి. ప్రాంతీయ సమావేశాలు కూడా కొచ్చిన్, భువనేశ్వర్, ముంబై, గువాహతిలో నిర్వహించారు. కోర్టు ప్రొసీడింగ్స్ రచనల్లో ఒక శిక్షణా కార్యక్రమం కూడా నిర్వహించారు.

ఇదివరకు పత్రికల్లో సంపాదకుడు అచ్చయ్యే అంశాలకు నిర్ణేతగా ఉండేవాడు. ప్రకటనల పైన కూడా అదుపు ఉండేది. ఈరోజు సంపాదకుని పాత్ర నానాటికీ బలహీనం చేశారు. వార్తాపత్రికల్లో అంశాల నిర్ణయంలో సంపాదకుని ప్రమేయం క్రమంగా తగ్గిపోయింది. మేనేజర్లు, అడ్వర్టయిజ్‌మెంట్ డైరెక్టర్లు నిర్ణయాలు తీసుకుంటున్నారు. అంటే పత్రికల్లో అచ్చయ్యే అంశాలను ఏవిధంగా ఎవరి ప్రయోజనాలను రక్షించడానికి అవకాశం ఉందో దీన్ని బట్టి అర్థం చేసుకోవచ్చు. పత్రిక వినియోగ వస్తువు, వార్త వినియోగ పదార్థం, ప్రజలను విజ్ఞానవంతులు చేయాల్సిన బాధ్యత, సుపరిపాలన అంశాలచర్చ, ప్రజల సమస్యలపైన విశ్లేషణ వివరణలు పూర్తిగా వదిలేశారు. తమ పాఠకులకు అవసరాలకు అనుగుణంగా వార్తలు రాస్తున్నామని మీడియా ప్రతినిధులు సమావేశాల్లో ధైర్యంగా చెప్తున్నారు. పాఠకులు ఫలానా విధంగా వార్తలు ఉండాలని కోరుకుంటున్నారనడానికి ఈ సర్వేలు పరిశోధనలు లేవు. కేవలం ఆదాయం కోసం వార్తాంశాలను తీర్చిదిద్దే ప్రయత్నాలు తప్ప మరేదీ లేదు. పాఠకులు రంగుపూసిన వార్తలు, కార్పొరేట్ అవసర వ్యాఖ్యలు మౌనంగా భరిస్తున్నారు. అంత మాత్రాన మీడియానైతిక సూత్రాలకు అనుగుణంగా ఉన్నాయని భావించడానికి వీల్లేదు. జనచైతన్యానికి దోహదం చేసే సమాచారం ఇవ్వాలి కాని, వారిలో జాడ్యం నింపి, వారి

*గుజరాత్‌లో ముస్లింలపై జరిగిన మారణకాండకు నిరసనగా, మానవీయ స్పందనగా వచ్చిన సినిమాలను, సాహిత్యాన్ని పరిచయం చేస్తున్నారు* **పి.వి. రమణ**

# రెండు సినిమాలు - ఒక నవల

*(గత సంచిక తరువాయి)*

## ఫైర్‌ప్రూఫ్ (గుజరాత్ మానవ విషాదం) – నవల

నవల ప్రారంభమే చాలా విచిత్రంగా ఉంటుంది. 'ఇందు మూలంగా తెలియ చేయునదేమనగా' అంటూ చనిపోయినవారి శవాలు, పుస్తకం, తువ్వాలు, వాచీ, డొక్కు టి.వి. లాంటి వస్తువులు మాట్లాడతాయి.

ముందుమాటగా అనేక విషయాలు చెపుతూ 'ఎందుకంటారా. మేమందరం చనిపోయాం. ఫిబ్రవరి 28, 2002 ఉదయం నుండి మమ్మల్ని ఒకరిద్దరి చొప్పున, ముగ్గురి గానూ, లేదా పుంజీలుగానూ, వీలును బట్టి ముప్ఫై, నలభై, ఏభై, అరవై, డెబ్భై, ఎనభై గానూ, అప్పుడప్పుడు తొంభయ్యేసి మందిని చిల్లరగానూ, టోకుగానూ మమ్మల్ని చంపేసారు. ఒక లెక్క ప్రకారం వెయ్యి మంది ఉంటాం. అంతకంటే ఎక్కువా కావచ్చు. తక్కువా కావచ్చు. మమ్మల్నందరినీ ఒకరి మీదొకర్ని గుట్టగా పేరిస్తే ఆకాశంలో వరల్డ్ ట్రేడ్ సెంటర్ జంట శిఖరాల ఎత్తుకు చేరుకుంటాం. బహుశా, మూడు ఖండాల అవతల మూడు సముద్రాల అవతల, నాశనమైన ఆకాశపుటందాలను పునరుద్ధరించగలం. రక్త మాంసాల గోపురంలా (ఇది ఉదాహరణగా ఇచ్చిన పోలిక మాత్రమే సుమండీ. ఇది మా ఉద్దేశమనుకోకండి. మేం వివాదాలకు దూరం సుమా) అంటూ వారికి 'చావు అనేది అలసత్వానికి కారణం కాకూడదని దుఃఖం అనేది సోమరితనానికి దారి తీయకూడదనే భావించాం. మా కన్నిటితో మంటలను చల్లార్చే బదులు మరింత మెరుగైన భావి జీవనానికి, న్యాయం పొందడానికి ప్రయత్నించడం మంచిదని తలచాం' అంటూ చివరన వారి సంతకాలు ఉంటాయి.

కథంతా 'అతను' చెపుతాడు. అతడు విధ్వంసంలో పాల్గొన్న వ్యక్తి. ఆ సమయంలో అతని భార్య హాస్పిటల్‌లో ప్రసవించడానికి సిద్ధంగా ఉంటుంది. ముందు మాటలు చెప్పిన వారిలో మిస్ గ్లాస్ అతనికి ఫోన్ చేసి హోలీ ఏంజిల్ హాస్పిటల్‌లో బిడ్డ పుట్టాడని చెపుతుంది. ఆ బిడ్డ మానవాకారంతో ఉండడు. పొడవాటి సన్నని ఆనపకాయ కానీ, గుమ్మడి కాయను కానీ, పొయ్యిమీద కాల్చి, వెంటనే తీసేయగా రెండు చివర్లూ మాడి ముచిక ముడతలు పడినట్లు, రెక్కలనీ, ముందున్న తొండాలనీ, కడుపు మిగిలిన పెద్దసైజు పురుగు, ఈకలు పీకేసి, కాళ్లనూ, రెక్కలనూ కోసి, చర్మం వలిచిన మెడలేని పక్షిలాంటి వింత ఆకారంలో ఉంటాడు. తండ్రి అతనికి 'సందేహం' అని పేరు పెట్టుకుంటాడు.

మిస్ గ్లాస్ అతని బిడ్డను సరిచెయ్యడానికి ఒక చోటుకు రమ్మని పిలుస్తుంది. బిడ్డ బాగవుతుందేమో అనే ఆశతో అతను ఆమె ఎవరు తెలియక పోయినా వెళతాడు. దారిలో చదవమని, కొన్ని ఫొటోలు, కాగితాలు ఇస్తుంది. ఆ రోజు ఉదయాన శవాల వాన కురుస్తుంది. ఆకాశం నుండి శవాలు పడతాయి. అతని కథ నడుస్తుండగా మధ్యలో శవాలు, సాక్షులు, వస్తువులు తమ కథల్ని వినిపిస్తాయి. టాక్సీ డ్రైవర్, ప్రేక్షకుడు, డాక్టర్, మొదటిసాక్షి తారీఖ్, రెండవసాక్షి షబ్నం, మూడవసాక్షి

---

చైతన్య వార్తాభిరుచిని నశింపచేసే విధంగా వార్తలు రాయడం న్యాయం కాదు. జాతి ద్రోహుల నుంచి జనాన్ని కాపాడే కాపలాకుక్క 'వాచ్‌డాగ్'గా మీడియా ఉండాలి.

2006లో జాతీయ ప్రెస్ డే సందర్భంగా ఆనాటి రాష్ట్రపతి డాక్టర్ ఎ పి జె అబ్దుల్ కలాం మాటలను ఉటంకిస్తాను. జాతీయ యజ్ఞంలో మీడియా భాగస్వామికావాలి. సానుకూల అంశాలను ఎత్తిచూసి, సంక్లిష్ట సమస్యలకు జాతీయస్థాయిలో సంప్రదింపులు జరిపి పరిష్కారాలు చూపాలని అబ్దుల్ కలాం అన్నారు. బహుజన హితాయ, బహుజన సుఖాయ సూత్రానికి అనుగుణంగా జన బాహుళ్యం సంక్షేమానికై చైతన్యవంతమైన భారత నిర్మాణానికి మీడియా నిరంతరం కృషి చేయాలి. కొందరు మహా సంపన్నులై, చాలామంది నిరుపేదలుగా దిగజారే అసమానతలను తొలగించడానికి కృషి చేయాలి. ఆర్థిక పురోగతి, అందరినీ ముందుకు తీసుకుపోవడం అనేవి అసలు లక్ష్యాలు. ఈ జాతి జీవనంలో పత్రికలు ఎప్పుడూ ముందుండి నడిపించాయి. స్వాతంత్ర్యం తరువాత దశాబ్దాల్లో మీడియా నైతిక విలువలు దిగజారినా భారతీయ పత్రికల్లో ఇంకా మౌలిక విలువలు స్ఫూర్తిదాయకంగా మిగిలే ఉన్నాయి. తీవ్ర సమస్యలు వచ్చిన ప్రతిసారీ మీడియా జాతికి చేయూతనిచ్చింది. ఈ కొత్త సమకాలీన పాత్రికేయ నూతనాధ్యాయంలో, మిరుమిట్లు గొలిపే వినోద విప్లవంలో, సమాచార విస్ఫోటనంలో, సాంకేతిక పరిజ్ఞాన వెల్లువలో, పోటాపోటీ ప్రపంచీకరణలో, మీడియా కొంత ఆత్మపరిశీలన చేసుకోవలసిన అవసరం ఉంది. నాలుగో వ్యవస్థ ప్రాధాన్యం కాపాడుకుంటూ మీడియా స్వార్థంతో రాజీ పడకుండా ఉండాలి. భిన్న మతాల, భిన్న భాషల, భిన్న జాతులతో కూడిన దేశం మనది. మన సామాజిక జీవనం సున్నితమైంది. ఈ జీవనాన్ని దెబ్బతీసే ఏ చర్యను ప్రోత్సహించరాదు. నిప్పు, దీపం రెండూ వెలుగునిస్తాయి. మీడియా నాశనం చేసే నిప్పుకాకుండా దారిచూపే దీపమై ఉండాలి. వీ

అబ్బా, హెడ్‌నర్సుల శవాలు తమ పట్ల జరిగిన దుర్మార్గాన్ని, తమను చంపేసిన విధానాన్ని వివరిస్తాయి. శవాల సాక్ష్యాలు ఆనాడు జరిగిన, తమపై అమలైన హృదయవిదారక, అత్యంత పాశవికమైన మారణకాండను వివరిస్తాయి.

ప్రాణం లేని పుస్తకం, గడియారం, టవల్‌లతో చేత సాక్ష్యాలు ఇప్పించడం ద్వారా రచయిత సమాజంలో గూడుకట్టుకున్న మౌనాన్ని, భయాన్ని ప్రశ్నిస్తాడు.

స్టేజీ మీది నుంచి పుస్తకం, వాచ్, టవల్, తమ సాక్ష్యాలు వినిపిస్తాయి. 'నా పేరు లెర్నింగ్ టు కమ్యునికేట్. నేను ఢిల్లీలో రూపుదిద్దుకున్నాను. నా 124 పేజీల్లో చాలా భాగం లండన్లో తయారయ్యాయి. ముంబాయిలో ప్యాక్ చేసారు. మేమందరం తలో చోటికి వెళ్లాం. నేను తారిఖ్ అనే పిల్లవాడింటికి వెళ్లాను' అని పుస్తకం వాళ్లింట్లో జరిగింది చెపుతుంది. 'మీకు తెలుసుగా నాకు సమయం అంటే ప్రాణం. అదీ నా ఊపిరి. పుస్తకాల్లాగా ఏ ఊరిలో పుట్టానో, ఏ యంత్రం తయారు చేసిందో, ఏ పెట్టెలో పెట్టారో లాంటి సొల్లు మాటలు నాకు సరిపడవు. షబ్నం నాన్న చేతికి ఉన్న నేను అతనితో నగరాన్ని చుట్టుముట్టి వచ్చాను. ఇంటికి రాగానే నగరంలో గొడవలు జరుగుతున్నాయని షబ్నం అమ్మకు చెప్పి, భయంలేదు మన వీధిలో పార్లమెంటు సభ్యుడున్నాడు. మనకేం ఫరవాలేదని ధైర్యం చెప్పాడు. ఇంతలో వాళ్లొచ్చారు. నాన్న మోకాళ్ల మీద సాగిలపడి ప్రాధేయపడ్డాడు. వారిలో ఒకడు నాన్న నోరు తెరవమని రెండోవాడు నాలిక పట్టుకొని తెగ్గోసాడు. ఒకడు నన్ను ఊడబెరికి కిటికీలోంచి బయటకు విసిరేసాడు. వచ్చి రోడ్డు మీద పడ్డాను' అని వాచీ చెప్పింది.

'మీ ఇద్దరి లాగా నేను చూస్తూ ఉండలేదు. వాళ్ల హత్యకాండకు సాయపడ్డాను. నా మీద రక్తముంది. అదీ ఒక ఆడకూతురి రక్తం. అబ్బా కోడలిది. ఆమె పెనుగులాడింది. వల్ల కాలేదు. ఆమె చాలా బలహీనంగా ఉంది. పైగా గర్భిణి. గోడకు జారపడి ఒరిగిపోయింది. వాడామె నోరు నొక్కి రెండో చేత్తో పాంటు విప్పుకుంటుంటే చూసాను. ఆమె అరవలేదు. కరవనైనా లేదు. నిశ్చలంగా కళ్లు మూసుకుంది. మరొకడు నన్ను తీసుకుని ఆమె నోటిలో కుక్కాడు. ఆమె అరవకుండా నిరోధించే పనిని నాకు పెట్టారు. మొదటివాడు పని కానిచ్చుకున్నాక మరొకని వంతు. తరువాత తుడుచుకునేందుకు నేనే దొరికాను. కోడలి పిల్లను చంపడానికి నేనే తోడ్పడ్డాను. నిజంగానే సహకరించాను. నన్ను ఆమె మెడకు బిగించారు. ఆమె తల నేల మీద వేళ్లాడింది. తరవాత కత్తి తీసుకుని ఆమెను నిలువుగా చీల్చారు. కత్తిని నా మడతలతో తుడిచారు. ఆమె గర్భాన్ని చీల్చారు. పిండాన్ని వెలికితీసారు' అని తువ్వాలు చెప్పింది.

అతను అనే మిస్టర్ 'జె' చివరగా 'విగతజీవుల మాటలు వినొద్దని మీకు మొదట్లోనే చెప్పాను. వాళ్లక్కావలసిందల్లా ఒక్కటే. వాళ్లను, నన్ను ఎదరపెట్టుకుని ఇద్దర్లోనూ ఎవరు కావాలో తేల్చుకోమంటారు. చనిపోయిన వాళ్లను బతుకున్న వాళ్లను ఎంచుకోమంటారు. మీరు విన్న ప్రతి మాటనూ నూటికి 99.99 శాతం నమ్మొద్దని మొదటే చెప్పాను. విభేదించండి. వివాదం చెయ్యండి. భూమిలోకి లోతుగా పాతిపెట్టండి. దానిమీద కంకర వెయ్యండి. మట్టితో నింపండి. ఎందుటాకులు కప్పండి.

మోసంతో బిడ్డనిచ్చి, మోసం చేసేందుకు వాడిని సరిచేస్తామని చెప్పి, ఆ వంకతో ప్రాణాలకు తెగించి నేను నగర వీధులు తిరిగేలా చేసారు. స్టేజీ మీద ప్రాణం లేని వస్తువులను కుర్చీల మీద కూర్చోబెట్టి వాటి చేత వాగించారు. చివరకు చచ్చి పోయినామెను తీసుకువచ్చి నన్ను నేరస్తునిగా నిలబెట్టారు. లాభం లేదు. ఈ ఉచ్చులో ఎంతమాత్రం ఉండదల్చుకోలేదు. అందుకని పరిగెత్తి పారిపోయి, హోల్ ఏంజిల్స్ ఆస్పత్రికి వెళ్లాను. దారిలో శవాలు, షబ్నం తల్లిదండ్రులు, తారిఖ్ తల్లి లాంటి వారెందరివో మాటలు వినబడుతున్నాయి. కానీ చనిపోయిన వారి స్వరాలకు బదులు నా కంఠ స్వరమే వినబడుతుంది. కానీ నేను మాట్లాడటం లేదు. చివరకు నా భార్యా బిడ్డలు ఉన్న మంచం దగ్గరకు వెళ్లాను. వాళ్లు గాఢ నిద్రలో ఉన్నారు. నా బిడ్డ తెల్లని తువ్వాల్లో పరున్నాడు. వాళ్లమ్మనూ బిడ్డనూ చూడాలని వంగాను. అన్నీ బాగానే ఉన్నాయి. కళ్లు, ముక్కు, నోరు, పెదాలు, చెవులు, చిన్న కనుబొమ్మలు.. కనుబొమ్మలపైన ముడిపడిన భ్రుకుటి....

*గజగజ వణుకుతున్నాను. / చివరగా చెప్పేదేమనగా...*

ఈ దిగువ సంతకం దారులమైన మేం పాఠకులైన మీకు చెప్పదలచినదేమంటే ఇది మిస్టర్ 'జె' కథనం. అతని కథనంలో మేమెలాంటి మార్పులు చేయలేదు. మొత్తం మీద మేం కాపురం ఉంటున్న 12,000 ఇళ్లను, బతుకుతెరువు కోసం నడుపుతున్న 14,000 దుకాణాలను అంటించారు.

ఆత్మను తమలోనే ఉంచుకున్న సజీవ మానవులు ఆత్మవంచన చేసుకోవడం ఎంత తేలిక. మిస్ గ్లాస్ ఇలాంటపుడు వచ్చి జ్ఞాపకాలను తుడిచెయ్య మంటుంది. కక్ష, కోసం పెట్టుకోవద్దంటుంది. బతుకున్న వాళ్లు ముందుకు సాగాలి. వాళ్లకు కాలం చాలదు. మనకా, చనిపోయిన వాళ్లకు అంతా విరామమే. ఆరామమే. మిస్ గ్లాస్ ఇంకా చాలా చెయ్యమంటుంది. మిస్టర్ 'జె' చేత తన తప్పిదాన్ని ఒప్పించి, సందేహం తల్లికి సాయపడినట్లే తారిఖ్‌కు, షబ్నంకు సహాయపడాలంటుంది.

అబ్బో అదంతా చాలా కాలం పడుతుందంటం మేం. సందేహం విషయంలో లాగా ఒక పగలు, ఒక రాత్రి తీసుకున్నా మధ్యలో ఒక రోజు విశ్రాంతి అనుకున్నా తొమ్మిది, పది ఏళ్లు పడుతుంది.

అయితే ఏమయింది? కంగారెందుకు? మనందరం ఎలాగో చనిపోయాం కదా! అని అంటుందామె. ఇలా అంటూ ఆమె నవ్వుతుంది. మరుగుజ్జు తోడురాగా పైనున్న వినీలాకాశంలో మేఘాల కోట గుమ్మాల నుండి, మంటలుకంటుకొని మర్మ ప్రాసాదంలోని మధురావాసం నుంచి, కిందున్న మసిబారిన నగరానికి దేవతలా దిగివస్తుంది.

నవలలో పైన చెప్పిన విషయాలే కాకుండా ఇంకా అనేక విశేషాలున్నాయి. ఒక 'మేజిక' లాంటి చిత్రమైన సన్నివేశాన్ని సృష్టించి, తద్వారా జరిగిన దారుణాలను వివరిస్తూ పాఠకుల్ని తీవ్రమైన ఒత్తిడికి గురిచేస్తాడు రచయిత. మిస్ గ్లాస్ చెప్పినట్లు చేయాల్సింది చాలా ఉంది. మనమేం చెయ్యాలో నిర్ణయించుకోవడమే మిగిలింది.

సమాజం పట్ల బాధ్యతతో, ఆవేదనతో, జరిగిన దారుణాల్ని మానవీయ కోణంలో అద్భుతంగా ఆవిష్కరించి, మంట గలిపిన మానవత్వాన్ని తిరిగి నిలబెట్టాలనే తపన పడిన దర్శకుడు రాహుల్ ఢోలకియా, దర్శకురాలు నందితా దాస్, రచయిత రాజ్ కమల్ ఝా, అనువాదకుడు కస్తూరి గార్లకు కృతజ్ఞతలతో.

*(అయిపోయింది)*

*యూనివర్సిటీ ఆఫ్ మిషిగాన్ – డియర్ బార్న్‌లో తత్వశాస్త్ర ఆచార్యులుగా పనిచేస్తున్న* **డానియెల్ లిటిల్** *'ది సైంటిఫిక్ మార్క్స్', 'అండర్‌స్టాండింగ్ పీజెంట్ చైనా', 'వెరైటీస్ ఆఫ్ సోషల్ ఎక్స్‌ప్లనేషన్', 'ఆన్ ది రిలయబిలిటీ ఆఫ్ ఎకనమిక్ మాడల్స్', 'ది పారడాక్స్ ఆఫ్ వెల్త్ అండ్ పావర్టీ' వంటి పుస్తకాలు రచించారు. మార్క్సిజం గురించి కొన్ని వివాదాస్పద వ్యాఖ్యలు ఉన్నప్పటికీ ఆలోచనాస్ఫోరకమైన ఈ వ్యాసాన్ని చర్చ కోసం ప్రచురిస్తున్నాం.*

# మార్క్సిజం - పరిశోధనా పద్ధతి

*(గత సంచిక తరువాయి)*

మరి మార్క్స్ స్వయంగా ఉపయోగించిన సంవిధానం (మెథడ్) రేషనల్ చాయిస్ పద్ధతి ఒకదానికొకటి పొంతన కుదురుతాయా? కుదురుతుందే అని నాకు అనిపిస్తుంది. మొట్టమొదట, రాజకీయార్థిక శాస్త్ర పరికరాలను మార్క్స్ ఉపయోగించిన తీరు, పెట్టుబడిదారీ విధానపు చలన నియమాల గురించి ఆయన చేసిన ప్రధాన నిర్ధారణలు, వ్యక్తిగత హేతుబద్ధత అనే ప్రాతిపదిక మీదనే ఆధారపడతాయి. రెండవది, సంవిధానం గురించి మార్క్స్ ఆలోచన అంతా పైననే వివరించినట్టు అనేక శాస్త్రాల నుంచి గ్రహించాలనేదే. అంటే, తన విశ్లేషణకు ఇతోధికమైన, పటుత్వమైన అనుభవవాద, సైద్ధాంతిక సమర్థనను ఇవ్వగలిగిన ఏ దృక్కోణాన్ని ఆయన నిరాకరించలేదు. మార్క్స్ సుప్రసిద్ధ నిర్ధారణల అట్టడుగున రేషనల్ చాయిస్ ఆలోచనలను గుర్తించడం సాధ్యమే. ఉదాహరణకు, లాభాల రేటు పడిపోతుందని మార్క్స్ చేసిన వాదన ఓల్సన్ చేసిన వాదన మీదనే ఆధారపడినట్టు కనబడుతుంది. ఒక వ్యక్తిగత పెట్టుబడిదారు ప్రయోజనాలకు, పెట్టుబడిదారుల వర్గ ప్రయోజనాలకు మధ్య వైరుధ్యం ఉంటుందని ఓల్సన్ అన్నాడు. ఇది కచ్చితంగా రేషనల్ చాయిస్ సిద్ధాంతపు వాదనే.

అందువల్ల మార్క్స్ పరిశోధనా పద్ధతి ప్రత్యేక తరహా అయినదేమీ కాదు. అది మార్క్సిస్టేతర సామాజిక శాస్త్ర పద్ధతి నుంచి స్పష్టంగా వేరు చేసి చూపగలిగినది కాదు. అనుభవాలనూ, చరిత్రనూ జాగ్రత్తగా పరిశోధించవలసిన అవసరం గురించి మార్క్స్ నొక్కి చెప్పాడు. వివరణాత్మకమైన పరికల్పనలను పటిష్టంగా రూపొందిస్తే, అవి సామాజిక పర్యవసానాలను వివరించగలవని, ఊహించగలవని ఆయన భావించాడు. ఒక ప్రత్యేక తరహా చారిత్రక వ్యాఖ్యానానికి మాత్రమే ఆయన ఎప్పుడూ తనను తాను ముడివేసుకోలేదు. (రష్యన్ ఆర్థికాభివృద్ధి గురించి వేరా జెసూలిచ్‌కు రాసిన ఉత్తరాలలో ఆయన తన సందిగ్ధతను ఎలా ప్రకటించాడో చూడండి.) అంతేకాదు, ఆయన తన పరిశోధనను ఒక ఉన్నతస్థాయి పరిశోధనా పరికల్పనల సమూహం చుట్టూ నిర్మించాడు. వర్గం సార్వత్రికమైనదని, సామాజిక వ్యవస్థలకు ఉండే భౌతిక పునాదులు ముఖ్యమైనవని, భావజాలం ఎలా పనిచేస్తుందో చూడాలని ఆ పరికల్పనలు చెబుతాయి. చివరిగా మార్క్స్ ఇచ్చినది ఒక సంక్లిష్టమైన సామాజిక వివరణా నమూనా. కంటికి కనబడే అంశాల మధ్య మొరటు సంబంధాలను చూపడం ద్వారా కాక, అంతర్గత కార్యకారణ సంబంధాల ద్వారా దృగ్గోచరాంశాలను వివరించాలని ఆ నమూనా చెబుతుంది. ఈ దృక్పథం వల్ల ఆయన పరికల్పనలను రూపొందించడంలో చాలా జాగ్రత్త వహించాడు. నిజానికి, ఈ దృక్పథం ఇవ్వాళ్టి సామాజిక శాస్త్ర పరిశోధనా ప్రామాణాలకు సంపూర్ణంగా సరిపోయేది.

సామాజిక శాస్త్రాలకు సంబంధించినంత వరకే ఒక విస్పష్టమైన జ్ఞానసిద్ధాంతం ఉన్నదని మార్క్స్ అనుకున్నాడా? సిద్ధాంతానికి, పరిశోధనకు సంబంధించిన విషయాలు చర్చిస్తున్న క్రమంలో ఆయనకు అటువంటి జ్ఞానసిద్ధాంతం ఏదీ లేదని నాకనిపిస్తుంది. ఆయన జ్ఞాన సిద్ధాంతం ఇవ్వాళ మనం వాస్తవికతావాద అనుభవవాదమని పిలవ గలిగిన దానితో పోల్చవచ్చును. పరిశీలన, ప్రయోగం, చారిత్రక పరీక్ష వంటి అనుభవవాద పద్ధతులను తగినట్టుగా వాడడం ద్వారా కొన్ని పరికల్పనలను మదింపు వేసినప్పుడు మన కంటికి కనబడని వ్యవస్థల గురించి దాదాపు సత్యమైన నిర్ధారణలకు చేరుతామని, ఆ నిర్ధారణలనే శాస్త్రీయ పరిజ్ఞానం అనుకుంటామని అది చెబుతుంది. సాపేక్షికంగా ఉండే 'జ్ఞానానికి సంబంధించిన సామాజిక అవగాహన' అనే భావనను మార్క్స్ సొంత రచనలు ఆమోదించవు. ఆ అవగాహన ప్రకారం ఒక జ్ఞానపు విశ్వసనీయత పరిశోధకుడి సామాజిక వర్గ దృక్పథం మీదనే ఆధారపడి ఉంటుంది. అందుకు భిన్నంగా, సామాజిక ప్రపంచం గురించి అనుభవవాద పద్ధతుల పునాది పైన, సైద్ధాంతిక తర్క పునాదిపైన గ్రహించవచ్చునని, అవి స్థిరమైన విశ్వాసాలుగా ఉంటాయనే నమ్మకం మీద మార్క్స్ ఉపయోగించిన జ్ఞాన సిద్ధాంతం ఆధారపడింది.

మరి అధిభౌతికవాదం సంగతి ఏమిటి? అస్తిత్వం గురించిన చింతన సంగతి ఏమిటి? ఇక్కడ మాత్రం మార్క్స్ కృషి స్పష్టంగా ఉన్నదని అనిపిస్తుంది. సమాజాల గురించి, చారిత్రక క్రమాల గురించి ఆయన కొన్ని అధిభౌతిక ప్రాతిపదికలను నమ్మి వాటి దగ్గర ప్రారంభించాడు. సామాజిక ప్రపంచం కార్యకారణ సంబంధాలతో నిర్మాణమయింది. సామాజిక వ్యవస్థలు తమవైన లక్షణాలను కలిగి ఉంటాయి. కార్యకారణ సంబంధమైన లక్షణాలు కలిగి ఉంటాయి. సామాజిక వ్యవస్థలలో వ్యక్తులు తమ కార్యాచరణల ద్వారా, ఎంపికల ద్వారా పాల్గొంటారు. 'సామాజిక నిర్మాణాలను' 'ఉత్పత్తి విధానాలు' అనే వర్గీకరణల కింద చూడవలసి ఉంటుంది. ఈ ఉత్పత్తి విధానం అనేది కొన్ని రకాల ఉత్పత్తి శక్తుల, ఉత్పత్తి సంబంధాల సమాహారంగా ఉంటుంది. సమాజంలో

వర్గాలుంటాయి – ఇవి ఆ ప్రాతిపదికలు. మార్క్స్ చేసిన సామాజిక అస్తిత్వ చింతనలో ఈ ప్రాతిపదికలలో ప్రతి ఒక్క దానికి పాత్ర ఉంది. ప్రపంచంలో ఉనికిలో ఉన్న అన్ని అస్తిత్వాలకూ, సంబంధాలకూ ఈ ప్రాతిపదికలు సరిపోతాయని, ఒక అర్థంలో అవి నిర్దిష్టమైన అనుభవవాద నిర్ధారణ చేయకముందుకూడా ఉంటాయని ఆయన అనుకున్నాడు. అంటే దానర్థం వాటిని అనుభవవాద పరిశీలన ద్వారా గుర్తించలేమని కాదు. ఈ అస్తిత్వ చింతనకు గీటురాయి ఈ ప్రాతిపదికలకు లోబడిన నిర్దిష్ట సిద్ధాంతాల వాస్తవిక గెలుపు ఓటముల మీదనే ఆధారపడి ఉంది.

మార్క్స్ చేసిన అస్తిత్వ చింతనలో ఇంకా చాలా నిర్దిష్ట భావాలు కూడా ఉన్నాయి. ఉత్పత్తి శక్తులు, సంబంధాల భావనలు ఆయన పరిశోధనకు కీలకం. ఒక ప్రత్యేక సమాజంలో ఉనికిలో ఉన్న సాంకేతిక పరిజ్ఞాన స్థాయి, ఆ సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించుకునే వ్యవస్థా నిర్మాణాల నేపథ్యం ఈ భావాలలో ఇమిడి ఉంటాయి. ఈ భావాల జంటను సారాంశంలో చెప్పాలంటే సాంకేతిక పరిజ్ఞానం – అధికారం అని చెప్పవచ్చు. అలాగే మార్క్స్ చేసిన అస్తిత్వ చింతనలో దోపిడీ భావన కూడా కీలకమైనదే. అది ఒక సంబంధాన్ని వివరిస్తుంది. ఇతరుల శ్రమకాలాన్ని కొందరు వ్యక్తులు కానీ, బృందాలు కానీ తమ అదుపులో ఉంచుకొని దానికి ప్రతిఫలం చెల్లించకుండా ప్రయోజనం పొందే నేపథ్యాన్ని ఇది వివరిస్తుంది. శ్రమ విలువ సిద్ధాంతం, అదనపు విలువ సిద్ధాంతం ఈ దోపిడీ గురించి సిద్ధాంతీకరించడానికి ఒక విశ్లేషణా చట్రాన్ని సమకూరుస్తాయి. అలాగే మార్క్స్ ఉపయోగించిన పరాయీకరణ, సరుకుల ఆరాధన, అద్భుతీకరణ వంటి భావాలు కూడా ఆయన చేసిన సామాజిక అస్తిత్వ చింతనకు పునాదిని సమకూర్చాయి. వ్యక్తులకు చైతన్యమూ, స్వేచ్ఛా ఉంటాయి. కాని, ఎల్లవేళలా వాళ్లు తమను తాము కొన్ని వ్యవస్థల లోపల, కొన్ని భావాల లోపల మాత్రమే చూసుకుంటారు. ఆ వ్యవస్థలూ, భావాలూ వారిని శాసించే సంబంధాల పట్ల వాళ్ల అవగాహనను నిర్ణయిస్తాయి. అందుకే 'మనుషులే చరిత్ర నిర్మాతలు, కాని వాళ్లు ఏ పరిస్థితులలో చరిత్రను నిర్మిస్తారో ఆ పరిస్థితులు వాళ్లు తయారు చేసినవి కావు' అన్నాడు మార్క్స్.

## ఇరవయో శతాబ్ది సామాజిక శాస్త్రంపై మార్క్స్ ప్రభావం

ఇప్పుడిక మనం మార్క్సియన్ సామాజిక శాస్త్రంలో ఇమిడి ఉన్న 'పరిశోధనా శైలి' గురించి చర్చిద్దాం. ఈ అంశాలు సామాజిక శాస్త్ర పరిశోధనకు మార్క్స్ చేసిన ప్రధాన దోహదాలేమిటో, కనీసం నా అవగాహన ప్రకారం, వివరిస్తాయి. మార్క్స్ రచనల్లో ఒక కచ్చితమైన 'పరిశోధనా శైలి' ఉంది. అటువంటి ప్రాతిపదికల మీద, దృక్పథాల మీద సాగే తరువాతి పరిశోధకులందరు అనుసరించిన శైలి అదే. ఇరవయో శతాబ్ది సామాజిక శాస్త్రాలకు మార్క్స్ రచనల ద్వారా అందిన అత్యంత ప్రధానమైన కానుకలేమిటో అన్వేషించడానికి ప్రయత్నిద్దాం. స్థూలంగా చూస్తే ఈ కింది ముఖ్యమైన ఇతివృత్తాలు కనబడతాయి :

- ప్రజల గురించి కానీ, సామాజిక మార్పు గురించి కానీ చర్చించేటప్పుడు వర్గ ప్రాముఖ్యత మీద నొక్కి చెప్పడం.
- ఉత్పత్తిని, సాంకేతిక పరిజ్ఞానాన్ని, ఆస్తిని నిర్ధారించే వ్యవస్థల (ఉత్పత్తి విధానం, ఉత్పత్తి శక్తులు, ఉత్పత్తి సంబంధాలు) మీద దృష్టి.
- పరాయీకరణ భావన.
- విలువ సిద్ధాంతం, అదనపు విలువ సిద్ధాంతం.
- పెట్టుబడిదారీ విధానం గురించిన ఆర్థిక సిద్ధాంత రూపకల్పన.
- దోపిడీ సిద్ధాంతం.
- యూరప్ చరిత్రలో పెట్టుబడిదారీ పూర్వ దశ గురించి అర్థం చేసుకునే చట్రం, ఆసియా గురించి కొన్ని ఆలోచనలు.
- పెట్టుబడిదారీ విధానానికి ప్రత్యామ్నాయాల గురించి – సోషలిస్ట్ నిర్మాణాల గురించి – కొన్ని ఆలోచనలు.

ఈ అంశాలను సామాజిక పరిశోధన కొరకు ఉపయోగపడే విషయ పరిజ్ఞానభరితమైన సంవిధాన సూచనల వరుసగా గుర్తించవచ్చు. ఆ విధంగానే ఇవన్నీ ఇరవయో శతాబ్ది సామాజిక శాస్త్ర, చరిత్ర పరిశోధన మీద అసామాన్యమైన ప్రభావాన్ని చూపాయి :

- ఆస్తి, సాంకేతిక పరిజ్ఞానం, శ్రమ వంటి 'భౌతిక' వ్యవస్థల మీద అన్వేషణ సాగింది.
- భావజాలం, రాజ్యం, సంస్కృతి వంటి 'భౌతికేతర' నిర్మాణాలను ఒక నిర్దిష్ట సామాజిక ఉత్పత్తి, నియంత్రణ వ్యవస్థలో వాటి పాత్ర అనే దృష్టికోణం నుంచి పరీక్షించడం జరిగింది.
- విభిన్న బృందాల మధ్య సాగే దోపిడీ స్వభావాన్ని, ఆ దోపిడీ సాగడానికి వీలు కల్పించే ఆధిపత్య విధానాలను, తత్ఫలితంగా పెల్లుబికే పోరాట రూపాలను పరీక్షించడం జరిగింది.
- సామాజిక వ్యవస్థల లోపల మనుషులు ఎటువంటి అనుభవాలను గడిస్తారో వాటి పైన శ్రద్ధ పెట్టడం జరిగింది.
- నిత్య జీవితానుభవం, దోపిడీ, ప్రవర్తన, ప్రోత్సాహకాలు, సామాజిక మార్పు వంటి వాటన్నిటిలో వర్గ వ్యవస్థల కుదురును కనిపెట్టడం జరిగింది.
- సమాజంలో వ్యక్తుల కార్యాచరణను మిళితం చేసుకునే, నిరంతరం సాగుతూ ఉండే ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక వ్యవస్థలను గుర్తించడం జరిగింది.

ఈ అన్ని కార్యక్రమాలు చూస్తే, సామాజిక శాస్త్ర పరిశోధన కొరకు మార్క్స్ ఒక స్పష్టమైన సంవిధానం ఏదీ ఇచ్చినట్టు కనిపించదు. అందుకు భిన్నంగా, పెట్టుబడిదారీ విధానంలోని విభిన్న అంశాలను వర్ణించే, వివరించే ఒక ప్రయత్నాన్ని, విభిన్న ఆలోచనలు కలగలసిన, భౌతిక వాస్తవికతలో చూడదగిన ప్రయత్నాన్ని ఆయన సూచించాడు. కొన్ని పరికల్పనలు, కొన్ని ఊహలు, కొన్ని అస్తిత్వ చింతన నుంచి రూపొందిన నిర్ధారణలు కలగలసిన ఒక భావాల కుటుంబం మీద ఆధారపడిన పరిశోధనా శైలిని మార్క్స్ మనకిచ్చాడు. ఇటువంటి పరిశోధన ద్వారా ఆయన సామాజిక శాస్త్రానికి చాలా గరిష్టమైన దోహదం చేశాడు. అది, కొన్ని వివరణాత్మక, సైద్ధాంతిక విశ్లేషణల రూపంలో ఉంది. ప్రత్యేకించి విభిన్న వ్యవస్థల అంతర్గత నిర్మాణం, పెట్టుబడిదారీ విధానపు చలనశీలత, సామాజిక ప్రవర్తనల గురించి ఆయన చేసిన విశ్లేషణలు విలువైనవి. మార్క్స్ సామాజిక పరిశోధనా పద్ధతిలో గతితార్కిక ఆలోచన ఒక భాగం కాదు. ఎక్కువలో ఎక్కువ అది 'వైరుధ్యాలను కనిపెట్టే' పరికల్పనా వనరు మాత్రమే. చివరిగా ప్రస్తుత రేషనల్ చాయిస్ సిద్ధాంతం, న్యూక్లాసికల్ అర్థశాస్త్రం ఇచ్చే పరికరాలు మార్క్స్ ఆలోచనలకు చాలా ఎక్కువగా సరిపోతాయి.

ఇలా చూసినప్పుడు మార్క్స్ పరిశోధనా సంగ్రహం ఒక సమగ్రమైన బోధన కాదు. అది ఏదో ఒక తోలు సంచిలో ఇమిడి ఉన్న తర్కశాస్త్ర గ్రంథం కాదు. అది ఎక్కువగా ఒక పరిశోధనా కార్యక్రమంలా ఉంటుంది. విశాలమైన పరికల్పనల సమూహంగా ఉంటుంది. పరిశోధించవలసిన సారావంతమైన క్షేత్రాల గురించి సూచనలుగా ఉంటుంది. ఆలోచనా చట్రాల వివరణలను, సిద్ధాంతాలను, వ్యాఖ్యానాలను సూచించేదిగా ఉంటుంది. శ్రమ విలువ సిద్ధాంతం లాంటి కొన్ని లాంఛనప్రాయమైన సిద్ధాంత శకలాలు కూడా ఉంటాయి. ఈ మొత్తం కార్యక్రమం లోపల పనిచేయాలంటే, ఇప్పటివరకూ సాగిన సారవంతమైన పరిశోధనల ఉదాహరణలు జాగ్రత్తగా అధ్యయనం చేసి, సముచిత పరిజ్ఞానం సంపాదించాలి. ఆ పరిజ్ఞానం ఆధారంగా ఎవరి రంగంలో వారు సృజనాత్మకంగా సామాజిక పరిశోధన కొనసాగించాలి. అలాగే ఈ సందర్భంలో సేబెల్ రాసిన 'వర్క్ అండ్ పాలిటిక్స్' వంటి ఉత్తమమైన మార్క్సిస్టేతర కృషిని కూడా పరిగణనలోకి తీసుకోవాలి.

పరిశోధనకు మార్గదర్శకత్వం వహించే కొన్ని పాటించవలసిన నియమాల మొత్తాన్నే 'సంవిధానం' అంటారు. కచ్చితంగా మార్క్స్ అటువంటి నియమాల సమూహాన్ని మనకివ్వలేదు. చెప్పాలంటే ఆయన ఎక్కువలో ఎక్కువ ఒక సాధారణమైన సూచన మాత్రం చేస్తాడు. ఆ సూచన ఎలా ఉంటుందంటే :

- సిద్ధాంతాలనూ, పరికల్పనలనూ తయారు చేయండి.
- అందుబాటులో ఉన్న వాస్తవిక, చారిత్రక సమాచారాన్ని జాగ్రత్తగా అధ్యయనం చేయండి.
- ఆ సమాచారంలో మన పరికల్పనలకు సరిపోయేట్టుగా ఉన్న 'క్రమాలను' కనిపెట్టండి.
- వాస్తవిక అనుభవవాద పరిశీలన నుంచి పరికల్పనలను అంచనా కట్టండి.

మార్క్స్ సంవిధానం ఎంత విశాలంగానూ, సమ్మిశ్రణంగానూ ఉన్నప్పటికీ, దానిలో ఆచరించవలసిన భాగాలు ఇలా ఉంటాయి :

- భౌతిక నిర్మాణాలను పరీక్షించండి.
- వర్గం, అధికారం, దోపిడీ, ఆధిపత్యాలను చూడండి.
- భౌతిక దత్తాంశాలకు భిన్నంగా ఉన్న అంశాలను విస్మరించకండి.
- చారిత్రక క్రమాలలో భాగంగా పనిచేసే 'వైరుధ్యాల' గురించి శ్రద్ధ పెట్టండి.
- దానిలో అంతర్గతంగా ఉన్న కారణాలను, నిర్మాణాలను పరిశీలించండి.

మరి, ఒక యువ సామాజిక శాస్త్రవేత్తనో, చరిత్రకారుడినో ఈ అవగాహనతో వృత్తి పర పరిశోధకుడిగా తయారు చేయడానికి మనం ఏం చేయాలి? ఒక యువ జీవశాస్త్రవేత్తనో, భౌతిక శాస్త్రవేత్తనో తయారు చేసినట్టుగానే, సామాజిక శాస్త్రవేత్తను తయారు చేయవచ్చునా? కుదరదు. అది అసాధ్యం. సామాజిక శాస్త్రాలు ప్రకృతి శాస్త్రాల కన్న భిన్నమైనవి. అవి అంతర్గతంగానే అస్పష్టమైనవి. విభిన్న అంశాల కలయికతో రూపొందినవి. దానికి కారణం సామాజిక దృగ్గోచరాంశాల స్వభావంలోనే ఉంది. ప్రకృతి శాస్త్రాలలోనయితే కచ్చితంగా నిర్ణయించిన పరిశోధనా వ్యూహాలు, ప్రయోగశాల పద్ధతులు, పునాది సిద్ధాంతాలు ఉంటాయి. కనుక ఒక యువ, కణ జీవశాస్త్రవేత్త చాలా నిర్దిష్టమైన, కచ్చితమైన సిద్ధాంతాల చలనాల, వ్యవస్థల చట్రం మీద నైపుణ్యం సంపాదిస్తే చాలు. అలాగే, ప్రయోగపరత్వం గురించి, పరిశోధన గురించి సాధికారిక వ్యూహాలు తెలుసుకుంటే చాలు. కాని సామాజిక శాస్త్రాల విషయం పూర్తిగా భిన్నమైనది. అక్కడ సమాజం గురించిన సాధారణ సిద్ధాంతం ఏదీ లేదు. సామాజిక పరిశోధన గురించి అందరూ అంగీకరించే పరిశీలనా పద్ధతి ఏదీ లేదు. కనుక సామాజిక శాస్త్రాలలో ప్రవేశిస్తున్న యువ పరిశోధకులకు ఇవ్వగల ఉత్తమ సలహా ఏమంటే, అన్నీ తెలుసుకోండి. ఏ భావానికి తలుపులు మూయకండి. రకరకాల పరికరాలను ఉపయోగించడం నేర్చుకోండి. అన్ని వివరణా వ్యూహాలు తెలుసుకోండి. అన్ని రకాల పునాది పరికల్పనలు సామాజిక పరిశోధనకు సంబంధించిన బలమైన ఉదాహరణలు తెలుసుకోండి. పాత తరాల సామాజిక శాస్త్రవేత్తలలో, పరిశోధకులలో ప్రతిభావంతులైన వారందరి గురించి, వారి పరిశోధనా చట్రాలు ఏవైనప్పటికీ, వీలైనంత ఎక్కువ తెలుసుకోండి. అప్పుడు మీరు పరిశోధించదలచుకున్న, మీకు ఆసక్తి ఉన్న దృగ్గోచరాంశాలు విశాల దృష్టితో పరిశీలించండి.

### ముగింపు

సామాజిక శాస్త్ర పరిశోధనకు మార్క్స్ అందించిన ప్రధాన కానుకలలో కొన్నిటి గురించి ఇక్కడ మనం విహంగ వీక్షణం చేసాం. అలాగే మార్క్సిస్ట్ సామాజిక పరిశోధనకు ఇరవయో శతాబ్ది ఆలోచనా పరులలో కొందరు చేర్చిన అతి ముఖ్యమైన భావనలను పరిశీలించాం. 'మార్క్సిస్ట్ సామాజిక శాస్త్రం' అనేదేదైనా ఉందా? మాలిక్యూలర్ బయాలజీ లాంటి పరిశోధనా చట్రం నుంచి చూసినప్పుడు అటువంటి దేమీ లేదు. కాని, వేరువేరు రకాల పరికల్పనలు, నిర్ధారణలు, శక్తిమంతమైన వ్యాఖ్యానాలు వంటి వాటితో ప్రేరణ పొందిన విశాలమైన పరిశోధనా కార్యక్రమం అనే అర్థం చూస్తే మార్క్సిస్ట్ సామాజిక శాస్త్రం ఉంది. పరిశోధకులు తమ సొంత పరిశోధనా సమస్యలతో వ్యవహరించే టప్పుడు ఇదంతా దృష్టిలో పెట్టుకోవాలి.

సామాజిక శాస్త్ర పరిశోధనలో ఇంత విశాల దృక్పథం వహించ వలసి రావడానికి మౌలిక కారణం సామాజిక అంశాల స్వభావంలోనే ఉంది. సామాజిక ప్రపంచం క్రమబద్ధమైనది కాదు. అది కచ్చితంగా కార్యకారణ సంబంధాలతో నడిచే నియమబద్ధమైన వ్యవస్థ కాదు. అందుకు బదులుగా అది ఎన్నో విభిన్నమైన ఒకదానికి వ్యతిరేకంగా ఒకటి సాగే క్రమాల, వ్యవస్థల, నిర్మాణాల సమ్మిశ్రణం. ఈ క్రమాలన్నీ మనుషుల ఉద్దేశపూర్వకమైన, అర్థవంతమైన కార్యాచరణ ద్వారా సాగుతూ ఉంటాయి. వాళ్లు ఆ పనులన్నిటినీ ఒక నిర్దిష్ట, సాంస్కృతిక, భౌతిక వ్యవస్థల లోపల సాగిస్తూ ఉంటారు. ఆ వ్యవస్థలు ఒకదానితో ఒకటి ఒక సందర్భంలో పద్ధతి ప్రకారం, మరొక సందర్భంలో యాదృచ్ఛికంగానూ ప్రవర్తిస్తూ ఉంటాయి.

ఈ బహుళ ప్రపంచాన్ని అర్థం చేసుకోవడానికి మార్క్సిస్ట్ ఆలోచన మనకు చాలా ఉపయోగపడుతుంది. ఎందుకంటే, అది కూడా సముచితంగా బహుళత్వంతో తయారయింది.

*(అయిపోయింది)* వీ

భూగోళ ఆవిర్భావం, ప్రాణుల పుట్టుక, మనిషి పుట్టుకల గురించి అనాదిగా సాగుతున్న అశాస్త్రీయ భయాలను, మూఢనమ్మకాలను జీవపరిణామ జ్ఞానంతో, శాస్త్రీయ దృష్టితో అధిగమించాలంటున్నారు **డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్**

# మనుషుల ఆవిర్భావం

ఆధునిక మానవజాతి లక్షా, లక్షన్నర సంవత్సరాల కిందట మొదలైనట్టుగా తెలుస్తోంది. మనిషి సగటు జీవితకాలం 70-80 ఏళ్లు కనక ఇది చాలా సుదీర్ఘమైన చరిత్రలాగా అనిపిస్తుంది. ఎటొచ్చీ భూమి వయస్సుతో పోలిస్తే మాత్రం ఇది రెప్పపాటుతో సమానం. ఎందుకంటే సూర్యుడూ, భూమీ, తక్కిన గ్రహాలూ ఆవిర్భవించి సుమారు 460 కోట్ల సంవత్సరాలయింది. అంటే 46,000 లక్షల సంవత్సరాలన్నమాట. మనుషులకన్నా భూమి ఎంత పురాతనమైనదో దీన్నిబట్టి తెలుసుకోవచ్చు. ఆ తరవాత కూడా మనిషిజాతి ఆవిర్భావం సూటిగా, "ఎవరో" ఉద్దేశించినట్టుగా మాత్రం జరగలేదు. జీవపరిణామమంతా లాటరీ పద్ధతిలో, క్రమరహితంగా జరిగిన వ్యవహారమే. మొదట్లో లావావంటి ద్రవాలతో కాగుతూ ఉండిన భూమి చల్లబడ్డాక రూపొందిన అతిపురాతనమైన శిలలు సుమారు 380 కోట్ల సంవత్సరాలనాటివి. తొలి జీవ పదార్థపు తయారీ ఆ తరవాత 30-40 కోట్ల సంవత్సరాల లోపునే జరిగి ఉండవచ్చు. దీనికి అవసరమైన జీవరసాయనిక పదార్థాలు అంతరిక్షం నుంచి ఉల్కలూ, తోక చుక్కల రూపంలో వచ్చి పడి ఉంటాయని శాస్త్రవేత్తలు భావిస్తున్నారు. పాన్‌స్పెర్మియా అనే ఈ సిద్ధాంతం ప్రకారం ఇటువంటి కణాలు గ్రహాలన్నిటిమీదా కురుస్తూనే ఉన్నప్పటికీ "మొలకెత్తేందుకు" అనువైన పరిస్థితులు ఒక్క భూగ్రహం మీద మాత్రమే ఉన్నాయి. వందలకోట్ల సంవత్సరాల కిందట, సౌరవ్యవస్థ రూపొందుతున్న కాలంలో ఇటువంటి ఉల్కాపాతం చాలా ఎక్కువగా జరుగుతూ ఉండేదట. పునరుత్పత్తిని సాధించగలిగిన తొలి జీవకణాలు యాదృచ్ఛికంగా ఆవిర్భవించాయి. ఇందుకు చాలాకాలం పట్టింది.

ఈ కాలవ్యవధిలో మొట్టమొదటి ప్రోకేరియోట్ జీవకణాలు రమారమి 350 కోట్ల సంవత్సరాల కిందట పుట్టుకొచ్చినట్టుగా తెలుస్తోంది. విశేషమేమిటంటే పాచి, నాచువంటి ఈ పదార్థమంతా ఏకకణ జీవులుగానే 300 కోట్ల సంవత్సరాలపాటు కొనసాగింది. అంటే జీవరాశి చరిత్ర దాదాపు పూర్తిగా ప్రోకేరియోట్‌జాతి కణాలదే. తరవాతి కాలంలో ఆవిర్భవించిన మొక్కల, జంతువుల యూకేరియోట్ జీవకణాల్లో మామూలుగా కనబడే న్యూక్లియస్ (కేంద్రకం), ఇతర నిర్మాణ విశేషాలూ ప్రోకేరియోట్ కణాలలో ఉండవు. ప్రస్తుతం కొన్నిరకాల బాక్టీరియా మాత్రమే ఈ జాతికి చెందినవిగా కనిపిస్తాయి. వీటిలో కొన్నిటికి ఆక్సిజన్ అవసరం కూడా ఉండదు. భూగ్రహం రూపొందిన తొలియుగాల్లో వాతావరణంలో ఆక్సిజన్ ఉండేది కాదుగనక ఇటువంటివి వర్ధిల్లడానికి ఆటంకం ఉండేది కాదు. ప్రాణికోటిలో పెద్దపెట్టున వైవిధ్యం మొదలైనది దాదాపు 53 కోట్ల సంవత్సరాల క్రితమే. అంటే భూమి వయస్సుతో పోలిస్తే మనవంటి జీవరాశి వయస్సు చాలా తక్కువన్నమాట. మొదటి 400 కోట్ల సంవత్సరాల కాలంలో ఎవ్వరైనా గ్రహాంతర యాత్రికులు భూమిని సందర్శించినట్టయితే వారికి కనబడే జీవపదార్థం కేవలం నాచులాంటిది మాత్రమే అయి ఉండేది. గత 53 కోట్ల సంవత్సరాల కాలంలో నరవానరాలకు భిన్నమైన పద్ధతిలో మనుషులు ఆవిర్భవించి గట్టిగా 40 లక్షల ఏళ్లు కూడా కాలేదు. హోమో సేపియన్స్ అనబడే ఆధునికమానవులు లక్షన్నర సంవత్సరాల కిందట ఆవిర్భవించారు.

ఈ సంఖ్యలను జాగ్రత్తగా గమనించినట్టయితే జీవపరిణామం ఎంత అనియతంగా, హెచ్చు తగ్గులతో కొనసాగుతూ వచ్చిందో తెలుస్తుంది. కొన్నిరకాల జలచరాలు పుట్టడం, పెరగడం, అంతరించి పోవడం, కాల్షియం మొదలైన పదార్థాలతో కూడుకున్న వాటి అవశేషాలు సముద్ర గర్భంలో పేరుకుని పలురకాల రసాయనిక మార్పులను కలిగించడం, కొత్త పరిస్థితులకు అనువైన ఇతర జాతులు పుట్టుకు రావడం వగైరాలన్నీ అచ్చంగా భౌతిక, రసాయనిక ప్రేరణలవల్ల కలిగిన పరిణామాలే. మొక్కలు కదలవు. వాతావరణంలోని కార్బన్ డయాక్సైడ్‌ను పీల్చుకుని ఆక్సిజన్‌ను విడుదలచేసిన వృక్షజాతులు ఆక్సిజన్ పీల్చి బతికే జంతువుల ఆవిర్భావానికి దోహదపడ్డాయి. కిరణసంయోగంకన్నా ఆక్సిజన్ ఎక్కువ శక్తినిస్తుంది కనకనే జంతువులు కదలగలవు. ఈ పరిణామాలన్నిటికీ లంకెలున్నాయి. వీటిలో ప్రతి ఒక్కటీ తరవాతి మార్పులకు కారణం అవుతూ వచ్చాయి. జీవకణాలు పుట్టిన ఎంతో కాలానికిగాని మానవజాతి రూపొందలేదు. అందుకనే ఈ ప్రపంచమంతా మనుషుల కోసమే అనే భావన అర్థంలేనిదిగా అనిపిస్తుంది. అంతేకాక మనిషీ, దేవుడూ, జీవాత్మా, పరమాత్మా అంటూ మనవాళ్లు అల్లుకునే ఊహలు ఎంత సంకుచితమైనవో తెలుస్తుంది.

సూర్యుడి నుంచి తగుమాత్రం దూరంలో ఉండినందువల్లనే భూమిమీద ద్రవ, ఘన, వాయు రూపాల్లో నీరు విరివిగా లభిస్తుందనీ, నీటిలో జరిగిన జీవరసాయనిక ప్రక్రియల ద్వారా జీవకణాలు రూపొంది, పరిణామం చెందగలిగిన పరిస్థితులు ఒనగూడాయనీ శాస్త్రవేత్తలు చెపుతారు. ప్రాథమిక స్థాయిలో మొదలైన తొలి జీవకణాలు భూమి వయస్సులో అధికభాగం గడిచేదాకా ఒకే పద్ధతిలో కొనసాగిన తరవాత ఒక్క పెట్టున పెనుమార్పులు కలిగాయంటే సృష్టికర్తకు అకస్మాత్తుగా కనువిప్పు కలిగిందో, మనసు మార్చుకున్నాడో అనికాదు. భూమి మీది భౌతిక, వాతావరణ పరిస్థితులు అకస్మాత్తుగా పరివర్తన చెందడమో,

జీవకణాల్లో జన్యుమార్పులు జరగడమో అందుకు కారణం. భూగర్భంలో నిరంతరమూ జరిగే బలమైన ప్రక్రియల ప్రభావం రకరకాల రూపాల్లో ఉపరితలంమీద కలుగుతూ ఉంటుంది. ఇవన్నీ కాలానుగుణంగా హెచ్చుతగ్గులతో జీవరాశిలో వ్యత్యాసాలను కలిగించగలవు. మనుషులు తమ గురించి ఎంత గొప్పగా ఊహించుకున్నప్పటికీ మనిషి జాతి కూడా లుకలుక లాడుతూ ఉండిన క్రిమికీటకాదులనుంచి పుట్టుకొచ్చినదే కనక ఈ సంఘటనలన్నీ మన చరిత్రలోని భాగాలే. విశ్వాంతరాళం, పాలపుంత గేలక్సీ, సూర్యుడూ, గ్రహాల సముదాయం, భూమీ, అంతులేని వైవిధ్యం కలిగిన జీవరాశీ వీటన్నిటితోనూ మన ఉనికికి ప్రమేయం ఉంది. ఇవన్నీ లెక్కలోకి తీసుకోకుండా, 'సృష్టి రహస్యాలను' కేవలం రెండున్నరవేల ఏళ్ల కిందట కూర్చబడిన వేదాలూ, తదితర సాహిత్యంలోనూ, ఆ తరవాతి కాలానికి చెందిన బైబిల్, కురాన్ మొదలైన మతగ్రంథాల్లోనూ వెతుక్కునే అవివేకులందరూ వేదాంతులుగా చలామణీ అవుతూ ఉంటారు. జీవపదార్థం, జీవ పరిణామం గురించిగాని, మానవశాస్త్రం, సాంఘిక పరిణామాల గురించిగాని ఏ మాత్రమూ అవగాహన లేనివారు వేదాంతం ప్రవచిస్తూ ఇహలోక బాధలకు పరలోకంలో పరిష్కారం ఉందని నమ్ముతూ, నమ్మిస్తూ ఉంటారు. ప్రాణుల పుటక, పెరుగుదల అంటే ఏమిటో తెలుసుకోకుండా, చావు ఎందుకు, ఎలా వస్తుందో అర్థం చేసుకోకుండా మరణాంతర జీవితం, పునర్జన్మ అని జపంచేస్తూ ఉంటారు.

డార్విన్ జీవపరిణామ సిద్ధాంతాన్ని బట్టి చూస్తే ప్రాణులకు నియమితమైన జీవితకాలం ఉండడం సబబుగానే అనిపిస్తుంది. మారుతున్న భౌతికపరిస్థితులకు అనువైన శరీరలక్షణాలు రూపొందే అవకాశం ఎప్పటికప్పుడు స్వల్ప జన్యు వ్యత్యాసాలతో పుట్టుకొచ్చే కొత్తతరానికే ఎక్కువగా ఉంటుంది. అందుచేత మనుగడకై జన్యువుల మధ్య పోటీగా జరిగిన వడపోత కార్యక్రమంలో చావు అనేది ప్రకృతిలో జరిగిన ఏర్పాటు. ఇది డీఎన్ఏ స్థాయిలో రూపొందిన పరిణామం దీనికి ఏ ప్రాణీ అతీతం కాదు. ఎటొచ్చీ ప్రాణులు బతికున్నన్నాళ్లూ ప్రమాదాలకు లోనవకుండా తమ ప్రాణాలను కాపాడుకోవడమే లక్ష్యంగా జీవిస్తాయి కనక చావంటే ఎవరికీ ఇష్టం ఉండదు. అమరులుగా ఉండిపోవా లనుకోవడం మాత్రం తీరని కోరికే.

స్వర్గనరకాలను గురించీ, అతీతశక్తుల గురించీ, మరణానంతర జీవితం గురించీ, పునర్జన్మల గురించీ చెప్పే ఆధ్యాత్మికవాదులూ, మతప్రవక్తలూ ఇదే ధోరణిని వ్యక్తపరుస్తారు. ఇవన్నీ కొంతవరకూ మనుషులకు ఆశావాద దృక్పథాన్ని కలిగించి, వారి సామాజిక ప్రవర్తనను నియంత్రిస్తాయన్నది నిజమేకాని వారి హేతువాద వైఖరినీ, సామాజిక మార్పులకై జరిపే ప్రయత్నాలనూ బాగా దెబ్బతీస్తాయి. అందుకని వీటి గురించిన స్పష్టమైన అవగాహన అందరికీ అవసరం. దేవుళ్లూ, పూనకాలూ, దెయ్యాలూ, చేతబడులూ, ప్రేతాత్మలూ అన్నీ ఎంతో ప్రాచీన కాలం నుంచీ కొనసాగుతున్న మూఢనమ్మకాలు. చావు విషయంలో మనకూ, ఊరకుక్కలకూ, బొద్దింకలకూ తేడా ఏమీ ఉండదని నమ్మడం ఏ మనిషికైనా చాలా కష్టమే. ఇది కేవలం మనస్తత్వానికి పరిమితమైనది కాదు. ఉన్నవీ, లేనివీ కల్పించుకునే అనవసరమైన ఊహాశక్తి ప్రకృతి సిద్ధంగా మన మెదడుకు అలవడిన లక్షణమనీ, పూర్తిగా హేతువాద వైఖరి కలిగినవారు చాలా అరుదుగా ఉంటారనీ మెదడుపై జరుగుతున్న ఆధునిక పరిశోధనలవల్ల తెలుస్తోంది. చావు గురించిన భావనలు కూడా అందులో భాగమే.

జీవపరిణామక్రమంలో మనుషులవంటి ప్రాణుల్లో జరిగే మార్పులు ఇతర పద్ధతుల్లో కూడా పనిచేస్తాయి. ఆఫీసుల్లో సాఫ్ట్‌వేర్ నిమిత్తమై కొని ఉంచిన కంప్యూటర్లను ఉద్యోగస్తులు అప్పుడప్పుడూ తమ కాలక్షేపానికని పేకాటవంటివాటికి ఉపయోగించినట్టే మన మెదడు కూడా కొన్ని "దురుప యోగాలకు" లోనవుతుంది. ఇంద్రియాల ద్వారా మెదడుకు అందుతున్న సమాచారంతో బాటుగా మనం మన పరిసరాలను అనుక్షణమూ గమనిస్తూ, వాటిలో సక్రమంగా అనిపించే పేటర్న్‌లను గుర్తిస్తూ ఉంటాం. క్రూర జంతువుల కదలికలనూ, ఋతువుల్లో మార్పులనూ గుర్తించడం తొలి మానవులకు చాలా లాభించింది. మరొక వంక చీకటిని గురించిన భయాలూ, నీడలను చూసి జడుసు కోవడమూ, మారుమోగే ప్రతిధ్వనులవల్ల బెదురూకూడా మొదలయాయి. తాడును చూసి పామనుకున్నట్టుగా వీటిలో కొన్ని తప్పుడు అవగాహనలకూ, అపోహలకూ కూడా కారణమవుతాయి. ఒకదానితో సంబంధంలేని మరొక సంఘటనను మొదటి దానితో జోడిస్తూ అనేకసార్లు మనం తప్పుడు నిర్ధారణలు చేస్తూ ఉంటాం. కాకతాళీయం, సింగినాదం జీలకర్ర మొదలైన తప్పుడు అన్వయాలకు కారణం అదే. జాతకాలూ, గ్రహబలం, వాస్తుపిచ్చి, ఉంగరాల ప్రభావం, దిష్టిబొమ్మలూ, వశీకరణమంత్రాలూ అన్నిటికీ ఇటువంటి నమ్మకాలే ఆధారం.

అష్టావధానాలు చేసే పుంగవులు కూడా తమకు వచ్చీరాని జ్యోతిష్యం, వశీకరణం మొదలైన వాటితో జనాన్ని మోసంచేస్తూ, తమ ప్రయత్నాలు భంగపడినప్పుడు దొరికిపోతూ, వీలున్నప్పుడు కబ్జాలకూ, కుతంత్రాలకూ ఒడిగడుతూ "పేరు" సంపాదించుకుంటున్నారంటే దానికి విద్యాధికుల అవివేకంకూడా ఒక కారణమే. ప్రసిద్ధ పత్రికలన్నీ క్రమం తప్పకుండా అక్కడక్కడా ఆధ్యాత్మిక పేజీలనూ, తక్కినచోట్ల అశ్లీల సాహిత్యాన్నీ, బూతు సినిమా వార్తలనూ యథాశక్తి ప్రచురిస్తూ తమ వంతు బాధ్యతను నిర్వర్తిస్తూ ఉంటాయి. దైవశక్తీ, డబ్బుశక్తీ ఒకదాన్నొకటి ప్రోత్సహిస్తూ ముందుకు సాగుతాయి. ఇవి మనుషులను మరింతగా తప్పుదారి పట్టించే విషయాలు.

ప్రస్తుతం విజ్ఞానశాస్త్రం అణువుల, పరమాణువుల అంతర్ నిర్మాణాన్నీ, విశ్వాంతరాళపు సుదూరపు అంచులనూ కూడా నిశితంగా పరిశీలించి పరిశోధనలు జరుపుతోంది. ఇంతవరకూ ఎవరికీ, ఎక్కడా ఒక్క "అతీత" అణువు ఆచూకీ కూడా దొరకలేదు. రోదసిలో మన స్థానం ఎటువంటిదో, భూమి మీది ప్రాణుల వైవిధ్యం ఎంత విస్తృత మైనదో, అందులో మనుషులు ఎప్పుడు, ఎలా ఆవిర్భవించి ఎలా ఎదుగుతూ వచ్చారో అర్థం చేసుకోవాలి. చావు పుటకలు కూడా ఏమిటో తెలుసుకోవాలి. సామాజిక సమస్యలకు కారణాలను వాస్తు లోపాల్లో కాకుండా సమాజంలోనే వెతికి, వాటిని నిర్మూలించాలి. ప్రాణుల చరిత్రలో ఒక జాతి పూర్తిగా అంతరించిపోవడానికి పది లక్షలనుంచి కోటి సంవత్సరాల వరకూ పట్టవచ్చునని శాస్త్రవేత్తల అంచనా. ఈ లెక్కన మనుషుల చరిత్ర మొదలై ఆవగింజలో అరభాగం కూడా అవనట్టే అనుకోవాలి. ఇవన్నీ తెలుసుకుని మనచుట్టూ ఉన్న ప్రపంచాన్నీ, సమాజాన్నీ వివేచనతో అవగాహన చేసుకోవడం ఆధునికుల మనుకునే వారికి తప్పనిసరి. వీ

## అటవీ భూముల సంరక్షణ చట్టం గాలికి

అటవి భూముల్లో ఇప్పటి వరకు 1,00,871 హెక్టార్ల భూముల్లో గనుల తవ్వకానికి అనుమతి ఇచ్చినట్టు కేంద్రం ప్రకటించింది. 2005లో అటవి భూముల సంరక్షణ చట్టం అమలులోకి వచ్చినప్పటి నుంచి గనుల తవ్వకంకోసం వచ్చిన 1,309 దరఖాస్తులకు అనుమతి ఇచ్చామని కేంద్ర పర్యావరణ మంత్రి జైరామ్ రమేశ్ లోక్‌సభలో తెలిపారు. ప్రస్తుతం దేశవ్యాప్తంగా 12,14,871 హెక్టార్లలో తవ్వకాలు జరుగుతున్నాయని, అందులో అత్యధికంగా ఆంధ్రప్రదేశ్‌లో 2,88,943 హెక్టార్లలో తవ్వకాలు జరుగుతున్నాయని తెలిపారు.

## భోపాల్ దుర్ఘటనకు ఇరవై అయిదేళ్లు

మధ్యప్రదేశ్ రాజధాని భోపాల్ లో యూనియన్ కార్బైడ్ ఇండియా లిమిటెడ్ కు చెందిన కర్మాగారంలో 1984 డిసెంబర్ 2-3 అర్ధరాత్రి మిథైల్ ఐసో సయనేట్ అనే విష వాయువు వెలువడింది. ఆ విషవాయువు ప్రభావం వల్ల ఇరవై అయిదు వేల మంది చనిపోయారు. దుర్ఘటన జరిగిన ఇరవై అయిదు ఏళ్ల తరువాత చుట్టుపక్కల భూగర్భ జలాలు ఇంకా విషపూరితంగానే ఉన్నాయి. అప్పటి బాధితులకు సరైన నష్టపరిహారం ఇవ్వడంలోగానీ, ఆ ప్రాంతంలోని విషపూరిత వ్యర్థాలను తొలగించడానికిగానీ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సరైన చర్యలు తీసుకోలేదని పలు సంస్థలు నేటికీ పోరాడుతూనే ఉన్నాయి.

## మైనింగ్ చరిత్రే అక్రమం

అక్రమ మైనింగ్ వల్ల ఇటు ప్రభుత్వానికి కానీ, అటు ప్రజలకు కానీ ఎటువంటి ప్రయోజనం కూడా కలగలేదని కర్ణాటకలోని లోకాయుక్త సంతోష్ హెగ్డే తేల్చి చెప్పారు. అక్రమ మైనింగ్‌ను అడ్డుకోవడంలో ప్రభుత్వం విఫలమైందని తీవ్రస్థాయిలో ధ్వజమెత్తారు. అన్ని ఖనిజాల ఎగుమతులపైనా తక్షణమే నిషేధం విధించాలని కర్ణాటక ప్రభుత్వానికి సూచించారు. ఇదే పరిస్థితి కొనసాగుతే భావితరాలకు ఎటువంటి ఖనిజ సంపద మిగులదు. ఖనిజ సంపదంతా రాబోయే 30 ఏళ్లలో పూర్తిగా కరిగిపోతుంది అని హెగ్డే ఆందోళన వ్యక్తం చేశారు.

## ముప్పైయేళ్ల తరువాత ...

ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని లోహరి గ్రామంలో దళితులను హత్య చేసిన నేరస్తులకు 30 ఏళ్ల తరువాత శిక్ష పడింది. 9 సెప్టెంబర్ 1979న ఏడుగురు దళితులను ఠాకూర్ కులస్తులు నరికి చంపారు. వారి హత్యాకాండకు సంబంధించిన ఆనవాళ్లను తుడిచేయడమే కాకుండా శవాలను గంగా నదిలోకి విసిరేశారు. ఈ కేసుకు సంబంధించి జస్టిస్ దల్వీర్ భండారీ, జస్టిస్ ఎ.కె. పట్నాయక్‌లతో కూడిన ధర్మాసనం డిసెంబర్ 5న విచారణ చేపట్టింది. ఈ కేసులో ఐదుగురికి సుప్రీంకోర్టు యావజ్జీవ శిక్ష విధించింది. శిక్షను ప్రకటిస్తూ కుల వ్యవస్థ రోజు రోజుకు అధికమవుతోందని ప్రజాస్వామ్యం మనుగడ సాగాలంటే కుల వ్యవస్థను సత్వరమే నిర్మూలించాలని సుప్రీం కోర్టు తెలిపింది.

## లోక్‌సభలో కోటీశ్వరులు

ప్రస్తుత లోక్‌సభలో కోట్లలో ఆస్తులు ఉన్న ఎంపీల సంఖ్య పెరిగిపోతోంది. అసోసియేషన్ ఆఫ్ డెమోక్రటిక్ రిఫామ్స్ (ఎడిఆర్) అనే స్వచ్ఛంద సంస్థ ఎంపిలకు సంబంధించిన ఆస్తుల వివరాలు సేకరించింది. సేకరించిన తాజా నివేదిక ప్రకారం గత ఐదేళ్ల కాలంలో కోటి దాటిన సభ్యుల సంఖ్య 156 నుంచి 315కు పెరిగింది. 2004లో సభ్యుల ఆస్తుల విలువ సగటున 1.86 కోట్లు ఉండగా, అది 2009 పార్లమెంట్ ఎన్నికల నాటికి 5.33 కోట్లకు పెరిగిందని తెలిపింది. రాష్ట్రంలోని ఖమ్మం లోక్‌సభ (టిడిపి) సభ్యుడు నామా నాగేశ్వరరావు 173 కోట్ల ఆస్తులతో మొదటి స్థానంలో ఉండగా, కాంగ్రెస్ ఎంపి నవీన్ జిందాల్ 131 కోట్లతో రెండో స్థానం, విజయవాడ ఎంపి లగడపాటి రాజగోపాల్ 122 కోట్లతో మూడో స్థానంలో ఉన్నారని ఆ నివేదిక పేర్కొంది.

## ఖైదీల సంఖ్యలో భారత్‌ది ఐదో స్థానం

ప్రపంచంలోని జైళ్లలోని ఖైదీల సంఖ్యపై లండన్‌కు చెందిన కింగ్స్ కళాశాల ప్రపంచలోని 218 దేశాలు, కేంద్ర పాలిత ప్రాంతాల్లో సర్వేనిర్వహించింది. భారత్‌లోని 1,336 జైళ్లలో 3.73 లక్షల మంది ఖైదీలు ఉన్నట్టు సర్వేలో తేలింది. ప్రపంచంలోని జైళ్లలో మగ్గుతున్న ఖైదీల సంఖ్యలో భారతదేశం ఐదోస్థానంలో ఉంది. అమెరికాలోని జైళ్లలో23.1 లక్షలతో మొదటి స్థానంలో అగ్రరాజ్యమైన అమెరికాఉంది. రెండో స్థానంలోఉన్న చైనాలోని ఖైదీల సంఖ్య 15.70 లక్షలు, రష్యాలోని ఖైదీల సంఖ్య 8.9 లక్షలు, బ్రెజిల్‌లో 4.7 లక్షలుగా ఉంది. ప్రపంచం మొత్తం మీద 98 లక్షల మంది ఖైదీలు ఉన్నట్టు గుర్తించారు. వీ

## వలసలను నిరోధిస్తున్న బ్రిటన్

**యూ**రప్ వెలుపలి నుంచి బ్రిటన్‌కు వచ్చే విదేశీ వైద్యులు, ఇతర వృత్తి నిపుణుల రాకను కట్టడి చేస్తామని బ్రిటన్ ప్రధాని గార్డన్ బ్రౌన్ హామి ఇచ్చారు. విదేశీయుల వలసలను కట్టడి చేయడం వల్ల భారతీయ వృత్తి నిపుణులపై ప్రభావం చూపగలవని భావిస్తున్నారు. బ్రిటన్‌కు వెళుతున్న విదేశీ నిపుణులకు అడ్డుకట్ట వేసేందుకు కొద్దినెలల్లోనే కట్టుదిట్టమైన చర్యలు తీసుకుంటామని 'డెయిలీ మెయిల్' పత్రికకు ఇచ్చిన ఇంటర్వ్యూలో బ్రౌన్ చెప్పారు.

## ఉల్ఫా చైర్మన్ అరెస్ట్

**ఉ**ల్ఫా అగ్రనేతలైన రాజ్‌ఖోవా, రాజు బారువా, రాజా బోరాలను బంగ్లాదేశ్ నిఘా వర్గాలు డిసెంబర్ 4న ఢాకాలో అరెస్ట్ చేశాయి. డిసెంబర్ 5న ఉదయం పోలీసులు న్యాయస్థానం ముందు బేడీలతో హాజరుపర్చడంపై ఉల్ఫా అగ్రనేతలు అగ్రహం వ్యక్తం చేశారు. పదకొండు సంవత్సరాల కిందటి కేసులో న్యాయస్థానం వారికి 12 రోజుల రిమాండ్‌కు ఆదేశించింది. బంగ్లాదేశీయులు తమను మోసం చేసారని రాజ్‌ఖోవా అన్నారు. అసోం 'సార్వభౌమత్వమే' తమ ధ్యేయమని ఇందుకోసం చర్చలకు సిద్ధమేనని ఆయన తెలిపారు. నేషనల్ లిబరేషన్ ఫ్రంట్ ఆఫ్ త్రిపుర (ఎన్‌ఎల్‌ఎఫ్‌టి) అధ్యక్షుడు బిశ్వమోహన్ కూడా బంగ్లాదేశ్ నిఘా వర్గాలకు పట్టుబడ్డారు.

## కోపెన్‌హాగెన్ సదస్సు

**ప్ర**పంచవ్యాప్తంగా పెరుగుతున్న భూతాపం వల్ల జరిగే నష్టాల నుంచి పర్యావరణాన్ని కాపాడే ప్రయత్నంలో భాగంగా కోపెన్‌హాగెన్ సదస్సు డెన్మార్క్‌లో డిసెంబర్ 7న ప్రారంభమైంది. సంపన్న, వర్ధమాన దేశాలలో కార్బన్ కాలుష్యాలను తగ్గించాలనే డిమాండ్‌తో ఈ సదస్సులో చర్చలు సాగాయి. ఈ సందర్భంగా ఒక ముసాయిదాని తయారు చేశారు. భూతాపం వల్ల జరిగే పంటనష్టాల వంటి సమస్యలను ఎదుర్కోవడానికి సంపన్న దేశాలు వర్ధమాన దేశాలకు 2020 నాటికి 10 వేల కోట్ల డాలర్ల ఆర్థిక సాయం అందించాలని ముసాయిదాలో పేర్కొన్నారు. భూతాపం పెరుగుదలను రెండి డిగ్రీల సెల్సియస్‌కు (పారిశ్రామిక విప్లవం కన్నా ముందు కాలంతో పోల్చితే) పరిమితం చేయాలన్న భారత్ ప్రతిపాదనకు ఆమోదం తెలిపింది. ఈ సదస్సు డిసెంబర్ 19న ముగిసింది.

## నేపాల్‌లో మావోయిస్టుల నిరసనలు

**నే**పాల్‌లో మళ్లీ మావోయిస్టులు నిరసనలు ప్రదర్శనలను ప్రారంభించారు. గత మే నెలలో మాజీ ఆర్మీ ఛీఫ్ రుక్మాంగద్ కతావల్‌ను పునర్నియమిస్తూ అధ్యక్షుడు రామ్‌బరణ్ యాదవ్ తీసుకున్న నిర్ణయాన్ని వెనక్కు తీసుకోవాలనే డిమాండ్‌తో మావోయిస్టులు డిసెంబర్ 20 నుంచి మూడు రోజులపాటు బంద్‌కు పిలుపునిచ్చారు. ఈ సందర్భంగా దేశ రాజధాని కాట్మాండులో మావోయిస్టులు రహదారులను దిగ్బంధించారు. ఈ నియామకాన్ని వెనక్కి తీసుకునే వరకు ఈ ఆందోళనలు కొనసాగుతాయని మావోయిస్టు నేతలు హెచ్చరించారు.

## మహిళలపై లంక సైనికుల అఘాయిత్యాలు

**శ్రీ**లంక శరణార్థి శిబిరాల్లో తమిళ శరణార్థుల పట్ల శ్రీలంక సైనికులు చేస్తున్న అఘాయిత్యాలు వెలుగుచూస్తున్నాయి. ముఖ్యంగా మహిళలను లైంగికంగా వేధించి, వారిని అత్యాచారం చేయడం లాంటి సంఘటనలు చోటు చేసుకుంటున్నాయని బ్రిటిష్ దినపత్రిక 'అబ్జర్వర్' తెలిపింది. తమ లైంగిక అరాచకాలకు అంగీకరిస్తేనే వారికి తిండి పెట్టేవారని ఈ అఘాయిత్యాలను కళ్లారా చూసిన బ్రిటిష్ వైద్య విద్యార్థిని వాణీ కుమార్ తెలిపారు. ఈ శిబిరాలు హిట్లర్ కాలం నాటి కాన్సన్‌ట్రేషన్ క్యాంపులుగా ఉన్నాయనీ, ఒకరితో ఒకరిని మాట్లాడుకోనిచ్చేవారు కాదనీ, మహిళలపై, బాలికలపై సైనికుల లైంగిక అత్యాచారాలు సాగించడం అక్కడ సర్వసాధారణమేనని ఆమె అన్నారు. శ్రీలంక ప్రభుత్వం కూడా ఈ ఆరోపణలను అంగీకరించింది. వీ

*(... 7వ పేజీ తరువాయి)*

ప్రతిపాదనను వ్యతిరేకించిన వారు పెట్టిన ప్రతివాదన సారాంశం – విప్లవోద్యమం పౌరహక్కుల ఉద్యమానికి తల్లి వంటిది. తల్లిని వ్యతిరేకించకూడదు అనో, లేక పిడబ్ల్యుజి కి నష్టం కలిగించే ఏ ప్రతిపాదనను తాము సమర్థించమని తెగేసి చెప్పడమో. దశాబ్దాలుగా పౌరహక్కుల కార్యక్రమాలలో ఏ పార్టీ నినాదాలు వినపడేవో వేరే చెప్పనవసరం లేదు.

మానవ హక్కుల సంస్థ అంతా ఇతర ఎంఎల్ పార్టీలో, పిడబ్ల్యుజి వ్యతిరేకులో – అదేదో అపరాధం అన్నట్లు – అంటూ లచ్చయ్య ఒక పచ్చి అబద్ధం చేర్చారు. హైదరాబాద్, విశాఖపట్నంలో ఉన్న తొలితరం విరసం సభ్యులను ఎవరిని అడిగినా ఎచ్‌ఆర్‌ఎఫ్ లో ఉన్న ముఖ్యులు విద్యార్థి, యువజన కార్యక్రమాలలో, 80ల దశకంలో రాత్రి, పగలు అన్న తేడా చూడకుండా ఎవరికి సహాయం చేశారో చెబుతారు. ఇక పార్టీ భావజాలం, పార్టీ వ్యతిరేకుల అజమాయిషీ మాటకొస్తే – 15 సంవత్సరాల క్రితమే మార్క్సిజం ను తిరస్కరించిన వ్యక్తి పిడబ్ల్యుజి పార్టీ భావజాలంతో పనిచేసాడు అంటే అర్థం పిడబ్ల్యుజి పార్టీది మార్క్సిస్ట్ భావజాలం కాదు అనుకోవాలా? అమ్మ పుట్టిల్లు మేనమామకు తెలియదనుకోవాలా? తన రచనలలో, ముఖ్యంగా ఆంధ్రజ్యోతి వ్యాసాలలో, బాలగోపాల్ మావోయిస్టుల చర్యలను వ్యతిరేకించాడు గాని, పిడబ్ల్యుజి/మావోయిస్ట్ 'వ్యతిరేకత నిండి ఉన్న' ఇతర ఎచ్‌ఆర్‌ఎఫ్ సభ్యులు ఎవరూ మావోయిస్ట్‌లను పెద్దగా వ్యతిరేకించిన దాఖలాలు లేవు. బహుశా వారు బాలగోపాల్‌ను తమ అజమాయిషీలో ఉంచుకొని ఆయన చేత రచనలు చేయించి ఉండవచ్చు. ప్రజల పక్షాన పోరాడుతున్న ఏకైక సంస్థ మావోయిస్ట్ పార్టీ గుర్తించాడు – ఆ మాట బాలగోపాల్ ఎక్కడా – ఆయన పిడబ్ల్యుజి ని బలంగా సమర్థిస్తూ ఇపిడబ్ల్యు లో రాసిన రోజులతో సహ – అన్నట్లు దాఖలాలు లేవు. ఆయన ప్రధాన సిద్ధాంతకర్తగా ఉన్న ఎచ్‌ఆర్‌ఎఫ్ అవగాహనలో కూడా దీనికి విరుద్ధంగానే బహుళ ఉద్యమాల ప్రస్తావన ఉంది. ఒకవేళ అది లచ్చయ్య గారి అభిప్రాయం అయితే తన అభిప్రాయంగా ప్రకటించుకునే నిజాయితీ ఉండాలి. ఈ మొత్తం తప్పులతడకల ప్రయాసలో విచారించదగ్గ విషయం ఏమిటంటే బాలగోపాల్ జీవితాచరణ ఎంఎల్ పార్టీల ముందు నిలబెట్టిన తాత్విక, ప్రజాస్వామిక, నైతిక సవాళ్లను గుర్తించక పోవడమే. ఆ ప్రశ్నలతో తలబడి వాటిని అభావం (హెగెలియన్ అర్థంలో) చేయగలిగే సూత్రీకరణలు చెయ్యగలిగితే, విప్లవోద్యమానికి అంతిమంగా సమాజానికి ఎంతో మేలు చేసిన వారమవుతాం. రాజ్యం, అధికారం, అంగ బలం కోల్పోయిన, భేషజం మాత్రం వదులుకోని కింగ్ లియర్ పరిస్థితి ఇది.

– కె. నరేంద్రమోహన్
మెల్‌బోర్న్, ఆస్ట్రేలియా

# అసహజ మరణాల సూచి

సంకలనం : రాంకి, వై. రామచంద్రం

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(21 నవంబర్ 2009 నుండి 20 డిసెంబర్ 2009 వరకు అసహజ మరణాల పాలైన వారి సంఖ్య – 1734)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు: వ్యవసాయ రంగం | ఆత్మహత్యలు: చేనేత రంగం | ఆత్మహత్యలు: ఇతరాలు స్త్రీ | ఆత్మహత్యలు: ఇతరాలు పు. | చికిత్స అందక, అనారోగ్యం: స్త్రీ | చికిత్స అందక, అనారోగ్యం: పు. | చికిత్స అందక, అనారోగ్యం: పి. | గుర్తు తెలియని: స్త్రీ | గుర్తు తెలియని: పు. | హత్యలు: స్త్రీ | హత్యలు: పు. | ప్రమాదాలు: పనిచేసే స్థలంలో | ప్రమాదాలు: కరెంట్ | ప్రమాదాలు: రహదారి | ప్రమాదాలు: ఇతరాలు | పోలీసు కాల్పుల్లో: ఉద్యమ కారులు | పోలీసు కాల్పుల్లో: ఇతరులు | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| **(1)** | **(2)** | **(3)** | **(4)** | **(5)** | **(6)** | **(7)** | **(8)** | **(9)** | **(10)** | **(11)** | **(12)** | **(13)** | **(14)** | **(15)** | **(16)** | **(17)** | **(18)** | **(19)** | **(20)** | **(21)** | **(22)** |
| ఆదిలాబాద్ | – | 8 | – | 13 | 21 | 4 | 8 | 6 | 1 | 3 | 2 | 3 | – | 3 | 31 | 26 | 2 | – | – | 4 | – |
| హైదరాబాద్ | – | – | – | 5 | 8 | – | – | – | 5 | 9 | 2 | 5 | 2 | – | 47 | 9 | – | – | – | 11 | – |
| కరీంనగర్ | – | 13 | – | 24 | 55 | 19 | 46 | 6 | 5 | 11 | 1 | 5 | – | 3 | 26 | 12 | – | – | – | 4 | – |
| ఖమ్మం | – | 5 | – | 7 | 15 | 3 | 12 | 9 | 1 | 2 | 4 | 1 | 3 | 1 | 23 | 5 | 1 | – | – | – | – |
| మెదక్ | – | 5 | – | 12 | 10 | 7 | 11 | 2 | 3 | 1 | 3 | 4 | 3 | 4 | 30 | 3 | – | – | – | – | – |
| నిజామాబాద్ | 1 | – | – | – | 12 | 12 | 1 | 1 | 2 | – | – | 2 | 8 | 5 | 15 | 2 | – | – | – | – | – |
| రంగారెడ్డి | – | 1 | – | 12 | 12 | 4 | 13 | 1 | 5 | 5 | 2 | 3 | 1 | 1 | 44 | 4 | – | – | – | – | – |
| వరంగల్ | – | – | – | 8 | 40 | 5 | 12 | 3 | – | 6 | 1 | 2 | – | 5 | 14 | 24 | – | – | – | – | – |
| అనంతపురం | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| చిత్తూరు | – | – | – | 7 | 2 | 5 | 1 | – | – | – | 3 | 7 | 7 | – | 10 | – | – | – | – | – | – |
| కడప | – | 2 | – | 5 | 9 | 5 | 4 | 2 | 2 | 3 | 2 | 1 | 4 | 2 | 15 | 4 | – | – | – | – | – |
| కర్నూలు | – | 11 | – | 20 | 22 | 4 | 7 | 3 | 2 | 13 | – | 5 | 2 | 4 | 47 | 29 | – | – | – | – | – |
| తూర్పు గోదావరి | – | – | – | 15 | 16 | 3 | 8 | 4 | 1 | 4 | 1 | 1 | 4 | 1 | 51 | 21 | – | – | – | 2 | – |
| గుంటూరు | – | 1 | 1 | 6 | 7 | 6 | 10 | 1 | 1 | 4 | 3 | 5 | – | 5 | 27 | 7 | – | – | – | 1 | – |
| కృష్ణా | – | 3 | – | 9 | 7 | 3 | 4 | – | – | – | 4 | 7 | 4 | – | 24 | 8 | – | – | – | – | 4 |
| పశ్చిమ గోదావరి | – | 3 | – | 8 | 2 | 3 | 1 | – | – | – | 3 | 2 | – | – | 13 | 5 | – | – | – | – | 2 |
| శ్రీకాకుళం | 1 | – | 1 | 2 | 3 | 2 | 3 | 5 | 1 | 1 | 1 | 3 | 3 | – | 11 | 6 | – | – | – | – | – |
| విశాఖపట్నం | – | – | – | 6 | 8 | 2 | 4 | 2 | – | – | 1 | 5 | 2 | 2 | 57 | – | – | – | – | 3 | – |
| విజయనగరం | – | – | – | 2 | 3 | – | – | 2 | – | 3 | 2 | – | 2 | – | 18 | 13 | – | – | – | – | – |
| మొత్తం | **2** | **52** | **2** | **161** | **252** | **87** | **145** | **47** | **29** | **65** | **35** | **61** | **45** | **36** | **503** | **178** | **3** | **–** | **–** | **25** | **6** |

అందిస్తున్నవారు : ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ఎల్. సంతోష్; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎన్. భగవాన్‌రెడ్డి; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – శంకరయ్య, వరంగల్ – ఎ.కుమార్; అనంతపురం – సుమలత; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – బి. దస్తగిరి; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – మహమ్మద్ ఇబ్రహీమ్ సాహెబ్; గుంటూరు – బి. అంజమ్మ ; కృష్ణా – బి. రమేష్‌బాబు; పశ్చిమ గోదావరి – టి. హేమలత; శ్రీకాకుళం – జి. సుధీర్; విశాఖపట్నం – కె.వి. అరుణ; విజయనగరం – డి. సుధాకర్




వ్యవసాయం, పరిశ్రమలు, సేవారంగం, ఆర్థిక వ్యవహారాలు,
ఉపాధి, పాలన, ప్రాంతీయ అసమానతలు,
ప్రజా ఉద్యమాలు, తదితర అంశాలపై

## వి. హనుమంతరావు

వ్యాసాల సంకలనం

## మీరు - నేను - ఆర్థికం

**రు. 60**




110 ఏళ్లలో 14 దేశాలపై అమెరికా దురాక్రమణల చరిత్ర

## స్టీఫెన్ కింజర్

'ఓవర్ త్రో' కు

కొణతం దిలీప్ తెలుగు అనువాదం

## కుట్రాజకీయం

అమెరికా దుర్మార్గాల శతాబ్ది

**రు. 40**




యాభై సంవత్సరాలలో ఆంధ్రప్రదేశ్ సాధించిన అభివృద్ధి - వెనుకబాటుతనం,
విజయాలు - వైఫల్యాలు, రాజకీయార్థిక, సామాజిక పరిణామాలు,
వాస్తవాలు - విశ్లేషణలు, గణాంకాలు నలభై వ్యాసాల సమగ్ర సంకలనం (ఇంగ్లీష్)

సంపాదకులు : ఆర్.ఎస్. రావు, వి. హనుమంతరావు, ఎన్. వేణుగోపాల్

## ఫిఫ్టీ ఈయర్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్

**సాదా ప్రతి : రు. 225**

ప్రతులకు, వివరాలకు:

## వీక్షణం

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3 హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495,
ఇమెయిల్ : veekshanam2003@gmail.com, reachcdrc@yahoo.com
సర్క్యులేషన్ మేనేజర్ : 9949391028

**VEEKSHANAM** Telugu Monthly Journal of Political Economy and Society - 102 - January 2010
• RNI Regn.No.APTEL/2003/11482• Published on 29/12/2009 • Postal Regn. No. LII/RNP/HD/1100/2008-10

# నిరుపేదకు సైతం కార్పోరేట్ వైద్యం..

## ఆరోగ్యశ్రీతో అందరికీ ఆరోగ్యం








**శ్రీ కె. రోశయ్య**
ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి



- రాష్ట్రవ్యాప్తంగా రెండు కోట్ల రెండువేల కుటుంబాలకు (రాష్ట్ర జనాభాలో 85% ప్రజలకు) ఆరోగ్య భీమా
- 942 వ్యాధులకు వర్తింపు, మరో 22 వ్యాధులను చేర్చే యోచనలో ప్రభుత్వం
- హైదరాబాద్‌లోని గాంధీ, ఉస్మానియా ఆసుపత్రులు, విశాఖపట్నంలోని కింగ్ జార్జ్ ఆసుపత్రులలో 3 డయాలసిస్ యూనిట్లు ప్రారంభం. త్వరలో రాష్ట్రవ్యాప్తంగా మరో 8 యూనిట్ల ప్రారంభం.
- ఇప్పటివరకు 14,511 ఉచిత వైద్య శిబిరాలలో 25,21,814 మందికి వైద్యపరీక్షలు
- ఔట్ పేషెంట్లుగా 6,57,944 మంది, ఇన్ పేషెంట్లుగా 5,28,505 మందికి చికిత్సలు
- రికార్డుస్థాయిలో 4,54,668 మంది రోగులకు శస్త్రచికిత్సలు
- ఇప్పటివరకు రాజీవ్ ఆరోగ్య శ్రీ పథకానికి చేసిన వ్యయం 1374.23 కోట్ల రూపాయలు
- రాష్ట్రవ్యాప్తంగా 350 ప్రభుత్వ, ప్రైవేట్ ఆసుపత్రులలో ఆరోగ్యశ్రీ కోసం 16,604 ప్రత్యేక పడకలు
- పథకం పర్యవేక్షణలో 1600 మంది పారామెడికల్ సిబ్బంది
- ఆరోగ్య శ్రీ సేవలలో 802 అంబులెన్స్‌లు (108 అంబులెన్స్‌లు), 475 సంచార ఆరోగ్య కేంద్రాలు (104 సర్వీస్‌లు)




**హెల్ప్‌లైన్ టోల్ ఫ్రీ నెంబరు**
**1800-425-7788**

R.O.No. 448/Sou/Advt.I/2009-10 Dt. 18-12-2009

**నిండు ప్రాణాలని నిలిపేది రాజీవ్ ఆరోగ్య శ్రీ**

జారీచేసినవారు: సమాచార, పౌర సంబంధాల శాఖ

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Charitha Impressions, 1-9-1126/B, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao